# భూమిక

స్వాతంత్ర్యానంతరం హిందీ నవలా రచనలో మౌలికమైన మార్పు వచ్చింది. గ్రామాలపట్ల కొత్త అవగాహన, చైతన్య దృష్టి అని అనాలి దానిని. అయితే గాంధీజీ "గ్రామాలే భారతదేశానికి హృదయం" అన్నారు కనక, జాతీయోద్యమ సంఘర్షణ యొక్క సంవేదనకి యిది పొడిగింపని అనుకోవచ్చు. గాంధీజీ తన నిర్మాణాత్మక క్రియాకలాపానికి గ్రామాలనే ఉపాదేయం చేసుకొన్న సంగతి విదితమే. నవలా ప్రక్రియలో దీనికి ప్రేమ్‌చందే ఆద్యుడు.

ఇక్కడ విశేషమేమిటంటే గ్రామాలను మిగిలిన అన్ని ప్రాంతాలతో సరిసమానంగా చూడడం కాక ఆ మాండలిక విశిష్టతను, జాతీయ ప్రవృత్తిని, ఆర్థిక, సామాజిక, మానవీయ సంబంధాలని అధ్యయనం చేయడం జరిగింది. నవలా రచనలలో సమాజ శాస్త్రీయ దృష్టికి యిది ఒక సింహద్వారం వంటిది.

నగరాలకే పరిమితమై ఉండిన సంప్రదాయ వ్యతిరేక ఉద్యమ స్ఫూర్తి కూడా హిందీ సాహిత్యంలో ఆధునిక రూపురేఖలు దిద్దింది.

అందుచేత భారతీయ నవలలని గ్రామాలు, మాండలికాలు ప్రాతిపదికల మీద రచింపబడిన రచనల మాధ్యమంలోంచే గుర్తించగలుగుతాము. ఈ "గంగమ్మ తల్లి" నవల అటువంటి పరంపరలోని ప్రారంభ రచనలలో ఒకటని చెప్పవచ్చు.

ప్రవాహశీలమైన ఒక నదితో ఈ సంప్రదాయాన్ని రచయిత సంకేతించినట్లు ఈ నవల పేరే చెబుతుంది. ఈ సంప్రదాయం ప్రాచీన కాలం నుంచి నేటి వరకు జనజీవితాన్ని ప్రభావితం చేస్తోంది. సంఘటితం చేస్తోంది. శక్తిస్రోతస్వినిగా అలరారుతోంది. ఈ దృష్టితో చూసినప్పుడు "గంగమ్మ తల్లి" ఒక ప్రత్యేక శీర్షిక. ఈ నవలలో "గంగ"ని ఒక జడ వస్తువుగా, మిథ్యా స్మృతిగా కాక వ్యాపక శక్తిగల చైతన్య స్రవంతిగా విస్తరించడం జరిగింది.

రచనాత్మక దృష్టితో ఒక విశిష్ట భాష్యం చెప్పడం జరిగింది. మొత్తం నవల అంతా యీ భాష్యానికి సృజనాత్మక ప్రస్తరణం. కాగా 'గంగ' నవల కథనానికి కేంద్రస్థానం. ఇది ఈ నవలలో ఒక విశేషం. అలాఅని గంగకి మనుష్య రూపం యివ్వలేదు. పౌరాణిక కథలలో అటువంటి కల్పనలు కనిపిస్తాయి. ఇక్కడ ఈ నవలలో కఠోర వాస్తవాల చైతన్యవల్లిగా గంగని ఉల్లేఖించడం జరిగింది. వరద వచ్చినప్పుడు అన్నింటినీ ముంచెత్తే ప్రళయశక్తిగా, సస్యశ్యామల ధరిత్రికి సజీవ శక్తి దాతగా గంగ కనిపిస్తుంది.

నవలలో ప్రధాన పాత్రధారి మటరూ జీవితంలోని కష్టసుఖాలు ఈ సత్యాన్ని సాక్షాత్కరింపజేస్తాయి. భౌతికపరమైన హెచ్చుతగ్గులతోబాటు గంగమ్మతో అతనికి గల మానసిక బంధాన్ని తెల్పడం ద్వారా ఆమెకి మాతృస్థాయిని కల్పించడం జరిగింది. అందుచే ఈ నవల "గంగమ్మ తల్లి" భావుకత కల్పించే భ్రమల నుంచి కథనాన్ని ఈ విధంగా రచయిత పరిరక్షించారు. గంగ ఇక్కడ జలస్వరూపిణి. మృణ్మయమూర్తి. అందుచే మటరూకి గంగా జలాలు ఎంత ఇష్టమో అక్కడి మట్టిఅన్నా అంతే ఇష్టం.

పాశ్చాత్య నవలల్లో వలే ఇక్కడి మనుష్యులు ప్రకృతి విరుద్ధులు కారు. ప్రకృతి వీరికి అవిభాజ్య అస్తిత్వం. గ్రామసీమలలోకి మనుష్యులు నీటితో, మట్టితో, గాలితో అవినాభావ సంబంధాన్ని ఏర్పరుచుకొన్నారంటే రచయిత ఆ బంధాన్ని కాల్పనిక దృష్టితోకాక కథాక్రమంలో జనజీవితాన్ని ప్రకృతిని అనుసంధానం చేసి వర్ణించారు. అక్కడి మనుష్యుల హృత్ప్రాకారాంతరిత భావాలను రచయిత వారి సంప్రదాయంలో నుంచే గ్రహించి ఉల్లేఖించడం విశేషం.

ఈ లఘు నవలలోనే కథ గంగాతీరపు రెండు, మూడు స్థానాలలో జరుగుతుంది. రెండు, మూడు సమస్యల్ని స్పృశిస్తుంది. సామాజిక కట్టుబాట్ల మాధ్యంపై తిరుగుబాటు ఈ నవలకి లక్ష్యం. గోపీ తన వదిన గారిని ఆమె వితంతువు కాగా వివాహం చేసుకొనేందుకు ఉద్యమించటం ఒకటి. ఈ కథని కుటుంబ మర్యాదలు, గ్రామ సంస్కృతి నేపథ్యంలోంచి గ్రహించారు. గోపీ సంప్రదాంప క్షత్రియ కులస్థుడు. ఒకవైపు ఈ కట్టుబాట్లు పతనం అవుతుండడం రెండవవైపు కొత్త ఆలోచనలు అంకురించడం జరుగుతుందనే వాస్తవాన్ని రచయిత ఇక్కడ స్పష్టం చేశారు. పైగా ఆయన ప్రగతిశీలవాది. అందుచేత అర్థరహితమైన కట్టుబాట్లుపై అభ్యుదయ భావ విజయాన్ని

ప్రతిపాదించారు. ఈ క్రమ పరిణామంతోనే గ్రామీణ ప్రేమైక జీవనాన్ని సూచించారు. ప్రేమ కథకి ఆలంబనం చేసుకొన్నారు. పతనమవుతున్న జమీందారీ వ్యవస్థలోంచి, విచ్ఛిన్నం అవుతున్న కుటుంబ పద్ధతిలోంచి కొత్త విధానాలు పల్లవించి పరిపోషింపబడతాయనే దార్శనిక దృష్టిని రచయిత ప్రదర్శించారు. అందుకే దుష్ట సంప్రదాయ బద్ధులైనవారు నిర్భయంగా పారిపోయి పెళ్ళి చేసుకొనే ఒక కల్పనని రచయిత చేశారు. ఇది సాహసోపేతమైన ప్రతిపాదన.

ఈ మాండలిక ప్రేమగాథను గుర్తించడమే రచయిత లక్ష్యం కాదు. కనుకనే ఆ జానపదుల నిర్భీకతను, స్వచ్ఛందతను, నిర్మలత్వాన్ని ఎంత అందంగా వివరించాడో మానసికంగా వారి వెనుకబడినతనాన్ని అంత నిష్కర్షగానూ ఉల్లేఖించాడు. వారి సరళత మూఢత్వం అంచునకు చేరిఉంది. అక్కడ యెన్నో ప్రమాదాలు, కష్టాలు వారిలో మూఢత్వం వలన ప్రాప్తించినవే. "వారెంత స్వచ్ఛందులో, శక్తిశాలురో, స్వతంత్రులో అంతకన్నా యెక్కువ వజ్రకఠోర మూర్ఖులు అంటాడందుకే. మాటిమాటికీ కర్ర ఎత్తడం, హత్యలు చేయడం, రక్తపాతానికి పాల్పడడం, కలహాలు, పంటలు కోసుకొని పోవడం, కుప్పలకు నిప్పుపెట్టడం, ఇవన్నీ రేపటి వికృతులవుతాయి", అనే వర్ణన చూడండి.

మానసికపరమైన ఈ వెనుకబడినతనాన్ని రూపుమాపే చైతన్యాన్ని గ్రామీణులలో కలిగించే భావన రచనలో జరిగింది. తాత్కాలిక నవలా రచయితలలో ఫణీశ్వరనాథ రేణు, నాగార్జునుల నవలలలో ఈ దిశగా జాగరణ జరిగింది.

ఈ నవలలో మటరూ ద్వారా మరొక వాస్తవాన్ని చిత్రించడం జరిగింది. అదే ఆర్థిక దోపిడీకి వ్యతిరేక పోరాటం. స్వతంత్రం వచ్చిన తర్వాత కూడా మన సమాజంలో ఈ ఆర్థిక వ్యత్యాసాలు దోపిడీ అలాగే ఉన్నాయి. ఈ నవలలో కనిపించే మల్లయోధులు, వస్తాదులు కుస్తీ పోటీలలో పాల్గొని ప్రజల కీర్తనలతో సరిపెట్టుకొనే స్వభావం గలవారు. మటరూ అటువంటి వాడుకాడు.

అతడు సాహసికుడు, వ్యక్తిగత వైభవంతో కాక ఆర్థిక దోపిడీకి వ్యతిరేకంగా సమాజాన్ని జాగృతం చేయడం అనే స్ఫూర్తితో ఉద్యమించినవాడు. ఈ

నవలలో ప్రధాన సూత్రధారి మటరూయే. ఒకవైపు సామాజిక వికృతులపై యుద్ధం ప్రకటించి, రెండవవైపు ఆర్థిక దోపిడిపై సమరభేరి మ్రోగించినవాడు.

నవలా రచన సరళతరంగా సాగింది. వర్ణన ప్రణాళిక, పరంపరాగత కథాప్రవచన పద్ధతి పాఠకుణ్ణి ఉత్కంఠతతో చదివింపజేసే ప్రయోజనాన్ని సాధించాయి. కథకి, పాత్రలకి, ప్రదేశాలకి సంబంధం లేని వర్ణనలు, కల్పనలు ఇందులో లేవు. వాటి వలన రచనకు "వర్ణసాంకర్య" దోషం అంటుతుంది. అటువంటి సాహిత్యానికి రచయిత తావు ఇవ్వలేదు. అవసరమైనచోట, అవసరమైన మేరకు వర్ణన చేసి రచయిత కథని నడిపే ఒడుపును ప్రదర్శించారు.

సరళంగా ఉన్నంత మాత్రాన కథాగత జటిలత దెబ్బతినలేదు. నీటిపై తేలే మంచు ఖండిక నీటిలో బలంగా కుదురుకొన్నట్లు సారళ్యంపై గహనత నిండిఉంది. ఇది ఈ నవల యొక్క ఒక ముఖ్యవిశేషం. జటిల సమస్యని సరళంగా చెప్పడమే ఉత్కృష్ట రచన యొక్క లక్షణం. ఈ దృష్టితో చూసినా "గంగమ్మ తల్లి" ఒక మంచి రచన. ఆనాటి హిందీ నవలలో ఇటువంటి "మహత్వ రచన" కానరాదు.

అతిసహజంగా కనిపించే ఒక కథని ఆధారం చేసుకొని తాత్కాలిక యుగపు మౌలిక సమస్యలను విశ్లేషించడం "గంగమ్మతల్లి" యొక్క ప్రముఖ విశిష్టత.

"గంగమ్మతల్లి" కథల సమాహారం కాదు. ఇటువంటి కథలు ఆనాటి హిందీ సాహిత్యంలో అడుగడుగునా కనిపిస్తాయి. కాని ఆ కథల వెనుక పాత్రల సంవేదన మనల్ని వెంటాడుతుంది. అందుచే రచయిత ఆ కథలకి ప్రాణాధారమైన అక్కడి మట్టిని, గాలిని, నీటిని రంగరించారు. మానవ సంబంధాలకి, ప్రకృతి అనుబంధానికి మధ్యగల అవిభాజ్యం అనురాగాన్ని అందంగా వర్ణించారు. ఇదియే ఒక్క ప్రాంతానికి మాత్రమే పరిమితమైనది కాదు. ప్రకృతిలో మనిషికి గల అనుబంధం సార్వదేశికం. సర్వకాలికం అని కథనం ద్వారా రచయిత మనస్ఫురణకు తెస్తారు.

ఫ్రాన్స్ దేశపు ప్రచురణ సంస్థ దీనిని భాషాంతరీకరించి ప్రచురింపజేయడం, అక్కడ యిది పాఠక విమర్శక ప్రశంసలు పొందడం - ఈ నవల యొక్క సార్వజనీనతకుని కషోఫలం. ఉత్తమ, మౌలిక రచన లక్షణం అదే కద.

ఈనాటి అన్ని సమాజాలలో ప్రకృతి వ్యతిరేక కార్యక్రమాల వికృతులు అనుభవానికి వచ్చిన దృష్ట్యా "గంగమ్మ తల్లి" నవల ప్రాధాన్యం మరీ పెరిగింది. పర్యావరణ పరిరక్షణ యీనాటి మౌలిక కర్తవ్యం అయింది. గతానికీ, వర్తమానానికి గంగ ఒక సంప్రదాయ వారధి. ప్రకృతికి మనుష్యులకు మధ్యగల అవిభక్త బంధానికి ఆ వారధి ఒక ప్రతీక. మనిషికి ప్రకృతి ప్రసాదించిన వరద హస్తం. ఈ ఆధునిక యుగంలో కూడా ప్రకృతితో అవిచ్ఛిన్న బంధాన్ని కొనసాగించి వస్తున్న మానవ సమూహం ఉంది. అంచేత "గంగమ్మ తల్లి" నవలను ఈ అన్ని సందర్భాల దృష్ట్యా పఠించాలి.

– విజయ్ మోహన్ సింగ్

# ఒకటి

ఆ రోజు ఉదయం గోపీచంద్ వదినగారు పరారీ అయింది. ఆమె వితంతువు. ఈ మాటని ఎవరికి వారు తమ మనసులోనే ఉంచేసుకోవాలని, పక్కవారి చెవిలో కూడా వేయరాదని ఆ వీధి ప్రజలు అందరూ నిశ్చయించుకొన్నారు. అలాగే మిన్నకుండిపోయారు. అయినా ఏం జరిగిందో "ఎలా జరిగిందో" తెలీదు కాని గోపీచంద్ ఇంటి తలుపుని ఒక ఠాణేదారు, ఒక పోలీసు, ఒక చౌకీదారు వచ్చి దబదబ బాదారు. అందరి కళ్ళలో కోపాకారం కనిపిస్తోంది. ఒక దొంగని పట్టుకొందుకు జరిగే హంగామా వాతావరణం అక్కడ నెలకొంది. గుమిగూడిన వారందరి మనస్సులో అలాగే అనుకొన్నాయి.

పెద్ద దరోగా అక్కడ చేరిన అందరినీ కురకురచూసి, పోలీసువైపు తిరిగి గర్జిస్తున్నట్లు "వీళ్ళందరికీ సంకెళ్ళు వెయ్యి !" అని అరిచాడు. అలా అరుస్తూనే చౌకీదారువైపు తిరిగి "నువెళ్ళి గ్రామపెద్దకి ఈ కబురు చెప్పిరా" అని పురమాయించాడు. మళ్ళీ గుమిగూడిన గ్రామస్తుల వైపు ఘూర్లిల్లిచూసి, నిట్టూరుస్తూ అక్కడి మంచం మీద కూలబడ్డాడు. ఆ సమయంలో అతడి బుర్రమీసాలు కదిలాయి.

ప్రజలందరూ కొయ్యబొమ్మల్లా ఎక్కడి వారక్కడ నిశ్చేష్టులై నిలిచి ఉన్నారు. ఎవరికీ నోటిమాట పెగలటం లేదు. ఏం మాట్లాడతారు?

వాళ్ళందరి చేతులకు బేడీలు వేసి పోలీసు వాళ్ళని దరోగా ముందు కూర్చోబెట్టాడు. ఇంకవాళ్ళ నోళ్ళేం పెగులుతాయి.

ఇంతలో గ్రామస్తులు అక్కడికి బిలబిల చేరారు. గోపీచంద్ ముసలి తల్లి అంతవరకు తలుపుచాటుగా ఉండి మౌనంగా ఈ దృశ్యాన్ని చూస్తోంది. ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది. విధవరాలయిన కోడలపై ఎక్కడ నుంచి ఆమెకంత ప్రేమ పుట్టుకొనివచ్చిందో చెప్పలేం. గోపీచంద్ ముసలితండ్రికి కీళ్ళనొప్పులు వ్యాధి ఉంది. తిరగలేక మంచంమీదే ఉంటాడు. ఇప్పుడూ అతని పరిస్థితి అదే. బయట జరుగుతున్న గొడవ, ముసలి భార్య ఏడుపు విని మంచంమీద లేచి కూర్చుని సంగతేమిటని అరుస్తున్నాడు. ఎవరో వచ్చి అతనికి విషయం చెప్పాలని.

ఆ వూళ్ళో గోపీచంద్ నమ్మకస్తుడయిన ఒక రైతు. చక్కటి శరీర సౌష్టవం, కండపుష్టి ఉన్న అతని వయస్సు 30 సంవత్సరాలు. ఎవరినీ లెక్కచేయని స్వభావం అతనిది. ఇంత గొడవ జరిగినా ఆ గుంపులోంచి ఏ ఒక్కరూ వచ్చి అతనికి మద్దతుగా ఒక్కమాటకూడా మాట్లాడకపోవడానికి ఇదే కారణం. చేతికి సంకెళ్ళతో, తలవంచుకొని మౌనంగా కూర్చున్న అతను ఎందుకు నోరు విప్పడం లేదో అక్కడ వారికి అంతుచిక్కలేదు" ఇందులో అతని తప్పేం ఉంటుంది? రాజపుత్రులకు ఈ గ్రామంలో వితంతువు అయిన స్త్రీ విషయంలో ఇలా జరగడం కొత్త ఏమీకాదు. పతితులైన వారు ఎందరో వితంతువుల పేర్లు వాళ్ళ పెదిమలపై కదలాడాయి. ఏమైనప్పటికీ ఒక ఇంటి కోడలు ఒక ఇంటి గౌరవమర్యాదలని మంటగలిపి ఇలాగ పరారీ అవడం ఆ వంశ ప్రతిష్టకి కళంకం చేయడమే. ఆ అభిమానంతోనే గోపీచంద్ మౌనంగా ఉండి ఉంటాడు. ఎంత ఆత్మాభిమానికయినా ఇలాంటి ఎదురుదెబ్బలు తగులుతాయి.

పేదవాళ్ళజోలికి పోలీసులు రారు. ఇలాంటివి జరిగినప్పుడు హంగామా చేస్తారు. పేదవాళ్ళతో గొడవపడడం వలన చేతుల్లో ఏంపడదు. వృధాప్రయాస, వాళ్ళచేత తిట్లు ఎందుకని పోలీసులు పేదల వ్యవహారాలలో జోక్యం చేసుకోరు. చిన్నదైనా, పెద్దదైనా గొడవంటూ వస్తే డబ్బున్న వాళ్ళ వ్యవహారాలలోనే పోలీసులు కలుగజేసుకుంటారు. ఆత్మాభిమానం ఉన్న వాళ్ళని పోలీసులు పీడిస్తారు. దరోగా గోపీచంద్‌ని గురించి, అతడి ఆత్మగౌరవాన్ని గురించి ఎంతగానో చెప్పాడు. అందుకే ఇంతవరకు అతడిని

ఎవరూ ఏంచేయలేక పోయారు.

గ్రామపెద్ద రావడంతోనే దరోగా అగ్గిమీద గుగ్గిలం అయ్యాడు. నానాదుర్భాషలాడాడు. రకరకాల చూపులు విసిరాడు. బెదిరించాడు. సవాళ్ళు చేశాడు. కాని క్రియ ఏమీలేదు. అతడి అన్ని చేష్టల్ని గ్రామపెద్ద మందహసంతో చూశాడు. దరోగా అర్ధాంతరంగా నిలిపివేసిన, మరిచిపోయిన పనులను ఆయన పూర్తి చేశాడు. తర్వాత గోపీచంద్‌ని, ఆ వీధి నిందితుల్ని పరామర్శగా చూసి, వాళ్ళకి యేదో చెప్పి వారి తరఫున తనే వకాల్తా పుచ్చుకొని దరోగాతో యిలా అన్నాడు.

"దరోగాజీ ! ఒకసారి జైలుకి వెళ్ళివచ్చి కూడా ఈ గోపీచంద్‌కి బుద్ధి రాలేదు. వీడు మళ్ళీ జైలుకు వెళతాడు. మనం ఎంతని వీడిని కాపాడగలం. ఒకసారి జైలుపక్షి అని ముద్రపడితే ఇంక సాక్ష్యాలు, సిఫార్సులు అక్కరలేదని వీడికి తెలిసినట్లు లేదు.

ఈ మాటలకి గ్రామపెద్ద మిగిలినవారివైపు తిరిగి "వీళ్ళు కూడా ఈ భాగాన్ని మోస్తున్నారు" అన్నాడు. ఆ సమయంలోనే దరోగా తన ఎత్తువేయడానికి సిద్ధం అయ్యాడు. గ్రామపెద్ద మౌనం వహించగానే దరోగా బిగ్గరగా యిలా అన్నాడు. "అయ్యా! ఇది ఆషామాషీ వ్యవహారం కాదు. ఒక కుటుంబ గౌరవ సమస్య. మానమర్యాదల సమస్య. రేపు నేను ఎవరికైనా జవాబు చెప్పవలసి వస్తుంది కదా."

దరోగా ఆంతర్యం గ్రామపెద్దకి అర్థం అయింది. "ముల్లుని ముల్లుతోనే తీయాలని ఆలోచించి" అతడిని ప్రక్కకు పిలిచి ఏదో గుసగుసలాడాడు. పదినిమిషాల తర్వాత ఇద్దరు తిరిగివచ్చారు.

దరోగా తన జేబులోంచి పెన్సిలు, నోట్‌బుక్ తీసుకొని "గోపీచంద్ నువ్వేం చెప్తావో చెప్పు " అని పోలీసువైపు తిరిగి సంజ్ఞ చేశాడు. అక్కడి గుంపుని పోలీసు చెదరగొట్టాడు. జనం వెళ్ళిపోయారు.

గోపీచంద్ సాక్ష్యం, వా జ్మూలం ఏమీ యివ్వలేదు. దరోగాయే రాసేసుకొన్నాడు.

గోపీచంద్ వదినగారు తాడు, బకెట్ తీసుకొని నూతి దగ్గరకు వెళ్ళింది. అక్కడ చెమ్మనేల మీద నిలబడి నీళ్ళుతోడే ప్రయత్నం చేస్తుండగా కాలుజారి ఆమె నూతిలో పడి మరణించింది.

ఇది దరోగా రాసిన రిపోర్టు. గోపీచంద్ డబ్బుసంచి నోరు తెరిచింది.

న్యాయస్థానం నోరుమూసుకొంది. ఈ కథ ముగిసింది.

గ్రామంలో రకరకాల మాటలు వినవచ్చాయి. మరణించిన వారిగురించి చెడుగా చెప్పుకోవడం వాళ్ళ ఆత్మని క్షోభపెట్టడమే అని ప్రజలు క్రమంగా ఈ సంగతి మరిచిపోయారు. ఇది ఒక స్మృతిగా మిగిలిపోయింది. కాని ....

# రెండు

గోపీచంద్ ఇద్దరు అన్నదమ్ములలో చిన్నవాడు. పెద్దవాడు మాణిక్ చంద్, ఇద్దరికి రెండేళ్ళు తేడా. తండ్రి జోడెడ్ల వ్యవసాయం చేస్తున్నాడు. పాడి గేదెలు ఉన్నాయి. అన్నదమ్ములిద్దరూ గేదెపాలు తాగి కండలు పెంచి వూరిలోని తాలింఖానా కసరత్తులు చేసి కండబలం సాధించారు. తిని, తిరిగి, ఒళ్ళు బలిసేలా చేసుకొందుకు వయస్సే సరైనది. అందుచే తండ్రి వాళ్ళని అచ్చోసిన ఆంబోతులవలే వదిలివేశాడు. సంసారభారం మెడకు తగిలాక ఎవరు మాత్రం కండబలం సంపాదించగలరు. ఈ వయస్సులో తిన్నతిండి, సంపాదించిన బలం జీవితాంతం అక్కరకు వస్తుంది.

వికసిస్తున్న యౌవ్వనానికి స్వేచ్ఛ దిలాసా, పాలు, వ్యాయామం - ఇవన్నీ కలిపి వాళ్ళ శరీరాలని ఎద్దుల వలె బలిసేటట్లు చేశాయి. వాళ్ళిద్దరూ గోదాలో దిగి మల్లయుద్ధం చేస్తుంటే ప్రజలు రెచ్చిపోయి పందేలుపై పందేలు కాసుకొని సంబరపడేవారు. గోదాలో శరీరానికి అంటిన ధూళికి వారు సింహాలు వలె కనిపించేవారు. ఇంటికి చేరిన ఆ రామలక్ష్మణులకు తల్లిదండ్రులు దుమ్ముదులిపి సేదదీర్చేవారు. వాళ్ళకళ్ళు గర్వంతో వెలిగేవి. తల్లి వాళ్ళకి దిష్టితీసేది. తండ్రి మనస్సులో వాళ్ళని శుభాలు కలగాలని దీవించేవాడు.

పెరుగుదల ఎంత గొప్పదో ఆగర్వోద్ధతి అంత చెడ్డది. అది మనిషిని గుడ్డివాణ్ణిగా చేసేస్తుంది. ఇద్దరు అన్నదమ్ముల బలపరాక్రమం గురించి చుట్టు ప్రక్కల గ్రామాలలో బహుళ ప్రచారం జరగడంతో వారిలో ఒక మత్తు ఆవరించింది.

బాల్యక్రీడగా ప్రారంభం అయిన కసరత్తు, కుస్తీ చివరకు ఒక అలవాటుగా, వ్యసనంగా మారిపోయింది. కండల్ని, బలాన్ని పెంచుకొవడమే వాళ్ళిద్దరూ పరమావధిగా పెట్టుకొన్నారు. దీనికి తల్లిదండ్రులు, గ్రామస్తులు ప్రోత్సాహం అందించారు. మాణిక్, గోపీచంద్ సోదరులు తమ గ్రామం పేరును నలుప్రక్కలా వ్యాపింపజేస్తారని అందరూ ఆనందించారు. వాళ్ళు కూడా అందుకు కటిబద్ధులయారు. వాళ్ళ పోషణ కోసం ప్రతిరోజూ బలవర్ధక ఆహారం తయారయేది. మేకలు నరకబడేవి. నేతి తాలింపుల ఘుమఘుమలు వ్యాపించేవి. తన సంపాదనని తండ్రివాళ్ళ పోషణకే ఖర్చు చేసేసేవాడు. డబ్బు చాలనప్పుడు పశువుల్ని అమ్మకం పెట్టేవాడు.

ఈ విధంగా వాళ్ళిద్దరి శరీరాలు వయస్సు కన్నా ఎక్కువ పెరిగాయి. ఏనుగుగున్నల్లా అయ్యారు. వాళ్ళిద్దర్నే బరిలో వదిలితే ముష్టియుద్ధం చేస్తూచేసే భీకర ధ్వని చాలాదూరం వినిపించేది. రెండు ఎద్దులు రంకె వేస్తున్నట్టు ఉండేది. ఆ దృశ్యం వాళ్ళిద్దరూ గోదాలో వేసే బలమైన అడుగులకి అక్కడి నేల కృంగేది. మల్లచరిస్తే, చేయిచేయి కలిపితే వచ్చే ధ్వని పిడుగు చప్పుడులా ఉండేది. రెండు కొండలు ఢీకొని పోట్లాడుతున్నట్లు వారు గంటలు తరబడి గోదాలో మల్లవిద్యని ప్రదర్శించేవారు. గోదాలో నేల అదిరేది. వాళ్ళద్దరి శరీరాల నుంచి చెమట ధారలు కట్టేది. అప్పుడు వారు బయటకు వచ్చేవారు. గోదా వెలుపలికి వచ్చిన వారి శరీరాలను స్నేహితులు శిష్యులు సేదతీర్చి, చెమట తుడిచి, దుమ్ముదులిపేవారు.

చివరికి వారి బలదర్పాలు అదుపుతప్పే స్థితి ఏర్పడింది. అపారశక్తి కిరణాలు వాళ్ళ శరీరాల నుంచి ప్రసరించేవి. ఆ బలోద్ధతి శరీరకండరాల నుంచి ఏక్షణంలో అయినా సరే విరుచుకుపడేటట్లుంది. రక్తంలో వేడిభావాల ఆవిర్లుచిమ్ముతుండేవి. ముఖంపై రక్తరాగిమ ప్రకాశిస్తుండేది. విశాల ఫాలభాగం, ధృడ శరీరం, నెత్తురుజిమ్మే కళ్ళు, బుర్రమీసాలు, బలమైన కంఠం, విశాలమైన వక్షస్థలం, కండలు తిరిగిన భుజాలు బలిష్ఠమైన తొడలు, శక్తి బిగిసిన పిడికిళ్ళు - వాళ్ళిద్దరూ నడిచివెళుతొంటే ఏనుగులు విహరిస్తున్నట్లు

ఉండేది. వాళ్ళ బలోద్ధతికి దిక్కులు వంగినట్లు అనుపించేది. కొందరు వాళ్ళకి భక్తితో నమస్కరించేవారు. కొందరు వాళ్ళకి భయపడి పక్కకు తప్పుకొనేవారు.

మగపిల్లలిద్దరూ యింతగా ఎదగడంతో తల్లిదండ్రులకు ఆనందం, గర్వం కలిగాయి. వాళ్ళని చూసి గ్రామస్తులు తమ దగ్గర ప్రశంసిస్తే తండ్రి ఆనంద గద్గదస్వరంతో యిలా అనేవాడు.

"వీళ్ళు సింహకిశోరాలు. ఇన్నేళ్ళు మేం కన్న కలలు ఫలించాయి. ఈ గ్రామంలో వీళ్ళని ఎదిరించి నిలువగల వాళ్ళెవరు. వీళ్ళముందు తలఎత్తుకొని తిరగ గల వాళ్ళెవరు?"

అతడి మాటలు విని గ్రామస్తులు యిలా అనేవారు. "వీళ్ళింకా పిల్లలు, నువ్వు తండ్రివి. విచిత్రం ఏమిటంటే పెద్దవాళ్ళైపోయినా పిల్లలు తండ్రికి చిన్న వాళ్ళుగానే కనిపిస్తారు. పెరిగే యౌవ్వనం కరిగిపోక తప్పదు. అంచేత వీళ్ళని మన గ్రామానికే పరిమితం చేయక యితర గ్రామాలతో కూడ కుస్తీలు పట్టించాలి. మన జిల్లాలో, మన రాష్ట్రంలో, మన దేశం అంతా వీళ్ళ కీర్తి వ్యాపించాలి. అందుకు సమయం ఇదే. ఈ సమయంలో నువ్వు ఎలాంటి వాత్సల్యం వ్యామోహంలో పడినా వాళ్ళ భవిష్యత్తు, వాళ్ళ శక్తి సామర్థ్యాలు వృథా అయిపోతాయి. వీళ్ళని ఆశీర్వదించి, ప్రోత్సహించి పంపించు, మనవూరి పేరును నలుదిశలా వ్యాపింపజేయాలి."

తన కొడుకులు శక్తిసామర్థ్యాలు గురించి ఆ తండ్రికి సరైన అంచనాలేదు. కాని కొడుకులు కీర్తిమంతులు కావాలనే కోరిక అతడికీ ఉంది. అయినా పుత్రవాత్సల్యం అతడిని వివశుణ్ణి చేస్తోంది. గ్రామస్తుల మాటలు విని అతడు చిరుహాసం చేసేవాడు. వాళ్ళ పొగడ్తలు ఒకవంక గర్వాన్ని కలిగించినా, బిడ్డలకు ఎలాంటి అపకారం జరగరాదనే కోరిక సన్నగా కదలాడేది. అంతలోనే బిడ్డలు కీర్తి గురించిన ఆలోచన వచ్చేది.

పేరు ప్రతిష్ఠలు, యశోవైభవాలు అక్కరలేదనుకొనే వారెవరు ? అలా అని యితరుల ఎదుట వాట గురించి ప్రస్తావించి, అవి అక్కరలేదని డంభాలు పలికి, వాటి మహత్తుని కించపరిచే వాచాలత్వాన్ని, వెర్రితనాన్ని ఎవరూ ప్రదర్శించరు. అలా అనడం ఒకరకమైన లోభత్వమే అవుతుంది. వాళ్ళ తండ్రి తెలివితక్కువవాడేమీ కాదు. అనుభవం ఉన్నవాడు. అతడు మనసులోని ఆలోచనలని పైకి తెలియనివ్వక విరక్తిని ప్రదర్శిస్తూ యిలా అన్నాడు.

"మీరందరూ దీనినే కోరినట్లయితే నేనేం అడ్డుపెట్టను. వాళ్ళమీద నాకెలాంటి అధికారం వుందో ఈ గ్రామానికి కూడా అలాంటి అధికారమే ఉంది. ఈ గ్రామపు మట్టి, నీరు, గాలి కలిసి వాళ్ళ శరీరాలు పెరిగాయి. నాకు చెప్పిన మాటల్నే వాళ్ళకి మీరే చెప్పండి. వాళ్ళిప్పటి వరకూ స్వేచ్ఛగానే వున్నారు. ఇంకే పనిచేయాలనుకొన్నా వాళ్ళ యిష్టం."

గ్రామస్తులు ఆనందించి అన్నదమ్ముల దగ్గరకు వెళ్ళారు. తండ్రి అనుమతించిన మాటని వాళ్ళకి చెప్పి యిలా అన్నారు.

"ఇప్పుడు చెప్పండి. మీ యిద్దరిలో ఎవరు ముందుగా కుస్తీకి వస్తారు?"

విచిత్రం యేమిటంటే వాళ్ళిద్దరూ గోదాలోదిగి బద్ధశత్రువుల వలె పోట్లాడుకొంటారు. గోదా వెలుపల పరస్పరం ప్రేమాభిమానాలతో వ్యవహరిస్తారు. రామలక్ష్మణుల ప్రేమబంధంతో వారిని సరిపోల్చవచ్చు. గ్రామస్తుల మాటవిని గోపీచంద్ యిలా అన్నాడు.

"నేను ఉండగా అన్నయ్య గోదాలో దిగడానికి వీలులేదు. మా నాన్న ఆశీర్వాదం, అన్నయ్య శుభాకాంక్షలు నిండుగా తీసుకొనే అధికారాన్ని దేవుడు నాకే యిచ్చాడు."

మాణిక్ చంద్ కన్న గోపీచంద్ వయస్సులో చిన్నవాడు కాని శక్తిసామర్థ్యాలు అన్నగారి కన్న తక్కువ ఏమీకాదు. ఒక ఆకు యెక్కువే చదివాడు. ఆ సంగతి అన్నగారికీ తెలుసు. గ్రామస్తులకూ తెలుసు. కుస్తీకి తన సంసిద్ధతని గోపీచంద్ ముందుగానే వ్యక్తం చేయడంతో గ్రామస్తులు ఆనందించారు.

మంచి సమయాన్ని చూసి పురోహితులు గోపీచంద్ పేరున "బస్తీమే సవాల్" అని పేరొందిన పహిల్వాన్‌ల దగ్గరకు కబుర్లు చేశారు. ఇక్కడ గోపీచంద్ తయారు కాసాగాడు.

అప్పటికే వీరిద్దరి గురించి వస్తాదులు వినడమేకాదు ఒకసారి చూసారు కూడా. వాళ్ళలో ఎవరికీ ఈ అన్నదమ్ముల్ని ఎదిరించే సాహసం లేదు. ఊరి బ్రాహ్మణులు, క్షురకులు, ఒక్కొక్కరే వస్తాదుల దగ్గరకు వెళ్ళి సవాళ్ళు చేసివచ్చారు. కాని ఎవరికి వారు యేదోఒక వంకపెట్టి తప్పించుకొన్నారు.

ఆఖరుకు వస్తాదులలో పేరొందిన ముసలి వస్తాదు జోఖాపహిల్వాన్ గోదాలోకి దూకాడు. ఒక యువ వస్తాదు సవాలు చేసి గోదాలోకి రమ్మని తాంబూలం పంపిస్తే మిగిలిన వస్తాదులు ఎందుకు మిన్నకుండిపోయారనే

ఆలోచన లేకుండా జోఖా బరిలోకిదిగాడు. అక్కడి వస్తాదులలో చాలామంది అతని చేత దెబ్బతిన్న వారు, మరికొందరు శిష్యులు, ఇంకొందరు స్నేహితులున్నారు. జోఖా యౌవ్వనంలో సాధించిన విజయం నేటికి అలాగే చెదరకుండా ఉంది. ఎవ్వరూ అతనితో పోరాటానికి సాహసించలేకపోయారు. వస్తాదుల ప్రపంచంలో నేటికీ అతని మాటే చెల్లుతోంది. కాని యిప్పుడతను యువకుడు కాడు. ముసలివాడయాడు. గోపీచంద్‌తో తలపడి తానింత కాలం ఆర్జించుకొన్న కీర్తిప్రతిష్ఠల్ని కోల్పోతానని జోఖాకి పూర్తిగా తెలుసు అయితే మాత్రం ఏమి ?

బ్రాహ్మణులు, క్షురకులు, వాడవాడలా తిరిగి గోపీచంద్ తరఫున సవాలు ప్రచారం చేశారు. అతని శక్తిసామర్థ్యాలు దండోరా వేశారు. జోఖా దగ్గర్నించి కూడా వారలాగా వెళ్లిపోతే ప్రజలు ఏం అనుకొంటారు.

అందుకే ఆ వృద్ధ సింహం జూలు విదిలించింది. ఒక వస్తాదు సవాలు విసిరి ఎదిరించలేక వెళ్ళిపోవడం ఎంత నామర్దా. కాని జోఖా ముసలివాడయాడు, శరీరంలో సత్తువలేదు. అయినా అతను పాతకాలం వాడు. ఆ కాలపు రక్తం ఉన్నవాడు. అసలైన మగాడు. పౌరుషం ఉన్నవాడు. అందుకే సవాలు విని మిగిలిన వారివలె తల ఎలా వంచుకోగలడు? పిరికిపందయ్యె ఎలా వెనుకంజవేయగలడు? అందుకే తాంబూలాన్ని అందుకొన్నాడు. "జై భజరంగ భళి" అని గర్జించి తాంబూలాన్ని నోటిలో వేసుకొన్నాడు.

ఈ సంగతిని విని ఆశ్చర్యపడిన ప్రజలు జోఖా వస్తాదు ధైర్యానికి చేయెత్తి అభినందించారు. "ఈ ప్రాంతం యువ వస్తాదులందరూ యిక నీటిలో దూకి చావాలి" అని వారు అరిచారు. గోపీచంద్ యీ మాటవిని చిన్నబుచ్చుకొన్నాడు. తన తండ్రి వయసున్న జోఖాతో పోట్లాడడం తనికి అవమానం, అదేమీ గొప్పకాదు.

సమవయస్కుడు, సహబలవంతుడు అయిన వస్తాదులతో పోరుగెలవడం మర్యాద. కాని యిప్పుడు చేయగలిగేది ఏమీలేదు. సవాలు విసిరాక, ఒక వస్తాదు రంగంలోనికి వస్తానంటే యిక వెనుదిరగడం పాటికాదు.

xx xx xx

ఆ తిథి రానే వచ్చింది. గ్రామంలో గోదావద్ద చుట్టూ తోరణ పతాకాలు అలంకరించారు. రంగురంగుల ముగ్గులు దిద్దారు. మల్లయుద్ధ పోటీ ప్రారంభం కావడానికి చాలాముందు నుంచే జనం అక్కడకు రాసాగారు. ఒకరిని చూసి మరొకరు రెచ్చిపోయి అందరూ "జై భజరంగభళీ" అని చేస్తున్న నినాదాలు ఆకాశాన్ని అంటుతున్నాయి. అలాంటి సందర్భంకోసం ఎదురు చూసి, తన ప్రతాపాన్ని ప్రదర్శిద్దాం అనుకొన్న గోపీ మనస్సులో మాత్రం అలాంటి ఉత్సాహం, ఉద్వేగం లేనేలేవు. కాని పైకి ఆ గుంపుతోబాటు తానూ తెచ్చిపెట్టుకొన్న ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నాడు.

గోదాకి రెండు వైపుల గోపీ, జోఖూల వర్గాలు మోహరించి నిలిచాయి. ఇరువర్గాల వారు జయజయధ్వానాలు చేస్తున్నారు. పెద్దగా చప్పట్లు చరుస్తున్నారు. వాతావరణం అంతా వీరరసం అవరించింది. అక్కడి గుంపులో ఆనందం, ఉత్సుకత మెరుస్తున్నాయి. అందరూ గోదా దగ్గరికి తోసుకొనివచ్చి గుమిగూడారు. గోపీ, జోఖూల మద్దతుదారులు వారిద్దరిని ప్రశంసిస్తూ, రకరకాలుగా ఉత్సాహపరుస్తూ ప్రేరేపిస్తూ ఎవరికివారు పందేలు కట్టుకొన్నారు. కొందరు వాళ్ళ భుజాలు చరిచి అభినందనలు తెలుపుతున్నారు. మరికొందరు వాళ్ళతో కరచాలనం చేసి విజయ శుభాకాంక్షలు చెప్తున్నారు. వయస్సులో చిన్నవారైనవారు, శిష్యులు వాళ్ళకిపాదాభివందనం చేసి, విజయలక్ష్మి వరించేటట్లు చూడమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నారు.

గోపీ గోదాలోకి దూకాడు, అంతకుముందే మాణిక్ అతని చెవిలో "తమ్ముడూ! జోఖూ పాతకాలపు వస్తాదు. ఎక్కువ అవకాశం యివ్వకు, ఒక దెబ్బవేసేసరికి వాడికి నషాళం అంటాలి. మళ్ళీ లేవకూడదు. కానీ ఒక సంగతి, నువ్వు నెగ్గితే లోకం ముసలాడితో నెగ్గడం పెద్దకష్టమా? అని అంటుంది. ఓడిపోతే ముసలాడిని జయించలేని దద్దమ్మవని పరిహాసం చేస్తుంది. అలాంటి అవకాశం జనానికి యివ్వవద్దు. జాగ్రత్తగా పోట్లాడు" - అని ఉపదేశం చేశాడు. హెచ్చరించాడు.

రెండవవైపు నుంచి జోఖూ గోదాలోకి దిగాడు. ఇరువర్గాల నుంచి బిగ్గరగా జయజయధ్వానాలు చెలరేగాయి. ఉత్సాహన్ని రెచ్చగొడుతూ చప్పట్లు చరుస్తున్నారు. ప్రేక్షకుల కళ్ళల్లో ఉత్సుకత పెరిగి అందరూ బొమ్మల్లా అయిపోయి చూస్తున్నారు.

వస్తాదులిద్దరూ వంగి గోదాలోంచి మట్టితీసి, కళ్ళకద్దుకొని నుదుటి ధరించి గురువుల్ని స్మరించుకొన్నారు. చేతులు కలిపే నిమిత్తం ఒకరికళ్ళలోఒకరు దృష్టిని కేంద్రీకరించి ముందంజవేశారు.

దగ్గరగా, ఎదురెదురుగా వచ్చి చేతులు చాచారు. చేతులవేళ్ళు అందాయి. వేళ్లచివుళ్ళను అలా స్పృశించుకొన్నారోలేదో షాక్ తిన్నట్లు కదిలారు. గోపీచంద్ కుడికాలుతో ముసలివాడి పొట్టపై తన్నడంతో అతను ఒక్కకేకవేసి గాలిలోకి తేలాడు. గాలిలో ఉండగానే మరొక చీత్కారం చేసి, గోదా ఒడ్డున ఒకచిన్న కొండశిఖరం కూలినట్లు నేలకొరిగాడు. గుంపు అంతా నిశ్శబ్దం ఆవరించింది. చప్పట్లు ఆగిపోయాయి. అతడి వర్గంవారు ఆదరాబాదరా అతడి దగ్గరికు వచ్చారు. వారిలో హాహాకారాలు వ్యాపించాయి, వంగిచూశారు. అతను శరీరం చల్లబడి పడి ఉన్నాడు. వాళ్ళ కళ్ళల్లో కోపం అగ్నికణాలు జ్వలించాయి.

"ఇది అన్యాయం, మోసం, చేయికలపకుండానే గోపీ, జోఖా వస్తాదుని చంపేశాడు. కుస్తీ నియమాలని వీడు ఉల్లంఘించాడు. వీడు పిరికిపంద, అందుకే యిలా చేశాడు. వీణ్ణి ప్రాణాలతో మేం వదలం" అనివారు ఎంతో గోలచేశారు. ఇలాంటి శాపనార్థాలే అక్కడ మిన్నుముట్టాయి. గోపీ స్తబ్దుగా నిలచిఉన్నాడు. హఠాత్తుగా యిది యెలా జరిగిందో అతనికి తెలీడం లేదు. కాని యిక యిప్పుడే ఏంచెప్పడానికి అవకాశం లేదు.

జోఖా వర్గం కర్రలెత్తితే గోపీ వర్గం వూరకుండిపోతారా? కర్రయుద్ధం తారస్థాయికి చేరింది. ఉత్సాహ వాతావరణం అంతా ఉద్విగ్నత, విహ్వలత చోటుచేసుకుంది. కొందరి తలలు పగిలినెత్తురు కారసాగింది. మరికొందరికి కాళ్ళు, చేతులు విరిగి ఆర్తనాదాలు చేయసాగారు. కొందరు జోఖా వాడిని పరిశీలించి, అది మందంగా కొట్టుకొంటూందని గ్రహించి, తమ వర్గాన్ని క్రమంగా శాంతింపజేశారు. గోపీకి స్థానబలం ఉంది. జోఖా పొరుగూరివాడు, అందుచే అతడివర్గం శాంతించారు. అలా శాంతించకపోతే అక్కడ వాళ్ళవాళ్ళెవరూ మిగిలేవారుకారు. క్రమంగా కర్రయుద్ధం ముగింపునకు వచ్చింది.

"కచేరిలో తేల్చుకొందాం" అని హెచ్చరించి వాళ్ళంతా వెళ్ళిపోయారు.

xx xx xx

అలాంటి వివాదంతో కచేరీకి ఫిర్యాదుకు వెళ్ళడం వాళ్ళకి అవమానమే తప్ప అభిజాత్యం యేమీ యినుమడించదు. ఏమైతేనేమీ జోఖా వస్తాదు యిలా విషాద మరణం చెందాడు. అతడి గ్రామస్తులు ఏమనుకొన్నారు. కచ్చేరికి ఎక్కలేదు. కాని దరోగా మాత్రం కిరికిరి పెట్టాడు, అయినా గోపీ వర్గం అతని చేయి తడిపారు, నోరు తీపిచేశారు. దరోగా నోరుమెదపలేదు.

అయిందేదో అయిపోయింది. కాని ఈ పరిణామంతో జోఖా గ్రామస్తులు గోపీపై కత్తిగట్టారు. రెండు గ్రామాల మధ్య శత్రుత్వం గొడవెలసింది. అయితే గోపీ మాత్రం విచిత్రంగా మారిపోయాడు. జోఖావస్తాదు హఠాన్మరణానికి తాను కారణం అన్న ఆలోచన అతడిని కృంగదీసింది. ఇంక గోదాలో దిగరాదని ఆ వృత్తిని, వ్యావృత్తిని వదిలి పెట్టేశాడు. అన్నగారు మాణిక్, వూరివారు అతని కెంతగానో నచ్చజెప్పారు. కాని అతను తన పట్టువదలలేదు. ఇప్పుడు అతను యింటి పనిలో తండ్రికి అన్నివిధాలా సహకరిస్తున్నాడు.

## మూడు

నెమ్మది నెమ్మదిగా ఇది పాతబడసాగింది. కొడుకుల పెళ్ళి చేయాలని తండ్రి ఆలోచనలో పడ్డాడు. అప్పటికే బంధువుల్లో కొందరు వచ్చి అడిగితే "అప్పుడే తొందరేం వచ్చింది" అని తిరస్కరిస్తూ వచ్చాడు. ఇప్పుడు విధివశాన ఒక బంధువు సంబంధం తెచ్చాడు. అతనికి ఆనందం కలిగింది. సీతా, ఊర్మిళ వంటి ప్రేమమూర్తులైన యిద్దరు అప్పచెల్లెళ్ళతో మాణిక్, గోపీల వివాహం గురించి మాటలు జరిగాయి. ఆడపిల్లలు సంపన్న కుటుంబీకులు, మగపిల్లలు మాదిరిగానే కోడళ్ళుకూడా లభించనున్నారు. కోడళ్ళని చూసుకోవాలని తల్లికూడా ఉవ్విళ్ళూరుతునే ఉంది. ఈ సంబంధం గురించి విన్న ఆమె భర్తతో "ఇంక ఆలస్యం దేనికి? మనకి అన్నివిధాలా తగిన కుటుంబం, మగపిల్లలిద్దరికీ అన్ని సంస్కారాలు

ఒకేసారిచేసాం. పెళ్ళిళ్ళు కూడా ఒకేసారి ఎంత త్వరగా వీలైతే అంత వేగంగా చేసేద్దాం" అంది.

ఆడంబరంగా వివాహం జరిగిపోయింది. గుణవంతులు, శీలవంతులు అయిన అందమైన యిద్దరు కోడళ్ళు యింటిలోకి అడుగుపెట్టడంతో యింటిలో కొత్తకళ వచ్చింది. తల్లిదండ్రుల ఆనందానికి అంతేలేదు. తాము విన్నదానికన్న అన్నివిధాలా రెట్టింపు అందచందాలు, గుణగణాలు ఉన్న కోడళ్ళు రావడంతో వాళ్ళ సుఖసంతోషాలకు అవధులే లేవు.

ప్రేమించే భార్యతోబాటు అభిమానించే వదినగారు లభించడంతో గోపీ ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. కుటుంబం, సంసారం ఎంతగానో అతనికి మోహకమైంది. అందుచే యిల్లువదిలి బయటికే వచ్చేవాడు కాదు. బయటి ప్రపంచంతో సంబంధాన్ని అతను ఒదిలేసుకొన్నాడు. అతను ఒకరకం పట్టుదల మనిషి. మొదట యింటి పనులలో, తర్వాత మల్లయుద్ధ విద్యలో అతనికి అభిరుచి ఏమీలేదు. ఇప్పుడు అతను ప్రవర్తిస్తున్నతీరు చూస్తే ప్రజలకి ఆశ్చర్యం వేస్తోంది. అతనితీరే మారిపోయింది. లోకాచారం, కట్టుబాట్లు వలన అతనికి భార్యతో కలిసిమెలిసే అవకాశం లేదు. స్వతంత్రంలేదు. వదినగారితో అయితే అవకాశం ఉంది. వదినతో కలిసి కబుర్లుచెప్పేవాడు. ఆనందంగా ఆమెతో మాట్లాడుతు యిల్లంతా సందడిచేసేసేవాడు. తల్లిదండ్రులకు ఆ కులాసా వాతావరణం, ఆవకాశం ఉండేవికావు. అయినా వదినా మరదుల స్నేహార్ద్రతలను చూసి అతనూ ఆనందించేవాడు. అన్నదమ్ముల ప్రేమ, అప్పచెల్లెళ్ళ ప్రేమ, వదినామరదుల ప్రేమ, సంతానంతో తల్లిదండ్రుల ప్రేమ, వధూవరుల ప్రేమ - ఇలా ఆ యింటిలో ఇరవైనాలుగంటలూ ప్రేమామృతవర్షం కురుస్తూనే ఉందా ? అనిపిస్తుంటుంది. ఆ వర్షంలో ప్రతిఒక్కరు ప్రతీక్షణం తడిసి తలమునకలవుతున్నారనిపిస్తుంది. అక్కడ దుఃఖం లేదు. కొరత లేదు. విచారం లేదు. అనుమానాలులేవు. అంతా ఆనందం.

ఈ పూలతోట ఎప్పుడూ అలా ఆనందంతో ఉంటే తోటలోని మొక్కలు ఎప్పుడూ పచ్చగాకలలాడుతూ ఉంటే అంతకన్నా కావాల్సింది ఏముంది? కాని శశిరం పులకరించని పూలతోట ప్రపంచంలో ఎక్కడ ఉంటుంది ?

ఆరునెలలుపాటు ఆనందంతాండవించిన ఆ యింటిలో ఒకనాటి రాత్రి ఆ ఆనంద వనంలో ఒకమూల విషాదాగ్ని అంటుకొంది. సత్యనారాయణ

వ్రతం కోసం సంభారాలు తెద్దామని మాణిక్ చంద్ పొరుగూరు వెళ్ళాడు. తిరిగి రావడంతో రాత్రి చాలా పొద్దుపోయింది.

జోఖా గ్రామపు సరిహద్దు మీదుగా అతను తిరిగి రావాలి. సామాన్ల సంచి భుజాన వేసుకొని మాణిక్ వేగంగానే అడుగులు వేస్తూ వస్తున్నాడు. ఆ గ్రామపు సరిహద్దు దగ్గర ఒక తోటలో నడుస్తున్న అతన్ని వెనుకగా కొందరు మనుష్యులు అనుసరించి వస్తున్నట్లు గుర్తించాడు. వెనుదిరిగి వాళ్ళని చూడాలనుకొన్నాడు. అంతలోనే పెద్ద కర్రదెబ్బ అతని తలపై పడింది. మొదట దెబ్బతో వెనువెంటనే మరికొన్ని కర్రదెబ్బలు అతనిపై పడ్డాయి. ఆ దెబ్బలకు అతని స్పృహ పోయింది. చాలాసేపు అతను కదలలేక అలాపడి ఉన్నాడు. తలపగిలింది. రక్తం ధారలు కట్టింది. ఇంతలోనే ఎవరో తన మెడపై కర్రతో నొక్కిపట్టినట్లు అతను గుర్తించాడు. కంఠాన్ని ఆ కర్ర బాగా నొక్కింది. అతని శ్వాసాగి పోయింది. కళ్ళు పొడుచుకొని వచ్చాయి.

ఆ శవాన్ని ఏం చేయాలా ? అని హంతకులు ఆలోచిస్తున్న సమయంలోనే కొందరు అటుగా రావడం జరిగింది. వాళ్ళు సంత నుంచే వస్తున్నారు. వాళ్ళ అలికిడి విని హంతకులు పరారి అయారు. దారిలో శవాన్ని చూసిన ఆ ప్రజలు ఆశ్చర్యపోయారు. పట్టణ ప్రజల వలె శవాన్ని హత్యని చూసి గ్రామీణులు పారిపోరు. అలాంటి సమయాలలో వారు కర్తవ్యం గురించి ఆలోచిస్తారు. వాళ్ళు వంగి శవాన్ని పరిశీలనగా చూశారు. అది మాణిక్ శవం అని గుర్తించారు. వాళ్ళ దుఃఖానికి అంతేలేదు. మాణిక్ సోదరులను, వారు శక్తిని, సాహసాన్ని చూడని వారక్కడలేరు. ఆ క్షణంలో వారికి గోపీ - జోఖాల కుస్తీ దృశ్యం గుర్తువచ్చింది. అంతే ఏం జరిగిందో, ఎవరు చేశారో వారు, పసికట్టేశారు. జోఖా గ్రామస్తులు చేసిన ఈ ఘాతుకానికి వారు కోపితులయారు. గోపీకి సంగతిని చెప్పిరమ్మని ఒకరిని పంపారు. బలగాన్ని తీసుకొని గ్రామస్తులు రావాలని కూడా సందేశం పంపారు. మాణిక్ హంతకులపై ప్రతీకారం తీర్చుకోవాలనివారు ప్రతిజ్ఞ పట్టారు.

"పాపం మాణిక్! అతని భార్య జీవితాంతం దుఃఖభాజనురాలైంది. ఈ పాపాత్ముల, పిరికిపందల బ్రతుకులు బండలుకాక తప్పదు. ప్రతీకారం తీర్చుకోవలసిందే. శవాన్ని మైదానానికి తీసుకువెళ్దాం." అని అతడి శవాన్ని తీసుకువెళ్ళారు. జనం పోగయారు.

గోపీ యింటికి కబురు అందింది. తల్లిదండ్రులు గుండెలు బాదుకొని విలపిస్తున్నారు. పాము కరిచినట్లు, అనిపించింది గోపీకి, అతను తల పట్టుకొని కూలపడిపోయాడు. కొంతసేపు ఏడ్చిన తండ్రి రాయిలా అయిపోయాడు. ఈ హఠాత్పరిణామానికి అతని మెదడు మొద్దుబారిపోయింది.

గ్రామం అంతా ఈ విషాద వార్త దావానలం వలె వ్యాపించింది. నలువైపులా గంభీర విషాదం ఆవరించింది. గ్రామస్తులందరూ కర్రలు తీసుకొని గోపీ యింటికి చేరారు. అందరిలో కోపం, దుఃఖకనిపించాయి. స్త్రీలు మాణిక్ తల్లిని, భార్యని ఓదారుస్తున్నారు. కాని యువ రక్తం ఫూరుకోరు కదా. వాళ్ళు గోపీ చుట్టూచేరి "ప్రతీకారం తీర్చుకోమని" ఉద్బోధిస్తున్నారు.

కొంతసేపటి వరకు గోపీ వాళ్ళమాటలు అలా విన్నాడు. అంతే అతని కళ్ళల్లో అగ్నిజ్వాలలు లేచాయి. అతను ఒక్క ఉదుటుని లేచి మూలనున్న కర్రని తీసుకొని గాయపడ్డ సింహం వలె పరుగుపెట్టాడు. అతడి వెనుకనే గ్రామంలోని యువకులు ప్రతీకారేచ్ఛతో అనుసరించారు. అక్కడ ఈ వార్తవిని చౌకీదారు పోలీసు ఠాణా వైపు పరుగుపెట్టాడు.

జోఖా గ్రామస్తులకి యీ దురంతం గురించిన వార్త ఏమీలేదు. ఇది అతడి శిష్యుల కుట్ర. వాళ్ళు తన పనిచేసుకొని మౌనంగా ఉండిపోయారు. అయితే ఆ రాత్రివేళ గ్రామంవైపు వస్తున్న కోలాహల ధ్వని విన్న గ్రామస్తులు దొంగల ముఠా గ్రామాన్ని దోచుకొందుకు వస్తున్నారని భావించారు. గ్రామం అంతా ఉద్విగ్నత, అప్రమత్తత ఆవరించాయి. యువకులు కర్రలు తీసుకొని ఎదురు దాడికి సంసిద్ధులయారు. ధ్వని వస్తున్నవైపు బయలుదేరారు. పిల్లలు ఉలిక్కిపడ్డారు. వృద్ధులు, స్త్రీలు బిక్కుబిక్కుమంటున్నారు.

గోపీ దళం సమీపానికి వచ్చేసరికి అక్కడ కర్రలతో యువ దళం కనిపించింది. అంతే గ్రామస్తులు పూర్తి సన్నద్ధతోనే అంతా జరిపించారని అనిపించింది. పరస్పరం విషయాలు చెప్పుకొని, తెలుసుకొనే స్థితిలో రెండు బృందాలు లేవు. ఆగొన్న సింహాలవలె ఒకరిపై ఒకరు విరుచుకొనిపడ్డారు. కర్రలు చప్పుడు చేస్తున్నాయి. ఆ చీకటిలో వందల అగ్నికణాలు వెలిగాయి. ఆ చీకటిలో ఇరువర్గాలవారు ద్వంద్వ యుద్ధం చేస్తున్నారు. ఎవరు ఎవర్ని కొడుతున్నారో, ఎవరు నేలకూలుతున్నారో యేమీ తెలిడంలేదు. ఒకవంక మాణిక్ హంతకులపై ప్రతికారాగ్ని రగులుకొంటుంటే రెండవవంక

ఆత్మరక్షణ ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఎవరు మాత్రం ఓటమిని అంగీకరిస్తారు. చూస్తుండగానే ఎందరో మట్టికరిచారు. రక్తం ఏరులై ధార కట్టింది. ప్రాణాలు తీయడమే పనిగా పెట్టుకొన్న అక్కడ జరుగుతున్న అనవసర మారణకాండ గురించి ఎవరికా్కవాలి !

మాణిక్ శవాన్ని ఠాణాకు తీసుకువెళ్ళమని దరోగా ఆజ్ఞాపించి, సాయుధులైన పదిమంది పోలీసులతో చౌకీదారును వెంటబెట్టుకొని అక్కడకు వచ్చాడు. కఱ్ఱ యుద్ధ ధ్వనులు విని టార్చి వెలిగించి, అక్కడి దృశ్యాన్ని పరిశీలించి, రివాల్వర్ పెకెత్తి 'ఫైర్' అని పోలీసులకు ఉత్తర్వులిచ్చాడు. తుపాకుల ధ్వనులు విని ఇరువర్గాల వారు అక్కడకు పోలీసులు వచ్చారని గ్రహించారు. వాళ్ళు కఱ్ఱలు దించేలోగానే పోలీసులు అక్కడకు చేరారు. పారిపోవాలని చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. నలువైపులా పోలీసులు చుట్టుముట్టారు. టార్చిలైట్లు కాంతులు ముఖాలపై పడేసరికి వాళ్ళకళ్ళు చీకట్లుకమ్మాయి. చూస్తుండగానే వాళ్ళ చేతులకు సంకెళ్ళుపడ్డాయి.

xx xx xx

గోపే ఎడమచేతి మూడు వేళ్ళు "నజ్జునజ్జు" అయాయి. మెడపై కుడివైపున పెద్దగాయం అయింది. మరునాడు అస్పత్రిలో అతనికి స్పృహవచ్చింది. ముఖంనిండా విషాద, క్రోధభావాలు పేరుకొని ఉన్నాయి. కళ్ళు తెరిచి పరిసరాలను పరిశీలించి తాను అక్కడ ఎందుకు ఉన్నానా? అని ఆలోచించాడు. శరీరంనిండా కట్లు, గాయాలు స్రవించిన నెత్తుటిచెమ్మ, అటుయిటు మంచాలపై జోఖా గ్రామానికి చెందిన యువకులు అతని స్థితిలోనే ఉన్నారు. తన గ్రామస్తులూ ఉన్నారు. ఒకరినొకరు గుర్తుగా చూసుకొంటున్నారు. ఎవర్ని యెవరూ ఏమీచేయలేని నిస్సహాయ నీరస స్థితిలో, ఏమీ చెప్పుకొని, వినడానికి ఓపిక లేని దయనీయ స్థితిలో వాళ్ళు చిత్తరువుల వలె చూస్తుండిపోయారు.

xx xx xx

మాణిక్ లేదు. గాయపడిన గోపీ కోర్టు తీర్పు కోసం ఎదురు చూస్తున్నాడు. తల్లిదండ్రులు, కోడళ్ళ నెత్తిమీద ఒకేసారి పర్వతం కూలినంత వ్యధ ఆవరించింది. వాళ్ళ ఆవేదనకి, అంతర్మథనానికి అంతే లేదు.

గ్రామంలో చాలా యిళ్ళల్లో నిశ్శబ్దం, దుఃఖం ఆవరించాయి. గోపీ యింటి విషాదం మొత్తం గ్రామాన్నే నీడవలె ఆవరించింది. ప్రజలు వంతులు వంతులుగా ఆ యింటి దగ్గర ఉంటున్నారు. కొంతసేపు ముసలివాళ్ళకి ధైర్యం చెప్పి వూరట కలగించే ప్రయత్నం చేస్తున్నారు. మరికొంతసేపు పెద్దకోడల్ని వూరడిస్తున్నారు. ఒక్కొక్కసారి యెవ్వర్ని సముదాయించలేక వాళ్ళతోబాటు తామూ భోరున ఏడుస్తున్నారు.

కోర్టు కేసు కోసం డబ్బు జమ చేస్తున్నారు. పైరవీ నడపాలని ప్రయత్నిస్తున్నారు. ఎవరికివారు తమ ఆదాయాన్ని యిచ్చివేయడానికి సంసిద్ధంగా ఉన్నారు. అది గ్రామ కట్టుబాటు. గ్రామ యువకుని జీవితాన్ని అతడి తల్లిదండ్రుల శోకాన్ని వితంతువైన అతడి వదినగారి భవిష్యత్తుని దృష్టిలో ఉంచుకొని గోపీని రక్షించాలని అందరూ ఆత్రంగా, పట్టుదలగా ఉన్నారు. ఈ సంగతి తెలిసి మాణిక్ మామగారు, ఆమె అన్నగారు వచ్చారు. వాళ్ళ దుఃఖానికి అంతేలేదు. గోపీని కాపాడడానికి వాళ్ళు కూడ సమస్తం ధారపోయడానికి సిద్ధంగా ఉన్నారు.

డబ్బుతో న్యాయాన్ని కొనడం కష్టం. ఒకరి హత్య అయితే ఎలాగో అలాగ తంటాలు పడవచ్చు. మొత్తం మీద ఐదుగురి హత్య జరిగింది. దరోగా ఏం చేయలేడు. జిల్లా పెద్ద అధికారులు చేయగలరు. కాని వాళ్ళ దగ్గరకు గ్రామీణులు వెళ్ళడం కష్టం.

గాయపడిన వారు బాగుపడి ఉన్నారు. కేసు సెషన్స్ కోర్టులో ఉంది. పెద్ద వకీలుకే అప్పగించారు. అతడు ఎంతగా ప్రయత్నించినా ఎవరికీ బెయిలు రాలేదు.

ఒకసారి తండ్రి గోపీని కలవాలని వచ్చాడు. ఇద్దరూ గుండెనీ, మనస్సునీ దిటవు చేసుకొని కలుసుకొన్నారు. ఒకరి తత్తరపాటును, దుఃఖాన్ని, ఆవేశాన్ని మరొకరికి తెలిపి మరొకరి ఆవేదనన్ని పెంచడం ఎవరికీ యిష్టంలేదు. తండ్రి కొడుక్కి ధైర్యం చెప్పాడు. కొడుకు తండ్రిని వూరడించాడు. అంతకన్నా ఏం మాటల్లేవు. విడిపోయే క్షణంలో గోపీ "వదిన జాగ్రత్త" అని మాత్రం అన్నాడు. ఆ ఒక్కమాటలో ఎంత వ్యధ ఉంది ! ఎంత ఆవేదన ఉంది !

తండ్రి ఆ ఆలోచనతోనే ముఖం తిప్పుకొన్నాడు. గోపీ కన్నీరు తుడుచుకోవడం అతను, తండ్రి కన్నీరు ఒత్తుకోవడం గోపీ చూడలేదు.

ఎట్టకేలకి కోర్టు తీర్పు వచ్చింది. అందరికీ శిక్ష విధించారు. ఒకరికి ఇరవైయేళ్ళయితే, మరొకరికి పదేళ్ళు, యింకొకరికి నాలుగేళ్ళ జైలుశిక్ష పడింది. గోపీకి ఐదేళ్ళ కారాగారశిక్ష విధించారు. ఆ యింటిలో మళ్ళీ దుఃఖం ఆవహించింది. తల్లిదండ్రుల విచారం చెప్పనలవి కాదు. పెద్ద కోడలు స్థితి దయనీయం అయింది. చిన్న కోడలు గుండెల్లో మరో శూలం గుచ్చుకొంది.

## నాలుగు

తండ్రి యిప్పుడు బాగా ముసలి వాడైపోయాడు. కొడుకులిద్దరూ దూరమై పోవడంతో అతని రెండు చేతులూ విరిగిపోయినట్లయింది. పుత్రశోక దావానలం గుండె ఆర్ద్రతని హరించివేసింది. అతడి బ్రతుకులో ఏ ఆశా, ఏ ఉత్సాహమూ లేవు. కోడళ్ళ మౌన వేదనకి అతను మరీ దుఃఖిస్తున్నాడు. తినడం, త్రాగడం, కబుర్లు చెప్పడం, పనులు చేయడం ఏదీ అతనికి రుచికరంగా లేదు. కోడలు అన్నగారు వచ్చి వ్యవసాయం పనులు ఏర్పాటుచేసి వెళ్ళున్నాడు.

తల్లి పరిస్థితి కూడా దయనీయంగా ఉంది. అలా కూర్చుని కన్నీళ్ళు పెట్టుకొంటూ ఉంటుంది. మగబిడ్డల్ని తలుచుకొని కుమిలి పోతుంటుంది. ఆ చిన్నవయస్సులో చిన్నకోడలికి యీ దయనీయస్థితి దాపురించడం పట్ల ఆమె మరీ కృంగిపోతుంది. ఆమె స్వభావరీత్యా సున్నితమైనది, భావుకురాలు. ఈ ప్రపంచపు దుఃఖం గురించి ఆమెకు అనుభవం లేదు. హఠాత్తుగా యీ ఆపదవచ్చి నెత్తిన పడడంతో ఆమెపగిలి కుమిలిపోయింది. మంచం పట్టింది. తిండితిప్పలూ మానేసింది. రోజురోజుకీ చిక్కి శల్యం కాజొచ్చింది. అత్తమామలు తమ దుఃఖంన్ని దిగమింగుకొని ఆమెకి ఎంతో నచ్చచెప్పారు.

సోదరులు, వూరి స్త్రీలు కూడా ఆమెకి ఎంతో నచ్చజెప్పారు. మామూలు మనిషిని చేయాలని చాలా ప్రయత్నించారు. కాని ఆమెకి ఎవరి మాటలు చెవికెక్కలేదు.

ఒకనాటి రాత్రి పొలం నుంచి వస్తూనే తండ్రి జ్వరం పడ్డాడు. అది మామూలు జ్వరం కాదు. వారాలపాటు పీడించిన శీతజ్వరం. దగ్గు కూడా పట్టుకొంది. మందుకి లొంగలేదు. అతని సేవా శుశ్రూషలు సక్రమంగా జరిగే అవకాశం, పరిస్థితులు యింటిలో లేవు. అప్పటికే చిన్నకోడలు మంచం పట్టి ఉంది. ముసలిభార్య ఏం చేయగలదు."

అయినా ముసలి తండ్రి క్రమంగా కోలుకొన్నాడు. కాని కీళ్ళనొప్పులు పట్టుకొన్నాయి. కర్ర సహాయంతో కొన్నాళ్ళు తిరగగలిగాడు. క్రమంగా ఆ శక్తి తగ్గిపోయింది. కదలలేని స్థితి వచ్చింది. చివరకు మంచం మీదే ఉండిపోతున్నాడు.

ఆ యింటి దయనీయ స్థితికి గ్రామస్తులు చాలా బాధపడ్డారు. "ఎలాంటి ఇల్లు ఎలా అయిపోయింది!" అని అందరూ సానుభూతి చూపారు.

ఆఖరుకు పెద్ద కోడలుకే ఆలోచన వచ్చింది. ఇలా క్షీణిస్తున్న పరిస్థితిని చక్కదిద్దుకొనకపోతే ఈ యిల్లు ఏమవుతుంది "ఈ మనుష్యులేమవుతారు" తన జీవితం ఎలాగూ ముగిసిపోయింది. ఆ యింటి గౌరవం మంట కలవకూడదు. తాను ఆ యింటి పెద్దకోడలు. ఇంటి వారసత్వాన్ని నిలపాలి. కుటుంబ సంప్రదాయాన్ని కాపాడవలసిన బాధ్యత తనపై ఉంది. ఎవరి దుఃఖంలో వారు మునిగిపోతే ఎలా? కుటుంబం ఏమైపోతుంది? అత్తమామలకి, తోటి కోడలుకి, మరదికి సేవచేయడం కన్నా తన జీవితానికి యిక సార్థకత ఏమిటి? తన దురదృష్టం వలన ఈ యింటికి యీ గతి పట్టింది. అత్తమామలు, మరిది, తోటి కోడలు యిలా అయిపోవడానికి తన దురదృష్టమే కారణం. కనుక వాళ్ళని ఆదుకోవలసిన బాధ్యత తనదే. ఇప్పటినుంచి ఈ జీవితం వాళ్లకోసమే వెచ్చించాలి. గుండెని ఆవరించిన దుఃఖసాగరం ఏదో ఒకనాడు తిరుగు ముఖం పడుతుంది. గుండెని రాయి చేసుకొని తాను వారికి సేవా శుశ్రూషలు చేయాలి.

ఆ రోజు నుంచి ఆమె కరుణ దేవతగా మారింది. దుఃఖంతో నిండి ఉన్న అత్తమామల హృదయ వేదనని చల్లార్చడానికి ఆమె కంకణం కట్టుకుంది. స్నేహార్ద్రత, భక్తివాత్సల్యం మూర్తీభవించిన ప్రవర్తనతో ఆమె వాళ్ళకి

శీతలపవనమే అయింది. పొద్దున్నే లేస్తూనే స్నానం చేసి, పూజ చేసుకొంటుంది. వెంటనే అత్తమామలకి, తోడుకోడలుకి సేవలు ప్రారంభిస్తుంది.

తెల్లటి వస్త్రాలతో యిమిడిపోయిన ఆమె యౌవ్వనాన్ని కోరికలను, తలుచుకొని అత్తమామలు బాధపడేవారు. ఆమె మాత్రం మౌనంగా పనులు చేసుకొని వెళ్ళిపోతుంటుంది. చేయిపూతం యిచ్చి వాళ్లని మంచంమీద కూర్చోబెడుతుంది. కాళ్ళు చేతులూ కడిగిస్తుంది. ఎదురుగా కూర్చుని అన్నం తినిపిస్తుంది.

ఇలా పెద్దకోడలు తనంత తాను ధైర్యం తెచ్చుకొని యింటి పనులలో నిమగ్నురాలు కావడం అత్తమామలకి తృప్తిగానే ఉంది. ఇలా యింటి పనులలో పాల్గొనడం వలన ఆమెకి దుఃఖం తగ్గే అవకాశం ఉంది. తోటికోడలుకి ఆమె తల్లి అయింది. కాపురానికి వచ్చిన మొదట ఆమె తోటికోడలుని చెల్లెల వలెనే లాలించేది. కాని యిప్పుడు తల్లివలే స్నేహాన్ని, మమతని, సేవాత్యాగాన్ని అందిస్తోంది. ఒడిలోకి తీసుకొని మందులు యిస్తుంది. ఆహారం తినిపిస్తుంది. బట్టలు మారుస్తుంది. తలదువ్వి జడవేస్తుంది. అప్పుడు కుంకుమ భరిణ ఆమె యెదురుగా ఉంచి "బొట్టు పెట్టుకో" అంటుంది.

ఆ మాట వినగానే ఆ పిల్ల కళ్ళునీళ్ళు నిండుతాయి. ఆమె తన అక్కగారి ముఖంవైపు నిర్లిప్తంగా చూస్తుంది. కుంకుమ భరిణని ఆమెవైపు జరిపి "నువ్వు పెట్టుకో" అని బేలగా అడుగుతుంది. ఆమె చెల్లెల్ని సముదాయించి "వద్దమ్మా! నా సౌభాగ్యం పోయింది. నీ మాంగల్యం బలంగా ఉండాలి. నువ్వు కలకలలాడుతూ ఉండాలనే నాఆశ. నీ జీవితం ఆనందంగా చిగురిస్తుంటే చూడాలనే నేను బ్రతికి ఉన్నాను "బొట్టు నువ్వే పెట్టుకో" అంటుంది.

చెల్లెలు అక్కగారి ఒడిలో ముఖం దాచుకొని వెక్కివెక్కి ఏడుస్తుంది. అక్కగారి కళ్ళ నుండి బాష్పకణాలు "టప్ టప్" అని జారిపడేవి. కాని మరుక్షణంలోనే ఆమె తననుతాను సంబాళించుకొని "పిచ్చిపిల్లా ! అలా ఏడవకూడదు" అని చెల్లెలి కళ్ళనీళ్ళు చీరచెంగుతో తుడిచి "బొట్టు పెట్టుకో మామంచి చెల్లి" అంటుంది.

చెల్లెలు కళ్ళలో సుడులు తిరిగే నీళ్ళతోనే ఒణికే వేళ్ళ మధ్య కుంకుమ తీసుకొని నుదుట పెట్టుకొంటుంది. ఆ సమయంలో అక్క బరువెక్కిన కళ్ళని మరోవైపు తిప్పుకొని నిట్టూరుస్తుంది.

భర్త స్మృతులు ఆమెని ఎంతగానో వేధిస్తున్నాయి. నీళ్ళునిండిన కళ్ళ తెరలపై భర్త రూపాలు అనేక భంగిమలలో కనిపిస్తూనే ఉన్నాయి. పూజకై కూర్చున్నప్పుడల్లా ఆమె "భగవంతుడా! నన్ను కూడా ఆయన దగ్గరకు తీసుకు వెళ్ళిపో," అని ప్రార్థిస్తూనే ఉంది.

అప్పుడప్పుడు మరిదితో ఆడుకొన్న ఆటలు, చేసుకొన్న పరిహాసాలు స్మరణకు వస్తున్నాయి. "జరిగినదంతా ఒక కల" అనిపిస్తోంది ఆమెకు. ఆ ఆనంద క్షణాలు యిలా శాశ్వతంగా ముగిసిపోయి, వాటి ప్రతిధ్వని ఆత్మకి ప్రతిక్షణం విషాధ గీతాన్ని వినిపిస్తాయని ఎవరు అనుకొన్నారు! అన్నగారి హత్య వార్తకి పిచ్చెక్కి జీవన సౌఖ్యాన్ని పణంగా పెట్టుకొన్న మరిది గురించి తలపోస్తూనే ఉంది. అటువంటప్పుడు అతనితోనే సుఖదుఃఖాలు ముడిపడిన చెల్లెల వైపు ఆమె దృష్టి మరలుతూ ఉంటుంది. తాను ఎంత సేవ చేస్తున్నా ఎన్ని విధాలుగా ఓదార్చి ధైర్యం చెబుతున్నా ఆమె పూవు వలే వాడి, ఒడిలి పోతుండడాన్ని గమనిస్తూనే ఉంది. మరిది జైలు నుంచి విడుదలై వచ్చి ఆమె అలా ఉండడం చూస్తే ఏమనుకొంటాడు."

ఇప్పుడామెను తన దుఃఖం కన్నా చెల్లెలి స్థితి మరీ కలిచేస్తోంది. ఆమెకి మరింత శ్రద్ధతో సేవలు చేయసాగింది. ఆమె తనకి చెల్లెలే కాదు. మరిదికి చెందిన అమూల్య సంపద. ఆ సంపదని అన్నివిధాలా రక్షించడం తన ప్రధాన కర్తవ్యంగా ఆమె భావించుకొంది.

కాని అసాధారణమైన ఆమె సేవల ప్రభావం చెల్లెలపై యేమీ కనిపించలేదు. ఆమె కోలుకోవడం లేదు సరికదా నానాటికీ శుష్కించి పోతుంది. అందుచే అప్పుడప్పుడు అక్కగార్ని భయ సందేహాలు వెంటాడుతున్నాయి. దేవుడికి చేతులెత్తి "ప్రభూ! ఈ యింటిని దయగా చూడు. నీ కోపాన్ని తగ్గించకో !" అని వేడుకొనేది.

భగవంతుడు ఆ యింటిపై ఆగ్రహ దృష్టిని సడలించలేదో ఏమోకాని ఆ చెల్లెలి ఆరోగ్యం ఏ మాత్రం కుదుటపడలేదు. రోజు రోజుకీ మరీ క్షీణించసాగింది. ఆమె సోదరుడు వచ్చి పుట్టింటికి తీసుకొని వెళ్ళిపోయాడు. గాలి మార్పు వలన, స్థలం మార్పు వలన, పుట్టింటి తల్లిదండ్రులతో,

చిన్ననాటి స్నేహితులతో గడపడం వలన ఆమె ఆరోగ్యం కుదుటపడుతుందని వాళ్ళు ఆశించారు. అత్తమామలకి నమస్కరించింది. వాళ్ళని పట్టుకొని ఏడ్చింది. అక్కగారిని కౌగిలించుకొని విలవిలా ఏడ్చింది. పుట్టింటి నుంచి ఎక్కడికో వెళ్ళిపోతున్నంత వెలితిని, వేదనను అనుభవిస్తూ ఆమె మేనా ఎక్కింది.

అదే ఆమె ఆఖరు వీడ్కోలు అని ఎవరికి తెలుసు. పుట్టింట ఆమెకి ఎంతో ఖర్చుపెట్టి నగానట్రా, సర్వం అమ్మి వైద్యం చేయించారు. డబ్బును నీళ్ళల్లా ఖర్చు చేశారు. కాని జరగవలసింది జరిగిపోయింది.

ఏనాడో ఆమె కోమల హృదయానికి గుచ్చుకొన్న శూలం యిప్పుడు ఆమె ప్రాణాలు తీసుకుంది.

ఆమె మరణవార్త విన్న అత్తమామలు, అక్కగారి పరిస్థితి వర్ణనాతీతం. వాళ్ళ హృదయాలలో మరొక వ్యధా బాణం నాటుకొంది.

## ఐదు

మొదట్లో ప్రతినెలా ఒకసారి జైలుకి వెళ్ళి తండ్రి గోపీని చూసివస్తూండేవాడు. అతడికి ఓపిక తగ్గిపోవడంతో గోపీ మామగారు, బావమరిది వెళ్ళి చూసివచ్చి యోగక్షేమం చెప్పేవారు. ఎవరు ఎప్పుడు తనని చూడడానికి వచ్చినా గోపీ యింటి సంగతులు, తల్లిదండ్రుల కష్టసుఖాలు, వదిన యోగక్షేమాలు అడిగి తెలుసుకొనేవాడు. మొహమాటం చేత తన భార్య గురించి అడిగేవాడు కాదు. వాళ్ళూ ఆమె ప్రస్తావన తెచ్చేవారుకాదు.

జైలు జీవితంతో కుమిలిపోతున్న అతనికి ఆమె అనారోగ్యం గురించి చెప్పి బాధించడం వాళ్ళకిష్టం లేదు. అతనికి అందరి గురించిన బాధకన్నా వదినగారి వ్యధ గురించి మరీ దిగులుగా ఉండేది. వదినగారి ధ్యాసకన్న మరెవరి మీద అతని మనసు పోయేది కాదు. వదినగారి వితంతు రూపం అతని మనసులో మెదలుతుండేది. ఏ ప్రియమైన వదినగారి ప్రేమని, స్నేహాన్ని మనస్ఫూర్తిగా

తృప్తిచెందిన తను ఆ వదినగారి శూన్య ఫాలభాగాన్ని, ఆ వదినగారి వితంతు స్వరూపాన్ని, కళావిహీనమైన ఆమె ముఖాన్ని తను ఎలా చూడగలడు?

xx xx xx

జైలులో ఉన్నా అతనికి శ్రమ తప్పలేదు. అలాఅని జిహ్వ చచ్చిపోలేదు. ఇంటి దగ్గర వలెనే మంచి ఆహార పానీయాలు దొరికేవి. యేవేవో పనులు చేయించేవారు. నిశ్చింత అయిన జీవితం, అందుచే గోపీ జైలులో కూడ ఏమీ చిక్కిపోలేదు. కాని యింటి దగ్గర పాలు, పెరుగు, నెయ్యిలో కమ్మటి భోజనం అయితే యిక్కడ ఎండు రొట్టెలు, పప్పు పెడ్తున్నారు. అయితే వదిన గారి గురించిన ధ్యాసలో అతను దిగులు వలన యిప్పుడు చిక్కిపోతున్నాడు. కానీ వస్తాదు అవడం వలన అతనిలో మూర్ఖపు పట్టుదల, కోపం తగ్గలేదు. అందుచే జైలులో ఎవ్వరూ అతని గురించి పట్టించుకొనేవారు కారు. అతన్ని కదిలించే వారు కారు. అతను కూడా తన జైలు గదిలో నిరామయంగా, చింతామయంగా గడపసాగాడు. ఎవరి జోలికి వెళ్ళే అవకాశమే అతనికి లేదు. అంత పెద్ద జైలు కూడా అతనికి ఒంటరితనాన్ని కలుగజేసింది.

కేసు నెపం మీద అతను ఆస్పత్రిలోనే మొదట ఉండిపోయాడు. తగిలిన దెబ్బ ప్రమాదకరమైనది. నొప్పి తగ్గేదేకాదు. చిన్న ఆస్పత్రిలో ఎక్స్-రే వంటివి లేవు. ఒక ప్రక్క అతనికి చికిత్స జరుగుతూనే వచ్చింది. వేరొక పక్క కోర్టులో కేసు విచారణ నడుస్తూనే వుంది. ఆరోగ్యం కుదుటపడలేదు కాని అతనికి శిక్ష విధిస్తూ తీర్పు వచ్చింది. వారణాశి జిల్లా జైలులో అతన్ని వేశారు.

ఆ జైలు ఆస్పత్రిలో అతని అదృష్టం కొద్దీ ఒక మంచి కాంపౌండరు దొరికాడు. అతడు గోపీ సమీప గ్రామస్థుడు. జైలు ఆస్పత్రులలో మంచి మందులేం ఉండవు. కాంపౌండర్ మంచితనం వలన, గోపీకున్న వెనకటి బలం వలన క్రమంగా నొప్పి తగ్గసాగింది. అక్కడే అతనికి 'మటరూ సింగ్'తో పరిచయం అయింది. అతను ఒక పేరొందిన వస్తాదు. ఒకే వృత్తి, ప్రవృత్తి అవడం వలన ఇద్దరూ తక్కువ సమయంలోనే బాగా సన్నిహితులయారు. సింగ్ గ్రామానికి గోపీ గ్రామం ఐదు మైళ్ళు దూరం. మటరూసింగ్ అక్కడ

నదీ తీరాన ఇల్లు వేసుకొని తన కుటుంబంతో ఉంటున్నాడు. అది లంక ప్రాంతంగా పేరొందిన మైదాన గ్రామం. (దాని పేరు దీయర్).

మటరూసింగ్ గురించి ఆ ప్రాంతంలో ఒక కథ ప్రచారంలో ఉంది. ఏనుగు వంటి అతడి బలం పెరిగి పోవడాన్ని భరించలేక తోటి వస్తాదు ఎవరో తాంబూలంలో ఏం మందు పెట్టి యిచ్చాడో తెలీదు కాని దానిని తిన్న మటరూసింగ్ చావుతప్పి బయటపట్టాడు. అతని శక్తి క్షీణించిపోయింది. ఎన్నో వైద్యాలు చేయించుకొన్నాడు. కాని శ్వాసకోశానికి వచ్చిన జబ్బు నయం కాలేదు. నిస్సహాయుడయి మటరూ కుస్తీని వదిలివేశాడు. పెళ్ళి చేసుకొని సాధారణ గృహస్థు వలె జీవితం గడపసాగాడు. ఇప్పుడు అతనికి ముగ్గురు మగపిల్లలు.

ఒకవిధంగా మటరూసింగ్ ఆ లంక గ్రామానికి మహరాజు వలె వున్నాడు. ఆ నది ఒడ్డున వ్యాపించిన వందలాది ఎకరాల భూమికి అతను ఏకచ్ఛత్రాధిపతి. ఘూఘ్రా నది వలెనే అతని ఇల్లు వెలుస్తూ కూలుతూ ఉంటుంది. వర్షాకాలంలో ఆ నదికి వరద వచ్చి గుడిసె మునిగిపోతుంది. అప్పుడు మటరూ సంసారంతో దూరంగా ఉన్న గ్రామానికి వెళతాడు. వానలు వెనుకబట్టి వరదలు తగ్గాక అతను మళ్ళీ పాత యింటికి వస్తాడు. అయినా తల్లిని వీడని బిడ్డ వలె మటరూసింగ్ కూడా గంగమ్మ తల్లి కొంగు వీడక వ్యవసాయదారుడై జీవితం నడుపుతున్నాడు.

వరద నీరు తీసిన లంక భూమిలో మొదట దుబ్బులు, తుప్పలు పెరుగుతాయి. వైశాఖ మాసంలో జమీందారులు వీటిని అమ్ముతారు. ఆ దుబ్బు గడ్డిని పేద ప్రజలు తమ యిళ్ళపై కప్పులపై వేసుకొందుకు కొంటారు. మళ్ళీ వానలు పడగానే అక్కడ ఆ దుబ్బులు, తుప్పలు పెరుగుతాయి. వరదలు ముంచి, తీయగానే మరల యిదే క్రయ విక్రయాలు జరుగుతాయి.

వస్తాదుగా ఉన్నంత కాలం మటరూసింగ్‌కి యివేమీ పట్టేవి కావు. పట్టించుకొనేవాడు కాడు. దేనికీ అతనికి చింతలేదు. లంక భూమి నుంచి అతనికి ఆదాయం వచ్చేది. పాలు వచ్చేవి. పెరుగు, నెయ్యి పుష్కలంగా ఉండేవి. ఏ లోటూ లేకుండా భుక్తి గడిచేది. అతనికి పాలు పోయకుండా ఏ గొల్లవాడూ ఆ రేవు దాటేవాడుకాడు. ఏ వ్యాపారీ మటరూ సింగ్‌కి ముడుపు చెల్లించకుండా వెళ్ళేవాడుకాడు. అందుకే అతనికి ఏ లోటూ లేదు. సుష్ఠుగా

తినడం, కండలు పెంచడం, మళ్లీ చరచడం మటరూసింగ్ నిత్యకృత్యంగా ఉండేది.

కాని వస్తాదు వృత్తిని కోల్పోయాక అతనికి 'ఘరానా' గా, 'నజరానా' గా వచ్చేవన్నీ ఆగిపోయాయి. అందుచే అతడు అక్కడి లంక భూమిని బాగుచేసుకొన్నాడు. అడవిలా, బీడుల్లా ఉన్న ఎకరాలని సాగుచేశాడు. బావమరిది సహాయంతో వ్యవసాయం ప్రారంభించాడు. ఎందుకూ పనికిరానిదని వదిలివేసిన ఆ లంక భూమి నుంచి ఫలసాయాన్ని తీసిన మటరూని చూసి ప్రజలు ముక్కున వేలేసుకొన్నారు. చెవులు కొరుక్కొన్నారు.

రెండు మూడు సంవత్సరాలలోనే అతని గుడిసె పెద్దదయింది. బాగా పాలిచ్చే గేదెలు, బలిసిన జోడెద్దులు అక్కడకి వచ్చాయి. మటరూ ఆదాయం పెరిగింది. అతను తన పొలం విస్తీర్ణాన్ని పెంచాడు. ఒక బావమరిదిని పిలిపించి సహాయంగా ఉంచుకొన్నాడు. అతడి కష్టం చెమటయి, చెమటే నీరుగా ప్రవహించి ఆ పొలాల నుంచి పంటల బంగారం అతనికి అంది వచ్చింది.

జమీందారులకు ఈ వార్త అందింది. వాళ్ళు కోపగించారు, కలవరపడ్డారు. ఆ బీడు భూమి నుంచి కూడా యింత బంగారం పండించవచ్చునని వాళ్ళకేం తెలుసు ? వాళ్ళకి నంజా, పుంజా నేలలు తెలుసు. కష్టపడి పనిచేసి, పండించిన రైతుల నుంచి వాళ్ళని పిండి మకతా తీసుకొనిపోవడం తెలుసు. అడవిని, బీడు భూమిని బాగుచేసి పంట పండించే సాహసం, దూరదృష్టి మటరూ వలె వాళ్ళకి ఎక్కడివి ? ఆ రైతులు కూడా అలాంటివారే. అందుకే జమీందార్లని అడిగి పొలాలు కౌలుకి తీసుకొని జీవనం గడుపుతున్నారు. అదే అదునని జమీందారులు కూడా ఎక్కువ మకతాలకు రైతులకు కమతాలు యిచ్చారు. వాళ్ళకి అంతకన్న ఏంకావాలి ?

ఈ సంగతి తెలిసి మటరూ బాధపడ్డాడు. రైతులు జమీందార్లని ప్రాధేయపడి ఆ లంక భూముల్ని కౌలుకు తీసుకోవడం అర్థరహితం అని అతను గ్రామాన వాళ్ళకి వివరించి చెప్పాడు. గంగమ్మ తల్లి ఒడిలో ఉన్న ఆ భూములపై జమీందారులకు హక్కులు ఏం ఉంటాయని అతడు సవాలు చేశాడు. ఏ హక్కులూ లేని జమీందార్లు ఆ భూముల్ని రైతులకు ఎలా కౌలుకిచ్చారని అతడు నిలదీశాడు. శక్తి, ఉత్సాహం, ఆసక్తి ఉన్న అందరూ

వచ్చి ఆ భూముల్ని సాగుచేసుకొని, విత్తనాలు చల్లి పంటలు పండించుకోమని మటరూ ఆ చిన్ని రైతులను ప్రేరేపించాడు. పిలుపునిచ్చాడు. ఈ వ్యవహారంలో జమీందారుల ప్రమేయం అనవసరం అన్నాడు. రైతులకు యివన్నీ ఏమీ తెలీవు. మటరూ అంటేనే వాళ్ళకి భయం. అతణ్ణి కాదని అక్కడ నెగ్గుకు రాగలమా ? అని వాళ్ళు తర్జన భర్జనలు పడ్డారు. మటరూయే వాళ్ళని ఆహ్వానించాడు. అప్పటికే వాళ్ళు జమీందార్ల దగ్గర మూడేళ్ళ కౌలు రాయించేసుకొన్నారు. ఆ మాటే మటరూకి చెప్పారు.

అంతా విని మటరూ "ఏం పర్వాలేదు. మీ డబ్బు మీకిచ్చేయమనండి. ఈ పొలాలలో ఏం వేయలేదని చెప్పండి. ఈ సంవత్సరం పూరుకోండి. వచ్చే ఏడాది మీకు ఎవ్వరూ అడ్డురారు. ఇది గంగమ్మ తల్లి ఒడి. రైతులందరికీ తల్లి ఒడి. ఒకసారి యీ జమీందార్ల చేతిలో ఈ భూమిని పెడితే మీరేకాదు మీ పిల్లలు, మీ మనవలు, మీ మునిమనవలు ..... ఇలా తరతరాలపాటు ఈ భూమి జమీందార్లకే ఉంటుంది. మీ వంశాలకు రాదు. ఆలోచించండి. ఈ జమీందార్ల నాలుక సురస నాలుక వలె పెరిగి భూములన్నింటిని కబళిస్తుంది. వాళ్ళ ఆశ అలాంటిది. వాళ్ళ లోభం అలాంటిది. ఇప్పుడు తొందరపడి యీ భూముల్ని వదులుకొన్నారా ? శాశ్వత బానిసత్వంలోకి వెళ్ళవలసిందే. జాగ్రత్తపడి భూముల్ని హక్కు భుక్తం చేసుకొన్నారా ఈ జమీందార్లు యింక ఎవ్వర్నీ ఏమీ చేయలేరు. ఇదే సరైన సమయం. జాగ్రత్త పడండి. గంగమ్మ తల్లిపై కొందరికి ఎక్కువ అధికారాలు, మరికొందరికి తక్కువ అధికారాలు లేవు. అందరికీ సమాన హక్కులున్నాయి. సహజమైన ఈ హక్కుని జమీందార్ల అధికారం అనుకోవడం మన మెడపై మనమే కత్తిని ఉంచుకోవడం. మీరందరూ నా మాట వినండి. నాతో సహకరించండి. ఈ జమీందార్లు మనల్నేం చేస్తారో చూద్దాం."

మటరూ మాటలు విని రైతులందరూ తమ హక్కులు తమకిచ్చేయమని జమీందార్లని అడిగారు. వాళ్ళు చిరునవ్వు నవ్వారు. జమీందార్ల చేతిలో పడిన డబ్బు పాము నోటిలో పడిన కప్పవంటిది. ఎన్ని ఆర్తనాదాలు చేసినా పాము కప్పని విడవదు. పాపం ఆ చిన్న రైతులు మొరపెట్టుకోవడం విన్నా ఫలితం ఏం ఉంటుంది ? జమీందార్లు వాళ్ళని బెదిరించి పంపించేశారు. ఇచ్చిపుచ్చు కొన్నట్లు రసీదులేం లేవు. రైతులేం చేయగలరు ? అయితే దీనివలన ఒక

విపరిణామం జరిగింది. మిగిలిన రైతులు కౌలుకు యివ్వడం, తీసుకోవడం మానేశారు.

రైతులు అవలంబించిన యీ వైఖరి వలన జమీందారుల ఆదాయం నిలిచిపోయింది. వాళ్ళకి కోపం వచ్చింది. విషయం యేమిటని ఆరా తీయగా యింతకూ మూలకారకుడు మటరూ అని తెలిసి జమీందార్లు అందరు కలిసి ఒకనాడు "మటరూని రమ్మనమని" కబురు చేశారు.

అతను ఆ అడవికి ఒకవైపున ఉంటున్నాడు. ఆ ప్రాంతం అంతటికీ సింహం వంటివాడు. అతను స్వయంగా వస్తాదు. పైగా వందలాదిమంది అతనికి సహాయకులు ఉన్నారు. తలుచుకొంటే అతను రోజుల తరబడి పోరాడగలడు. ఆ ప్రాంతంలో అతనికి తల ఒగ్గనివారు లేరు. అతన్ని తమ దారికి తీసుకురావడం అంత సులభం కాదని జమీందార్లకి బాగా తెలుసు.

జమీందార్ల వర్తమానం విని మటరూ వూగిపోయాడు. "ఈ మటరూ యే జమీందారు కన్న తక్కువ కాదు. ఎవరికి కావాలనుంటే వారే నా దగ్గరకు వచ్చి మాట్లాడవచ్చు" అని అతను నిష్కర్షగా కబురు పంపాడు.

అటువంటి పరిస్థితిలో ఎలా పని జరిపించుకోవాలో జమీందార్లకు బాగా తెలుసు. వాళ్ళు అందరూ కలిసి తమ ప్రతినిధిగా బాగా చదువుకొన్న ఒకరిని మటరూ దగ్గరకు పంపారు.

అతను వచ్చి వినయంగా ఒంగి "జై గంగమ్మ తల్లి !" అని నమస్కరించాడు. మరల చేతులు పైకెత్తి జోడించి వెళ్తున్నాను. పహల్వాన్ గారికి జై గంగమ్మ తల్లీ అని చెప్పి వెళ్తున్నాను," అన్నాడు దయనీయంగా.

మాఘ మాసం ఉదయం వేళ. నదిపై దట్టమైన మంచు పొగలు వ్యాపించి ఉన్నాయి. చుట్టూ మంచు పరదా విస్తరించి ఉంది. వాటిపై సూర్య కిరణాలు వింతగా మెరుస్తున్నాయి. నది మందంగా ప్రవహిస్తోంది. గుండెల నిండా గోధుమ పంటతో పొలాలు కనుచూపుమేర కనిపిస్తున్నాయి. వాటి ఆకులపై మంచు బిందువులు చేరి ముత్యాల్లా మెరుస్తున్నాయి. గొల్లలు పాలు పితుక్కొని లేగల్ని తల్లుల దగ్గరకు వదిలివేశారు. అవి పొదుగుల్ని కుమ్ముతూ పాలు తాగుతున్నాయి.

మటరూ లుంగీ, కుర్తా వేసుకొని గిత్తల దగ్గర నిలబడి వాటిని నిమురుతున్నాడు. మేత అందిస్తున్నాడు. వాటిని లాలనగా, గర్వంగా చూసుకొంటున్నాడు. వాటి ముఖాల దగ్గరగా తన ముఖం పెట్టి ఏదో

ముచ్చటిస్తున్నాడు. అలా చేస్తూనే మటరూ కాకతాళీయంగా జమీందార్ల ప్రతినిధిని చూశాడు.

"రేవు దాటించడానికి యింకా టైముంది. చిలుం ఓ పట్టుపడతామా" - - అని అడిగాడతన్ని. అతని సమాధానానికి ఎదురు చూడకుండానే చిలుములో నిప్పు వేసి వూదాడు. ప్రతినిధికి ఎదురుగా చిలుము నుంచి తానూ కూర్చున్నాడు.

"ఒరే ! లఖన్ యింకో చిలుం పట్రా" - అని మటరూ కేకవేశాడు. లఖన్ అతని పెద్ద కొడుకు. నాలుగేళ్ళవాడు. దిస మొలతోనే వాడు చిలుం తెచ్చి అక్కడ పెట్టాడు. అక్కడే కూర్చుని చిలుం రగిలించాడు. బొద్దుగా, ముద్దుగా ఉన్న పిల్లాడిని చూసి ప్రతినిధి "ఏరా ? నీకు చలి వేయడం లేదా ?" అని అడిగాడు. కుర్రాడు కళ్ళు పైకెత్తి చూసి, మరల సిగ్గుగా తల వంచేసుకొన్నాడు.

"ఏమీ కట్టుకోడు. కప్పుకోడు. నిద్దర్లో ఏదైనా కప్పినా కూడ విసిరేస్తాడు" - మటరూ చెప్పాడు.

"మీ బిడ్డ కదా ! వస్తాదు వంశం" అన్నాడు ప్రతినిధి.

"నిజమే ! ఐదేళ్ళు వచ్చేవరకూ బట్టలంటే ఏమిటో నాకూ తెలీదు. లంగోటా కట్టుకొనేవాణ్ణి. తర్వాత లుంగీ అంతే. గంగమ్మ తల్లి యిచ్చిన యీ మట్టి ఈ నీళ్ళూ అలాంటివి. వేడి, చలి ఏమీ తెలీనివ్వవు. నాకు మాత్రం ఈ శ్వాస వ్యాధి వచ్చి యిలా అయిపోయాను" అని మటరూ చిలుంని వూది ఓ దమ్ము లాగాడు. ప్రతినిధి కూడా దమ్ము లాగాడు.

"వాడెవడో పెద్ద శకునిగాడు" అన్నాడు ప్రతినిధి.

"ఆ సంగతులెందుకు, అందరూ బాగుండాలి" అని మటరూ మాట మార్చాడు.

"అవునవును !" అని ఆ ప్రతినిధి "మనిషంటే నీలా ఉండాలయ్యా ! శత్రువుకి కూడా మేలు కోరతావు" అని ఆ ప్రతినిధి మరల వో దమ్ము లాగాడు.

"కాయస్థుడివిలా వున్నావ్. ఏ గ్రామం ?" అన్నాడు మటరూ. "అవును. బాలేపూర్ నివాసిని. జిందాపూర్ జమీందార్ల దగ్గర కొలువు" అని అతను మటరూ ముఖాన్ని పరిశీలించి "నిన్ను జమీందార్లు పిలిస్తే వెళ్ళలేదటగా" అన్నాడు.

మటరూ గుండె పొంగింది. అతను తీక్షణంగా చూశాడు. "నేనెవరికైనా బానిసనా ?" అన్నాడు.

"కాదు. నా ఉద్దేశ్యం అది కాదయ్యా !" ప్రతినిధి మధ్యలో అందుకొని "నువ్వు యిక్కడ మహరాజువని ఎవరికి తెలీదు. నీ హోదాకి తగిన పనిచేశావ్. కాని అక్కడి సంగతులు నీకు తెలీవు. ఈ పొలాలలో వాటా ఉన్న వాళ్ళందరూ నీపై పెద్ద ఫిర్యాదు తయారుచేస్తున్నారని విన్నాను" అన్నాడు.

"వాళ్ళెవరు రాయడానికి. ఇది గంగమ్మ తల్లి ఇలాకా. ఆమె తప్ప నేనింతవరకు ఎవరి దగ్గరకు వెళ్ళలేదు. నాకెవరు తెలీరు. ఇదిగో పంతులూ ! వెళ్ళి చెప్పు. ఇక్కడ జమీందార్లు కాని, ఆళ్ళ పిల్లలు కాని, ఆళ్ళ తాబేదార్లు కాని ఎవరు కనిపించినా కాళ్ళు విరగకొట్టి పంపేస్తానని చెప్పు" మటరూ ఆవేశంగా అన్నాడు.

"ఒరే అబ్బీ ! నువ్వనవసరంగా కోపగిస్తున్నావ్. ఇవన్నీ చెప్పడమే నా పని అనుకొంటున్నావా ? అక్కడి కుట్ర గురించి నీకు తెలిసినది నీ చెవిన వేశాను. ఇంకో ముఖ్యవిషయం ఉంది. రేవు కట్నంలో, వస్తాదు వందనంలో భాగం కూడా కావాలంటే నీకిస్తారట" ప్రతినిధి మటరూని రెచ్చకొడుతూ అన్నాడు. అతను పగలబడి నవ్వాడు. కళ్ళు పెద్దవి చేసి యిలా అన్నాడు.

"మటరూ పహిల్వాన్ ఎవరి మోచేతి నీళ్ళూ తాగడు. గంగమ్మ తల్లిని తప్ప ఎవరినీ అతడు చేయెత్తి అడగడు. పంతులూ ! చూస్తాను. ఈ జమీందార్లు యే రైతుల చేత సలాములు కొట్టించుకొంటారో. ఎంత కాలం కొట్టించుకొంటారో ? ఇక్కడి భూమిపై వాళ్ళు హక్కు ఎలా సంపాదిస్తారో నేనూ చూస్తాను. గంగమ్మ తల్లి ప్రసాదం యీ మట్టి సాక్షిగా చెప్తున్నాను ...." మటరూ ప్రతిజ్ఞా స్వరంతో అన్నాడు.

"మటరూ ! నేను బానిసని. జమీందార్లకి అమ్ముడుపోయినవాణ్ణి. నీలాగా స్వతంత్రుణ్ణి కాను. నీలాంటి రాజా మనిషితో ఏం చెప్పడానికి ధైర్యం లేనివాణ్ణి. జమీందార్ల పాదరక్షలు తుడుస్తూనే నా జీవితం గడచిపోయింది. ఏమీ అనుకోనంటే ఒకమాట చెప్తాను. ఈ జమీందార్లు చాలా కుచ్చితులు. నీలాంటి నిజాయతీపరుడితో తలపడడం వాళ్ళకు తగదు. కాని వాళ్ళకి ఉచ్ఛ నీచాలు లేవు. మంచిచెడులు లేవు. వెనుకాముందులు లేవు. చట్టాలు వాళ్ళకి బాగా తెలుసు, అవి వాళ్ళు చెప్పినట్లు వింటాయి. అధికారులు వాళ్ల చేతుల్లో

కీలుబొమ్మలు. వాళ్ళు బాగా చదువుకొన్నవాళ్ళు. వాళ్ళు వేసే మెలికలని నువ్వు ఎలా తప్పించుకొంటావా అని," ప్రతినిధి నెమ్మదిగా అన్నాడు.

"ఇళ్ళ దగ్గర కూర్చుని వాళ్ళు ఏం చేసుకొంటే నాకేమిటి ? నేనీ గంగమ్మ తల్లిని నమ్ముకొన్నవాణ్ణి, ఈ భూమి గంగమ్మ తల్లిదని నాకు తెలుసు. ఎవరికి కావాలంటే వాళ్ళు వచ్చి యిక్కడ వ్యవసాయం చేసుకొని ఫలసాయం పొందవచ్చు. జమీందార్లు కనక వీటిపై కన్నువేస్తే నేను వాళ్ళ కళ్ళు పీకివేస్తాను. ఇన్నాళ్ళూ వాళ్ళ చట్టం ఎక్కడుంది ? ఏమైంది ? నేను కష్టపడి ఈ నేలని బాగు చేశాను. సేద్య యోగ్యం చేశాను. పంట పండించాను. దీనితో వాళ్ళకి కళ్ళు కుట్టింది. నోరు పులిసింది. నాగలి భుజాన వేసుకొన్నవాడిని నేను. హక్కు వాళ్ళు కోరుతున్నారా ? అమాయకులైన రైతుల కష్టాలని జమీందార్లు యిప్పటికీ దోచుకుంటున్నారు. కష్టం వీళ్ళది. భోగం వాళ్ళది. ఇక యిక్కడ వాళ్ళ ఆటని సాగనివ్వను. పంతులూ ! వాళ్ళకి చెప్పు యిది గంగమ్మ తల్లి రాజ్యం అని. ఎవరైనా యిక్కడ అన్యాయంగా కాలుమోపితే ఆ తల్లి వూరుకోదని, వరదై కాటువేస్తుందని చెప్పు. వెళ్ళు. అదిగో రేవు తెరుస్తున్నారు. వెళ్ళు" మటరూ దృఢ స్వరంతో అన్నమాటలకి ఆ ప్రతినిధి అప్రతిభుడయాడు. ఆఖరు దమ్ములాగి లేచి రేవు వైపు అడుగు వేశాడు.

"వచ్చారు పెద్దలు గంగమ్మ తల్లి ఒడిలో నిప్పు రగల్చడానికి" అని మటరూ అన్న మాటలు ప్రతినిధికి స్పష్టాస్పష్టంగా వినిపించాయి.

xx xx xx

మటరూ నిర్మించుకొన్న ఆ ప్రదేశంలో అడుగుపెట్టడం ప్రమాదకరం అని జమీందార్లకి తెలుసు. అతనితో నెగ్గుకు రావడం కష్టసాధ్యం అని పోలీసులకు తెలుసు. తెలిసి తెలిసి ఎవరు మాత్రం నేరుగా పాము పుట్టలో వేలు పెడతారు?

మైళ్ళకొద్దీ వైశాల్యంలో విస్తరించిన బొమ్మచెముడు డొంకలు, తుప్పలుతో ఉన్న ఆ ప్రాంతం మధ్య చక్కటి బాట యేమీలేదు. కొత్తవారు ఎవరు ఆ ప్రాంతంలో దారి తప్పినప్పటికీ ఎన్నటికీ బయటపడలేరు. కాని ఆ అడవి ఆనుపానులు తెలిసినవారు మాత్రం అక్కడ ఏమేం ఉన్నాయో, యెక్కడ నుంచి వెళితే రేవును సులభంగా చేరుకోగలరో బాగా తెలుసు. అయినా సాయంత్రం అయిందంటే అడవిలో నడవడానికి ఎవరికైనా భయమే. పైగా

ఆ అడవిలో అక్కడక్కడ దొంగల ముఠాలు అజ్ఞాతవాసం చేస్తున్నాయని వాళ్ళందరికీ తెలుసు. అలాంటిచోట మటరూసింగ్‌తో తగవుపెట్టుకోవడం అహంకారం కాక మరేమీ కాదు. ఇవన్నీ ఆలోచించి జమీందార్లు సమయం కోసం వేచి ఉండాలని భావించారు. పోలీసు బలగంతో మంతనాలు జరిపారు.

ఎప్పటివలెనే మటరూ తన పొలాలలో పంట వేసి, కోతలు కోసి, నూర్పుళ్ళు పూర్తిచేసి, సశ్యాన్ని అత్తవారింటికి పంపించేశాడు. పిల్లల్ని, భార్యని కూడా పంపించాడు.

ఇక వరద కాలం వస్తుంది. ఏ సమయంలో గంగమ్మ తల్లి పరవళ్ళు తొక్కి గుడిసెని ముంచుతుందో తెలీదు. అటువంటప్పుడు పిల్లల్ని రక్షించడం కష్టం. అందుకే అందర్నీ పంపించేసి తాను మాత్రం కాపలాగా ఉన్నాడు. మామగారు కబురు చేసినా గంగమ్మ తల్లి ఒడిలోంచి నదీ తరంగాలు మీదనుంచి వచ్చే చల్లటి గాలి తగిలితే తప్ప నిద్రపట్టదని మటరూ అత్త వారింటికి వెళ్ళలేదు. నూతి నీళ్ళు అతనికి రుచించవు. స్వచ్ఛమైన అతని ఆత్మ గంగమ్మ తల్లి స్నేహ స్పర్శని క్షణమైనా విడిచి పెట్టడానికి అంగీకరించదు. ఆ నదితో అతనికి అంతటి ఆత్మీయబంధం ఏర్పడిపోయింది.

ఈసారి మటరూ మరొక పని కూడా చేశాడు. "ఎవరికిష్టమైతే వాళ్ళు అక్కడి డొంకల్ని, తుప్పల్ని బాగుచేసుకొని వ్యవసాయం చేసుకోండి. ఏ జమీందారు దగ్గర దీన్ని కొనుక్కోనవసరం లేదు. గంగమ్మ తల్లి ఆస్తిపై అందరికీ అధికారం ఉంది," అని మటరూ రైతాంగానికి తెలియజేశాడు.

కబురందుకొన్న రైతులు, కూలీలు, పేదలు నాలువైపుల నుంచి అక్కడకు వచ్చారు. అక్కడంతా జన కోలాహలం, తుప్పల్ని నరికేవారు, డొంకల్ని తొలిగించేవారు అందరికీ పెద్ద దిక్కుగా మటరూ నిలబడ్డాడు.

ఈ వార్త తెలిసిన జమీందార్లు అగ్గిమీద గుగ్గిలం అయ్యారు. "వందల ఎకరాల భూమి సమస్యే కాదు అది ప్రతి ఏటా వచ్చే ఆదాయం నిలిచిపోవడమే"- అని వారు కలవరపడ్డారు. అప్పటికే మచ్చిక చేసుకొన్న పోలీసుల్ని సంప్రదించారు. ప్రస్తుతానికి "ఏమీ చేయవద్దని" పోలీసులు సలహా యిచ్చారు. ఈసారి పోరాటం ఒక్క మటరూ మాత్రమే కాదు. అక్కడ కూడిన రైతుల్ని, కూలీల్ని, పేదల్ని ఎదిరించాలి. దీనివలన లబ్ధి పొందుతున్న వాళ్ళు వాళ్ళే. పోలీసు ఠాణాలో ఓ డజనుకన్నా తుపాకులు ఉండవు. వాటితో వందలాది మంది రైతుల్ని ఎదిరించడం కష్టమైన పని ఆ

అడవి దారులలో చిక్కుకొంటే తప్పించుకొని బయటపడడం మరీకష్టం. అంచేత ఎక్కువ బలగం కావాలి. బలగాన్ని జిల్లా కేంద్రం నుంచి రప్పించాలి. వాళ్ళ ఖర్చుని జమీందారులే భరించాలి. కొత్త పోలీసులు అక్కడకు వచ్చి చేయగలిగిందేమీ ఉండదు. అందుచేత దండగమారి ఖర్చు తప్ప ప్రయోజనం లేదు. అలా అని మటరూని విడిచిపెట్టరాదు. అందుకే సమయం కోసం నిరీక్షిస్తున్నారు. కర్ర విరగకుండా పాముని చంపాలని వాళ్ళు కుట్ర పన్నుతున్నారు.

ప్రస్తుతానికి జమీందార్లు మౌనం వహించి ఉన్నారు. మటరూ మాత్రం తిరిగి తిరిగి అడవిని నరుకుతున్నాడు. "అతను చేస్తున్నదే సరైనదనే" అభిప్రాయానికి రైతులు వచ్చేశారు. ఇక్కడ ఏ జమీందారుకీ హక్కు లేదని వారు గ్రహించారు. అలా ఉంటే యీ పాటికి ఎవరో ఒక్కరైనా జమీందారు వచ్చి గొడవ చేసేవాడు కదా! అనుకొన్నారు. నాలువైపులా "గంగమ్మ తల్లికీ జై" అనే నినాదాలు మారుమ్రోగుతున్నాయి. నదీ తరంగాలు ఆ నినాదా ఘోషకు పరవశించినట్లు మరీ పొంగిపోతున్నాయి.

ఆ యేడాది వేలాదిమంది రైతులు, కూలీలు యిళ్ళల్లో కొత్త సస్యలక్ష్మి చిందులు వేసింది. కొత్త దీపాలు ఆనంద కాంతులు వెదజల్లాయి బోలెడు పంట చెరకు వచ్చింది. మటరూసింగ్‌ని అందరూ అభినందించారు. గౌరవించారు, నమస్కరించారు.

xx xx xx

దసరా వస్తూనే నదికి వరద రాసాగింది. వర్షాలు కూడా బాగా పడుతున్నాయి. అంచేత మటరూ తన గుడిసెని జాగ్రత్తగా చూసుకొనవలసి వస్తోంది. క్రమంగా వరద పెరుగులోంది. గంటకి పది, ఇరవై హస్తాల నేలని ముంచెత్తడం మామూలే. పగలు ఫర్వాలేదు. రాత్రిపూట నిద్ర పోవడానికి అవకాశమే ఉండదు. నిద్రరాదు. గుడిసె యెప్పుడు మునిగిపోతుందో తెలియదు. అందుకే మటరూ కంటిమీద కునుకు లేకుండా కావలికాస్తున్నాడు. గుడిసె ముందు కూర్చుని నదివైపు చూస్తున్నాడు. ఆకాశంలో గర్జిస్తున్న మేఘాల్ని చూస్తున్నాడు, మెరుపుల్ని చూస్తున్నాడు. పిడుగు ధ్వనులు వింటున్నాడు.

క్రింద నేలపై వర్షపు ధారల భయంకర ధ్వని మధ్య మధ్య ఏటిగట్టు పెళ్ళలు విరిగిపడుతున్న శబ్దాలు, కప్పల బెకబెకలు, కీచురాళ్ళ 'గీం'కారాలు భయంకరంగా వినిపిస్తున్నాయి. అతనిలో సహనం క్షణక్షణానికి క్షీణిస్తోంది. ఆ చిక్కటి చీకటిలో ఒకసారి అక్కడ, మరోసారి యిక్కడ వరద నీటి ఉధృత గర్జిస్తున్నట్లు వినిపిస్తోంది. గంగమ్మ తల్లి వికరాళ స్వరూపాన్ని తలుచుకొని మటరూ యిలా అనుకొంటున్నాడు.

"అమ్మ బిడ్డని ఆప్యాయంగా ఒడిలోనికి తీసుకొని పాలిచ్చి, బుజ్జగిస్తుంది కాని ఆగ్రహించి బిడ్డ ముఖాన కొడుతుందా?"

శ్రావణ మాసం గడిచేకొలదీ మటరూ గుడిసె జరిగి జరిగి ఒక గ్రామం దగ్గరకు చేరింది. రోజులు అదోలా గడుస్తున్నాయి. అమ్మకి కోపం పెరిగిపోయింది. "పట్టుబడి పోయావంటే కష్టాలు తప్పవు" అని ఆ గంగమ్మ తల్లి హెచ్చరిస్తున్నట్టుంది. వరద తీసేసే రోజాలంటేనే మటరూకి యిష్టం. గంగమ్మ తల్లి వెనక్కు తగ్గుతూ "రా! నన్ను పట్టుకో" అంటున్నట్లుంటుంది. వెనక్కు పరుగుపెడుతున్న తల్లిని వెంబడించి, ఆమె చాచిన అనురాగ హస్తాలు అందుకొని, ఆనందించే బిడ్డ వలె అయిపోతాడు మటరూ. అంతలోనే ఆమె సన్నిధిలో నిలబడి విహ్వలుడై కళ్ళు నీళ్ళు పెట్టుకొని " అమ్మా! గంగమ్మ! ఇన్నాళ్ళూ నువ్వు నామీద ఎందుకింత కోపగించావ్!" అని తన్మయంగా అంటాడు. తల్లీబిడ్డల ఈ దోబూచులాట ప్రతీ సంవత్సరం జరిగేదే. ఒక్కొక్కసారి తల్లి పరుగుపెడుతుంది. ఒక్కొక్కసారి కొడుకు పరుగు పెడతాడు. ఒక్కొక్కసారి తల్లి పరుగుపెట్టిస్తుంది, కొడుకు పరుగుతీస్తాడు. ఈ ఆటలో ఎంత మజా!

నది సముద్రంలో కలిసి పోయినప్పుడు, ఒడ్డున గుడిసె వేసుకొందుకు జాగాయే లేనప్పుడు మటరూ విధి లేక ఏదో ఒక గ్రామం వద్ద తాత్కాలికంగా ఒక గుడిసె వేసుకొని కాలక్షేపం చేస్తాడు. తల్లి దూరమైన బిడ్డవలె కన్నీళ్ళతో అతడు గంగమ్మ తల్లి దగ్గరకు ఎప్పుడు వెడదామా? అన్నంత ఆత్రంతో అలా చూస్తుంటాడు. తుఫాను వేగంతో వరద నీరు ప్రవహిస్తుంది. ప్రళయ ధ్వని చేస్తుంది. ఆ ప్రయాణ మార్గంలో ఎత్తు పల్లాల్ని సమానం చేసేస్తుంది. ఒక్కొక్కచోట వృక్షాలు పెళ్ళగించుకొని ప్రవాహంలో పడిపోయి కొట్టుకొని పోతాయి. ఆ ప్రవాహంలోఎదురీది ఆ చెట్లని ఒడ్డుకు రావాలని అప్పుడప్పుడు మటరూ ఆశపడుతుంటాడు. తల్లి కన్న బిడ్డ శక్తి తక్కువ యేమీ కాదు.

వరదలో కొట్టుకొనిపోయే గుడిసెల్ని చూసి మటరూ "అమ్మా ! ఏమిటిది ! నిస్సహాయులైన నీ బిడ్డల యిళ్ళు యిలా మింగేసి వాళ్ళకి బాధ కలిగిస్తున్నావా? అంత కోపం దేనికమ్మా" అనుకొనేవాడు.

పట్టణం గాలి అతనికి సరిపడదు. పట్టణం ప్రజలు ఉన్న అరణ్యం అని అతని అభిప్రాయం. పైగా అది ఇరుకుగా ఉంటుంది. ఇక్కడి అపారమైన మైదానం సీమాంతాలు లేని గంగమ్మ తల్లి ఒడి, చల్లటి గాలి, పచ్చటి వాతావరణం మధ్య స్వేచ్ఛగా పెరిగిన అతనికి నగర వాతావరణపు నియమ నిబంధనలు యిష్టం ఉండవు.

అమృత స్పర్శనిచ్చే ఆ మట్టి, ప్రాణ స్పర్శ చేసే ఆ గాలి, జిహ్వ స్పర్శ చేసే ఆ నీరు అతనికి మహా యిష్టం. ఆ చల్లటి నీళ్ళల్లోకి దూకి, గంటల తరబడి, అలిసిపోయే వరకు ఈత కొట్టి, ఆ ప్రవాహపు శయ్యపై అలా నిద్ర పోవాలని అతనికి అప్పుడప్పుడు అనిపిస్తుంటుంది. అంతలోనే పెళ్ళాం, పిల్లలు గుర్తుకు వచ్చి వాళ్ళ యోగ క్షేమాలు స్ఫురణకు వచ్చి నిస్సహాయంగా నిట్టూరిస్తాడు. నదిలో దూకలేక వెనుదిరిగి వచ్చేస్తాడు.

ఇటీవలి కాలంలో అత్తమామల పట్టుమీద అక్కడకు వెళ్ళినా ఒక్క రోజుకన్న యెక్కువ ఉండేవాడు కాదు. తల్లి పిలుస్తున్నట్లు భావావేశపరుడై పరుగున వచ్చేసేవాడు. తిరిగివచ్చి గంగమ్మ తల్లి ఒడిలో ఆ లంక మట్టిమీద సేదతీరి, స్నానం చేసేవరకు అతనికి స్థిమితం ఉండేది కాదు. మటరూకి ఆ మట్టితో అంత అనుబంధం బలపడిపోయింది.

xx xx xx

ఆ రోజు రాత్రి చాలాసేపు గుడిసె బయట కూర్చొని అలా చూస్తునే ఉన్నాడు. కళ్ళు మూతలు పడడంతో మటరూ లేచి నులకమంచం వేసుకొని పడుకొన్నాడు. చల్లటి గాలి సున్నితంగా వీస్తోంది. నీటి ప్రవాహం రాగయుక్తంగా పాడుతూ లయబద్ధంగా ప్రవహిస్తోంది. మృదుమధురమైన ఆ ధ్వనిని వింటూనే మటరు గాఢంగా నిద్ర పోయాడు.

నిద్రలోనే అతనికి తన గుండెలపై యెవరో మణుగుల బరువుంచినట్లు అనిపించింది. అతను అతికష్టం మీద కనులు తెరిచాడు. ఇద్దరు యువకులు టార్చిలైట్లు వేసి తన గుండెలపై నిలబడి ఉండడం కనిపించింది. చేతి దన్ను మీద పైకిలేవాలని మటరూ ప్రయత్నించాడు. కాని అతనికి ఆ అవకాశం

యివ్వక ఆ యువకులు ఉక్కు గొలుసులు భర్! భర్! మని ఆడించారు. మటరూకి తన చేతులు కట్టివేసినట్లు అర్థం అయింది. భయపడి అతను అటూయిటూ చూశాడు. నలువైపుల పోలీసు కానిస్టేబుల్స్ నిలిచి ఉన్నారు. అతనికి పరిస్థితి అర్థం అయింది. కోపం, అసహ్యం ముప్పిరికొనగా మటరూ పళ్ళుకొరికాడు. అతను యిక్కడికి వచ్చినప్పటి నుంచి పోలీసులు వెంబడిస్తూనే ఉన్నారు. ఇవాళ సమయం కలిసి వచ్చింది. ముట్టడించారు. రాత్రికి రాత్రే అతని చేతులకు బేడీలు వేసి జిల్లా జైలుకి తీసుకు వెళ్ళారు. గ్రామస్తులెవరూ నోరు విప్పడానికి లేకుండా బెదిరించారు.

కోర్టులో తప్పుడు కేసు, తప్పుడు సాక్ష్యాలు అన్నీ ముందుగానే సిద్ధం అయాయి. మామ గారికి సంగతి తెలిసి ఆదరాబాదరా వచ్చి వాకబు చేయగా "మటరూని దొంగతనం కేసుపై అరెస్టు చేసినట్లు" తెలిసింది. పోలీసులు అతడి యింటిని సోదా చేయగా అక్కడ జిందాపూర్ జమిందార్ నాథునిసింహ్ గారింటి నగలు, సరుకులు స్వాధీనం చేసుకొన్నారు. ఆ వస్తువుల్ని గుర్తించారు. త్వరలోనే కేసు విచారణకు వస్తుంది. ఇందుకు తాగిన సన్నాహాలు జరుగుతున్నాయి.

ఇది విన్నవారు ఆశ్చర్యంగా చూశారు. కొందరు విచారించారు. కాని ఏ ఒక్కరూ పోలీసులకు, జమీందారుకు వ్యతిరేకంగా, మటరూకి మద్దతుగా సాక్ష్యం యివ్వడానిక ముందుకు వచ్చే ధైర్యం చేయలేకపోయారు. పైగా మటరూ సర్దార్ ముఠాలోని యాభైమంది దొంగలు పరారీ అయ్యారని, వారికై పోలీసులు గాలిస్తున్నారని ప్రచారం చేశారు. పైగా ఏ రోజుకారోజు ఒకరిద్దరు దొంగల్ని పోలీసులు అరెస్టు చేసినట్లు వార్తలు ప్రచారం చేయసాగారు.

నెలల తరబడి ఆలోచించి జమీందార్ల ప్రోద్బలంపై పోలీసులు తయారుచేసిన కేసుని నెగ్గుకు రావడం ఎవరికీ సాధ్యంకాదు. జిల్లాలో అన్ని స్థాయిలలోని అధికారులకు ముడుపులు అందాయి. వ్యతిరేకిస్తారనుకొన్న వారికి బెదిరింపులు, హెచ్చరికలు అందాయి.

మటరూ మామగారు, బావమరుదులు చేయగలిగింది చేశారు. కాని జరగవలసింది జరిగింది. నెలల క్రితమే మొహరు వేసి ఉంచిన పథకం ప్రకారం తీర్పు వచ్చింది.

మటరూకి మూడేళ్ళ జైలుశిక్ష విధించారు. మూడురోజుల్లోగానే అతనిని ఒకనాటి రాత్రి రైలులో వారణాసి జిల్లా జైలుకు తరలించారు.

## ఆరు

వదినగారి జీవితం సాధనామయం అయింది. రాత్రింబవళ్ళు మనసులో మెదిలే భర్త స్మృతుల నుంచి బయటపడాలని ఆమె యేదో ఒకపని కల్పించుకొని దానిలో నిమగ్నం అవుతోంది. కళ్ళు నెత్తుటి నీరు ప్రవహిస్తూనే ఉన్నాయి. చేతులు పనిచేస్తూనే ఉన్నాయి. జరుగుతున్న దానిని అత్తమామలు నిస్సహాయంగా చూస్తూనే ఉన్నారు. ఒక్క ఓదార్పు మాటని కూడా వారు అనలేకపోతున్నారు. అంత చిన్న వయసులో వైధవ్యం సంప్రాప్తించిన ఆమెని ఎవరు ఓదార్చగలరు ? ఒక బిడ్డ ఉన్నా వాడి ముఖం చూసి వూరడిల్లమనేవారు. ఆ అవకాశం కూడా లేదు. ఇంక ఏం చెప్పగలరు ? అటువంటి వితంతువు జీవితం ఎన్నడూ మొలకెత్తే అవకాశం లేని బీడు భూమి వంటిది. ఆమె జీవితం వ్యర్థమై విఫలమై పోయింది. భూమికి భారమైన వూసర క్షేత్రం వలెనే ఆమె జీవితం బరువైపోయింది. అయితే వూసర క్షేత్రంలో మొలిచే పిచ్చి మొక్కల కర్రల్ని తుప్పల్ని ఎండబెట్టి వంట చెరకుగానైనా ఉపయోగించవచ్చు. గృహస్థ జీవితంలో అటువంటి వితంతువు ఉపయోగం కూడా అంతే అనిపిస్తుంది. తనను తాను మండించుకొని కుటుంబానికి సేవలు చేయడమే మిగిలిన విధి. చివరకు ఈ సేవా శుశ్రూషలలోనే ఆమె జీవితం కాలి బూడిదై పోతుంది.

ఈ స్థితే వదినకి దాపురించింది. ఆమె అన్ని పనులూ చేస్తుంది. ముసలి అత్తగారు ఒక మూలనపడి ఉండి కొడుకుల గురించి వెక్కివెక్కి ఏడుస్తుంటుంది. అసలే రోగగ్రస్తుడైన మామగారికి ఒకదాని వెంట వేరొకటి ఆపదలు వచ్చి పడడంతో అతడి స్థితి మరీ దిగజారింది. "ఏమైంది ? ఏవిటిదంతా ?" అని తనలోతాను బాధపడుతూ మానసికంగా కృంగిపోయాడు. తన కుటుంబ జీవన ఆనందం గురించి, మగపిల్లల ఉద్ధతి గురించి గుర్తు వచ్చినప్పుడల్లా అతను "దేవుడా ! యింత దుఃఖం కలిగించడానికి నేనేం పాపం చేశానయ్యా !" అని శూన్యంగా చూస్తుంటాడు.

ఒక్కొక్కసారి ఆ యింటిలో ముగ్గురు మనుష్యులు ఒకరికొకరు సాంత్వనం చెప్పుకొందుకు కలుస్తారు. కాని నోటమాట రాక ఎవరికివారు కళ్ళ నీళ్ళతో ఒకరినొకరు చూసుకొని మిన్నకుండిపోతుంటారు. అంతలోనే ఒకరినొకరు దగ్గరగా తీసుకొని వూరడించుకొంటారు. ఒకే వ్యధన అనుభవిస్తున్న వారికి ఆ బాధే కలిపి ఉంచింది. అలా ముగ్గురూ ఉమ్మడిగా బాధపడుతున్నప్పుడు యిరుగు పొరుగువారు వచ్చి వారిని వూరడించి వెళుతుంటారు.

వారు ప్రశాంత చేతస్కులై మౌనంగా వుండిపోతారు. ఆ యింటిలో అసలు మనుష్య సంచారమే లేనంత నిశ్శబ్దం ఆవరిస్తుంది. వ్యథావేగం వారి రక్తంలోనే ప్రసరిస్తుండిపోతుంది. కాని పెదిమలు కదలవు. వచ్చినవారు నెమ్మదిగా వెళ్ళిపోతుంటే వారు అలా చిత్తరువులై ఉండిపోతారు. "పాపం ! ఎంత ఘోరం జరిగింది. ఆ గోపీచంద్ విడుదలై వచ్చినా వీళ్ళకి కొంత వూరట!" అని ఇరుగు పొరుగువారు అనే మాటలు విని కూడా విననట్లుండిపోతారు.

వదినకు ఎప్పుడూ సరిగా నిద్రపట్టదు. మెలకువ వచ్చేస్తే యేదో ఒక పీడకలలోంచి తేరుకొన్నట్లు అనిపిస్తుంది. మంచం మీద కూర్చుని జ్ఞాపకాల బరువుతో వెక్కివెక్కి ఏడుస్తుంది. రాత్రి దించిన నిశ్శబ్దపు తెరపై ఆమె గత చరిత్ర అంతా చిత్రం వలె కనిపిస్తుంది. విహ్వలయై ఆమె ఆ చరిత్ర పుటలని నిరాసక్తంగానే తిప్పుతుంది. ఇంకా నిద్రపట్టకపోతే లేచివెళ్ళి వంట పాత్రల్ని పెరడులో వేసుకొని కడుగుతుంది. ఆ చప్పుడుకు అత్తమామలు మేల్కొని "ఏవిటమ్మా ! అప్పుడే లేచేశావా -? ఇంకా తెల్లవారడానికి చాలాసేపుందేమో ?" అంటారు.

"ఇంకా రాత్రేవిటి ! చుక్క పొడిచింది" అంటుందామె.

"ఏవిటో నాకింకా పూర్తిగా కునుకైనా పట్టలేదు. అప్పుడే చుక్క పొడిచింది అంటున్నావ్. ఎంతమంది వున్నారని ? ఇంత తొందరగా లేచి పనులు చేయడానికి, పడుకోమ్మా ! పడుకో !" అని అత్తగారు బుజ్జగిస్తుంది.

ఆమె సమాధానం యేమీ చెప్పదు. అత్తగారు 'హేరామ్!' అంటూ మరల నిద్రలోకి జారుకొంటుంది.

వంట పాత్రలు కడిగి లోపల పెట్టి పాచి పనులు చేసేసి, స్నానం చేస్తుందామె. ఆరిన తెల్లబట్ట కట్టుకొని దేవుడి దగ్గర కూర్చుంటుంది. దీపం

పెట్టుకొంటుంది. రామాయణం తెరిచి నెమ్మదిగా చదువుకొంటుంది. ఆమె యెక్కువగా చదువుకోలేదు. రామాయణం అక్షరాలు ఆమెకి అంతగా అర్థం కావు. అయినా చదువుతుంది. చిన్నప్పుడు అన్నగారితో కలిసి కొన్ని నెలలు స్కూలుకు వెళ్ళి నాలుగు అక్షరాలు నేర్చుకొంది. అక్షరాలపై ఆటపాటలపై ఆసక్తి ఎక్కువైంది. ఈలోగానే తల్లి చదువు మానిపించేసింది. ఆడపిల్లకి చదువెందుకని మందలించింది. అందుకే చదువంతా మరిచిపోయింది. ఇప్పుడు కాలక్షేపం కోసం ఆ అక్షరాల్ని మరల గుర్తు చేసుకొని రామాయణం చదువుకొంటోంది. ఆమె దగ్గర అది తప్ప మరో పుస్తకం లేదు. ఒక్కొక్క చేపాయి (నాలుగు పాదాల పద్యం) చదవడానికి చాలా సమయం పడుతోంది. అక్షరాన్ని అక్షరంలో కలిపి పదాన్ని అనుకొంటోంది. ఆ పదాన్ని పునశ్చరణ చేసుకొని రెండవ పదాన్ని అల్లుకొంటోంది. ఇలా ఒక చరణాన్ని పూర్తి చేయడానికి ఆమె మొత్తం అక్షరాల్ని యెన్నోసార్లు పునశ్చరణ చేయవలసి వస్తోంది.

ఈ పారాయణం వలన ఆమెకి యేమీ అర్థం కాకపోయినప్పటికీ కాలం గడిచి, పైకి చెప్పుకోలేని ఆధ్యాత్మిక స్వాంతన, సుఖం లభిస్తున్నాయి. ఇలా ఒక పని పూర్తయాక క్రమంగా మరొక అభ్యాసం ద్వారా తను సమయాన్ని గడిపే మార్గం దొరుకుతుందని ఆమె ఆలోచిస్తోంది. సమయాన్ని గడపడం కన్న దుఃఖితులకు పెద్ద సమస్య యేమీలేదు. ఆమె జీవితాంతం యిలాగే గడపవలసిన ఒక అభాగిని. వితంతువు జీవితంలో ఒక్క క్షణమైనా సుఖం గురించి ఆలోచించే అవకాశం ఏదీ ?

అత్తమామలు లేవకుండానే యింటి పనులు పూర్తి చేస్తుంది. పనివాడు రాగానే పాలు తీయిస్తుంది. వాడితో గేదెల్ని మేతకు తోలించేస్తుంది. అవసరమైన సామాన్నిచ్చి వాడిని పొలానికి పంపిస్తుంది. పాత పాలెగాడు చాలా నమ్మకమైనవాడు. వ్యవసాయం అంతా వాడిమీదే వదిలిపెట్టారు. ఇంటిలో మనిషి వలె అతను నమ్మకంగా పనిచేసి ఆమెకు జమాఖర్చులు ఖచ్చితంగా చెప్పేస్తాడు.

అత్తగారు లేస్తూనే కోడల్ని పిలుస్తుంది. ఆమెకు సమస్త సపర్యలు చేస్తుంది. ఇంతలో మామగారు పిలుస్తాడు. అతడికి చిలుం సిద్ధం చేసి యిస్తుంది. అన్ని రకాల సేవలు చేస్తుంది.

ఇప్పుడామె యిదివరకటి మనిషి కాదు. ఆనాటి రూపం లేదు. రంగు లేదు. యౌవ్వనం లేదు. ఆ శరీరం కాదు. ఇదివరకటి వదినకి నీడ వలె ఆమె మారిపోయింది. ఆమె ఛాయ నడుస్తున్నట్లుంది. సన్నటి శరీరం, కాంతిహీనమైన చర్మం, కాంతిహీనమైన ముఖం, ఉదాసీనమైన ముఖకవళికలు, నీటిపూటల వంటి కళ్ళు, ఎండిన పెదిమలు, విలపించిన కరుణ నడుస్తున్నట్లుందామె. జీవితం చిత్రపటం అయినట్లు, చిత్రపటానికి ప్రాణం వచ్చి నడుస్తున్నట్లు ఉందామె.

ఆమె ఎందుకు జీవించి ఉంది ? అతనితోబాటే ఆమె ప్రాణాలు ఎందుకు పోలేదు ? ఎంత అదృష్టవంతురాలు చెల్లెలు. ఆమెను భగవంతుడు తన దగ్గరకు పిలుచుకొన్నాడు. తానెంత దురదృష్టవంతురాలు ... ఈ నరకాన్ని అనుభవించడానికే మిగిలిపోయింది. ఈ నరకంలోంచి తాను ఎన్నడు బయట పడగలదు ! అసలు విముక్తి ఉందా ?

నెలల తరబడి శోకాకుల జీవితం గడిపాక, యాంత్రిక జీవితం గడిపాక, అభ్యాసమైన జీవన వ్యర్థతలోంచి, నిరాశానిశలోంచి ఆమె మనస్సు యిప్పుడు మరల పాత సుఖాలు గురించి ఆలోచించసాగింది. ఒకనాడు తన మనస్సుని స్పృశించి, ఆనంద స్మృతులని యిచ్చిన ఆ సుఖాంకురాలు మరల ఆమెలో మొలకెత్తసాగాయి. భర్త తనకి అందించిన మధురానుభూతులు ఆమెలో త్రుళ్ళింతలు కలిగించసాగాయి.

"ఇక జీవితంలో ఆ ఆనంద దినాలు మరల రావా ? ఆ సుఖం యిక లభించదా ?" అనే ఆలోచనతో ఆమె ఉక్కిరిబిక్కిరి అయేది. అంతలోనే నిట్టూర్చేది. మనిషి మనసులో యిలాంటి భావాలు అంకురించనేకూడదు కాని అంకురిస్తే అవి వివశం చేసి తీరుతాయి.

అలాంటి సమయంలో ఆమె మనస్సు తన మరిదివైపు మళ్ళుతుంది. జైలులో ఉంటున్న అతని పరిస్థితి కూడా తన వలెనే ఉంటుందని అనుకొంటోంది. అతని జీవన మధుభాండం కూడా తనకు వలెనే పగిలిపోయింది. అందుకే అతను కూడా తన వలెనే భావావేశాలతో పెనగులాడుతూంటాడు.

"వాడికేమిటమ్మా ! మగమహారాజా. జైలు నుంచి రాగానే మళ్ళీ పెళ్ళి చేసుకొంటాడు. ఎప్పటిలాగానే సుఖానందాలు అనుభవిస్తాడు," అతడి ప్రసక్తి వచ్చినప్పుడు యిరుగు పొరుగు వారు ఆమెతో అనేవారు.

ఆ మాట విన్నప్పుడు ఆమె లోలోపల ఆలోచించేది. అతడిపట్ల అసూయ కలిగేది. "ఏమిటీ తేడా ! స్త్రీకి ఒక ధర్మం. పురుషుడికి ఒక ధర్మం ఏమిటి ? ఈ వివక్షని ఏర్పరిచిన సమాజాన్ని కాల్చి మసి చేయాలన్నంత కోపం వచ్చేది. స్త్రీ పురుషులు కలిసి అనుభవించే సుఖంలో పురుషుడికి ఆధిక్యత ఏమిటి ? స్త్రీకి యీ న్యూనత యేమిటి ? అతడికి ఆ అధికారం ఏమిటి ? అలా జరగడానికి వీలులేదు. జీవన మాధుర్యాన్ని ఆస్వాదించే అధికారం తనకీ ఉండాలి.

ఏమిటి యిలాంటి ఆలోచనలు వస్తున్నాయి. ఆమె ఆలోచనలలోంచి తేరుకోగానే తనపై తనకే ఆశ్చర్యం వేస్తోంది. ఇంతవరకు భర్తతోటి ఆనంద క్షణాలు గురించిన నిన్నటి ఆలోచనలు వస్తున్నాయి. మరిదేవిటి యిప్పుడు తన మనసిలా మారిపోయి యిలాంటి వింత ఆలోచనలు చేస్తోంది ? అంతరాంతరాళంలో యిలాంటి కోరికలు కలుగుతున్నా యేమిటి ? నిన్నటి ఆలోచనలలోంచి రేపటి వూహలు చేస్తున్న తనపట్ల తనకే సిగ్గు కలుగుతోంది. తన మనస్సులోని భావాలు యెవరికైనా తెలిస్తే ? అలా జరగడానికి వీలులేదు.

"లోకం యేమంటుంది ? ప్రజలు ఏమంటారు ? తనని యెంత పాపాత్మురాలిగా భావిస్తారో ? భర్త పోయి రెండు, మూడు సంవత్సరాలయినా కాలేదు అప్పుడే -- ఎలాంటి ఆలోచనలు చేస్తోందో ? వితంతు జీవన పవిత్రతని మంటకలిపి ఎలా బరి తెగిస్తుందో ! పిదపకాలం పిదపకాలం బుద్దులూను," అని లోకం అంటుందని ఆమె ఆలోచిస్తోంది.

ఆమె వివశురాలవుతోంది. వ్యాకులపడుతోంది. ఈ అపవిత్ర భావాలని తాను ఎలా కడిగి వేసుకోగలదు. ఆమె దేవుడు ముందు నిలచి యిలా ప్రార్థించింది.

"భగవాన్ ! నేను కుటుంబ మర్యాదకి కట్టుబడి ఉండే ధైర్యాన్ని ప్రసాదించు. శక్తినియ్యి. మనస్సులో అంకురిస్తున్న అపవిత్ర భావాలు అదుపు చేసుకొనే శక్తినియ్యి. ఈ వితంతు జీవన పద్ధతికి నా వల్ల కళంకం రారాదు."

కాని భగవంతుడి నుంచి ఆమె కలాంటి శక్తి అందడం లేదు. మనస్సు లేడి వలె గంతులు వేస్తూనే ఉంది. భర్త గురించిన ఆలోచన మానే వరకు ఈ విపరీతపుటూహలు ఆగవు. ఎంత ప్రయత్నించినా ఆ జ్ఞాపకాలు వదలడం లేదు. జ్ఞాపకాలు విజృంభించినప్పుడల్లా ఆమెకి ఆ స్పర్శా సుఖ వేదన

పీడిస్తోంది. మధురానుభూతికై శరీరం తహతహలాడుతోంది. ఒక ప్రక్క సంప్రదాయపు ఛాయలు, రెండవ ప్రక్క కోర్కెల సెగలు ఆమెని ద్వైధీభావంలో ముంచెత్తుతున్నాయి. ఈ పోరాటంలో ఏ భాగం విజయం సాధిస్తోందీ ఆమె గ్రహించలేకపోతోంది. ఏ భాగం వోడిపోతుందో తెలియడం లేదు.

ఈ భావ సంచలనం వలన, ఆమె ప్రవర్తనలో, గృహకృత్యాలలో మార్పు వచ్చింది. అత్తమామలకి సేవ చేయడంలో యిదవరకటి తన్మయత్వం లేదు. అర్థ మనస్సుతోనే వాళ్ళ సేవలు చేస్తోంది. అత్తగారు ఆలస్యానికి విసుక్కొంటే "నాకు ఉన్నవి రెండే చేతులు అయినా రాత్రి పగలూ చాకిరీ చేస్తూనే ఉన్నానుగా. అది అవలేదు, ఇది అమరలేదు అని సణిగితే ఎలా ?" అని ఆమె జవాబు చెప్తోంది.

అత్తగారు యీ మాటలు విని లోలోపలే విసుక్కొనేది. వినిపించీ వినపించకుండా శాపనార్థాలు పెట్టేది. కొన్నాళ్ళు ఎవరికి వారిలా సణుక్కొనేవారు. తర్వాత దెబ్బలాడుకోసాగారు. దుఃఖమయ శాంతి వాతావరణం యిప్పుడా యింటిలో లేదు. ఊరూ, వాడా యిప్పుడు ఆ యింటి సంగుతులే చెప్పుకొంటున్నారు. వాళ్ళ మాటలు మత్సరగ్రస్తమైనవి. అత్యుక్తులతో నిండినవి. అంతేకాక అవి వృధా ప్రసంగాలు.

×× ×× ××

ఒక రోజు ఉదయం ఆమె గడ్డిమేటులోంచి గడ్డిని పాలెకాపుకి అందిస్తోంది. కొంతసేపయాక వాడు "చిన్నమ్మా ! చాలా రోజుల్నుంచి వో మాట అడగాలనుకొంటున్నాను. అడుగుతాను. ఏమీ అనుకోరు కదా !" అన్నాడు.

గడ్డి పీకడం ఆపి, బట్టలపై పడిన గడ్డి పరకలను, దుమ్మును దులుపుకొని ఆమె "ఏమైనా కావాలా ? ఏమిటి సంగతి ?" అని అడిగింది.

"అదేం కాదు" అని వాడు నంగనాచి కరుణ ప్రదర్శిస్తూ పెదాలపై చిరునవ్వు తెచ్చిపెట్టుకొని, ఎంతో సానుభూతి ఒలకబోస్తూ "మీ ఒళ్ళు చూస్తే నాకు చాలా బాధ కలుగుతోంది. మీ వయసెంతని ? ఇంత చిన్నతనంలోనే మీకీ దురదృష్టం కలిగింది. ఈ కొద్ది రోజుల్లోనే బంగారంలాంటి మీ ఒళ్ళు

మకిలపట్టేసింది. ఈ రూపంలో మిమ్మల్ని చూస్తుంటే బాధ కలుగుతోంది" అని వాడు ఏడ్చినంత పని చేశాడు.

ఆమె ముఖం మీది ఉదాసీనపు నీడ మరీ నల్లబడింది.

"దౌర్భాగ్య జ్వాల ఎవరి నుదుటి కుంకుమనైనా చెరిపి వేస్తుంది. నా కర్మ యిలా ఉంది. దేవుడు నా సింధూరాన్ని చెరిపివేశాడు. ఇలా ఏడుస్తూనే జీవితాంతం గడపాలి. నువ్వు బాధపడకు. ఎవరి ఖర్మకి ఎవరు కర్తలు ? నా సుఖసంతోషాలని ఆ దేవుడే భరించలేకపోయాడు" ఆమె ఈ మాటలు అంటూనే వెక్కిళ్ళతో ఏడ్చింది.

చల్లటి గాలి పీల్చి పాలెకాపు "ఇదెక్కడి న్యాయం ! ఎలా చూసినా మా కట్టుబాట్లే బాగున్నాయి. మా యిళ్ళల్లో ఎవరైనా విధవ అయితే జీవితాంతం అలాగే గడపవలసిన ఖర్మ వాళ్లకేం లేదు. నా సంగతే చూడండి. మా అన్నయ్య వదిన్ని వదిలిపోయాడు. ఆమెకి నేనంటే యిష్టం. మేమిద్దరం పెళ్ళి చేసుకొన్నాం సుఖంగా గడుపుతున్నాం. మీ పెద్ద కులాల్లో అయితే ఇది కుదరదు. మీలా ఏడుస్తూ గడపాల్సిందే ! చిన్నమ్మ గారూ ! మీరు మీ గోపీ మరిదిని పెళ్ళి చేసుకొంటే ఏమవుతుందా అని నా ఆలోచనమ్మా !" అన్నాడు.

"ఒరేయ్ !" ఆమెలో ఉన్నత కులపు అభిజాత్యం తలఎత్తింది.

"మళ్ళీ యిలాంటి మాట ఎన్నడైనా యెత్తావో ? జాగ్రత్త ! ఈ యింటి ఉప్పు తింటూ యీ యింటి మర్యాదనే తారుమారు చేయాలను కొంటున్నావా ? నాలుక కోసేస్తాను జాగ్రత్త. బ్రతక లేకపోతే చితిలో ప్రాణ త్యాగం చేస్తుంది తప్ప ఈ యింటి కోడలు ప్రాణాలతో ఉండి పతిత అవదు. పో!" అని ఛీత్కరించి, ఆమె విసురుగా దుఃఖంగా అక్కడి మంచంపై కూలబడింది. వెక్కివెక్కి ఏడ్వసాగింది.

అప్పటికింకా అత్తమామలు నిద్ర లేవలేదు. ఆమె చాలాసేపు అలా ఏడుస్తూనే ఉంది. అవమానభారంతో ఒక అహంకారం చేస్తున్న ఆర్తనాదం అది. ఇంటి పాలెకాపు అన్న మాటనే ఆమె యిదివరకు యెన్నోసార్లు మనస్సులో అనుకొంది. అయితే అది తనలో ఉన్న రహస్యం, అభిజాత్యం, సంప్రదాయం మధ్య ఆమె తన భావాలు ఎవరికీ తెలీకుండా పదిలపరచుకొంది.

తన ఆలోచనలను వాడు పసిగట్టాడన్న భావం ఆమెని క్షుభితం చేసింది. కలవరపరిచింది. కోపం కలిగించింది. వాడిపట్ల జాగ్రత్తగా ఉండాలన్న

జాగరూకతని ఆమెలో జాగృతం చేసింది. ఒకసారి పట్టుబడిన దొంగ ఎంత అప్రమత్తంగా ఉంటాడో ఆమె అంత మెలకువగా వ్యవహరించసాగింది. ఆ రోజు నుంచి పాలెగాడి కంటపడకుండా మెలగసాగింది. అత్తగార్ని పెందరాళే లేపుతోంది. ఆమెచేతనే పశువులకి గ్రాసం పంపిస్తోంది. ఆమె చేతనే పాలు పితికించి తెస్తోంది. ఎంత మరిది అయినా వితంతువైన వదినగారు అతడి ఎదురుపడకుండా ఉంటేనే లోకం హర్షిస్తుంది. అలాంటి స్త్రీని అభినందిస్తుంది.

అయినా ఆమెలో మరిదిపట్ల అనురాగం పొంగి వస్తోంది. పాలెగాడు ఆ మాట అన్నప్పటినుంచి ఈ ఆలోచన ఆమెలో కొత్త రెక్కలు తొడుక్కుంటోంది. తాను అతనిని కోరుతున్నట్లు అతను తనని కోరుకోవడం లేదేమో ? అనే సందేహం కూడా ఆమెని వేధిస్తోంది. ఎక్కువగా కోరుకొనే వస్తువు గురించి, అధికంగా ప్రేమించే మనిషి గురించి యిలాంటి వూహలు, అపోహలు కలుగుతుండడం సహజం. అది ఒక మానసిక బలహీనత. ఈ ఆలోచనల మధ్యనే ఆమెకి ఆ పాలెకాపుపట్ల కోపం వస్తుంటుంది.

ఆమె ఆలోచనల శయ్యనిండా అనుమానాలు భయాల ముళ్ళుపరుచుకొని ఉన్నాయి. అందుకే ఆమె నిశ్చింతగా దానిపై పడుకొనలేకపోతోంది.

## ఏడు

బెనారస్ జిల్లా జైలుకి రాగానే మటరూసింగ్‌కి శ్వాసకోశ సుస్తీ చేసింది. మొదట్లో మూడు నాలుగు రోజులు ఎవ్వరూ అతన్ని పట్టించుకోలేదు. అయినా నెమ్మదించకపోవడంతో ఆస్పత్రిలో చేర్చారు. అక్కడ అతని బెడ్ గోపీ చికిత్స పొందుతున్న బెడ్ ప్రక్కనే వచ్చింది. ఆ ఆస్పత్రికి డాక్టర్ ఒకసారి వస్తాడు. మరొకసారి రాడు. అంతా ఆయన యిష్టం. కాని అక్కడి కాంపౌండర్ మాత్రం మంచివాడు. సహాయశీలి. కలుపుగోరు మనిషి. అతను దగ్గరుంటే చాలు సగం రోగం నయమైపోతుంది. రోగుల్ని అతను

అంత ఆత్మీయంగా చూసుకొంటాడు. అయితే జబ్బు నయం అయాక కూడా చాలామంది అక్కడే ఉండిపోవాలని కోరుకొంటుంటారు. ఎందుకంటే ఆ ఆస్పత్రిలో మంచి ఆహారం యిస్తారు. పాలు యిస్తారు. అందుకని అక్కడికి వచ్చే ఖైదీలు పోలీసులకు, యితర అధికారులకు ఆస్పత్రి సిబ్బందికి లంచాలు యిచ్చి సాధ్యమైనన్ని ఎక్కువ రోజులు అక్కడే ఉండాలని ప్రయత్నిస్తుంటారు.

ఒక వారం రోజుల వరకు మటరూసింగ్ దిక్కులేకుండా పడి ఉన్నాడు. అతను బాధగా మూలుగుతూ నరకయాతన అనుభవించాడు. కాంపౌండర్ అతనికి ఉపచారాలు చేశాడు. సెలవు గురించి కూడా ఆలోచించక అతడికి ఆ కాంపౌండర్ సేవలు చేశాడు. ఎన్నో ఇంజక్షన్లు చేశాక మటరూ ఆరోగ్యం కొంచెం బాగుపడింది. ఇప్పుడతను గంటల తరబడి నిద్రపోతున్నాడు. నిద్రలోనే ఉలిక్కిపడి "అమ్మా ! అమ్మా !" అని కలవరిస్తాడు. అలానే లేచి కూర్చుని నిద్రా మెలకువా కాని స్థితిలో శూన్యంగా, బేలగా, బెంగపడిన పిల్లవాడిలా చూస్తుంటాడు. అతని వింత ప్రవర్తనకి గోపీచంద్ ఆశ్చర్యపోతున్నాడు. ఒకనాడు అడిగాడు.

"నీకు అమ్మ బాగా జ్ఞాపకం వస్తోందే ?"

అందుకు మటరూ "అవును" అని దూరంగా చూస్తూ "ఆమె రాత్రింబవళ్ళు నన్ను పిలుస్తోంది. ఆమె దగ్గరకు వెళ్ళేవరకు నాకు శాంతి లేదు. ఆమె ఒడిలో చేరి ఆ మంచి గాలి పీల్చి ఆ చల్లటి నీళ్ళు త్రాగితే తప్ప నాకు శాంతి లేదు" అని బేలగా అన్నాడు.

"అమ్మకీ, గాలికీ నీళ్ళకీ సంబంధం ఏవిటి ?" గోపీ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"నువ్వెక్కడివాడవయ్యా ! ఎప్పుడూ మటరూసింగ్ పహిల్వాన్ పేరు వినలేదా ? అతడి తల్లి గంగమ్మ తల్లి. ఈ సంగతి ఈ ప్రాంతంలో తెలీని వాళ్ళెవరు ?" అని మటరూ తిరుగు ప్రశ్న వేశాడు.

"మటరూ ఉస్తాద్ !" గోపీ ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో చూశాడు.

"నేను గోపీచంద్‌ని. నువ్వు నన్ను తెలిసే ఉంటావ్" అన్నాడు గోపీ.

"తెలుసు గోపీ ! నాకు అంతా తెలుసు. మీకు జరిగిన అన్యాయం గురించి తెలుసు. ఎవరి బలోద్ధతినీ ఎవరూ భరించలేరు. ఈ ప్రపంచమే అంత. ఈర్ష్యాగ్రస్తమైంది. నీ అన్నగార్ని హత్య చేశారు. నీకు జైలుశిక్ష విధించారు.

నా కథ నీకూ తెలిసే ఉంటుంది. ఏ పనీ చేయలేక వెన్నుపోటు పొడిచి నన్నిలా చేశారు. నాకు శ్వాసకోశ వ్యాధి పట్టుకొంది. శరీరం శిథిలం అయింది" మటరూ భావగాంభీర్య స్వరంతో అన్నాడు.

"మరి నువ్వీ జైలుకి ఎందుకు వచ్చావ్ ?" గోపీ ప్రశ్నించాడు.

మటరూ గలగల నవ్వాడు.

"జమీందార్ల దేష్యం. నా బ్రతుకు నన్ను బ్రతకనివ్వక వాళ్ళు పన్నిన కుట్ర. దొంగతనం కేసు బనాయించి జైలుపాల్జేశారు" అని మటరూ తన కథని వివరించి చెప్పాడు. చివరగా యిలా అన్నాడు.

"గోపీ ! అన్నీ భరించగలను. కాని గంగమ్మ తల్లినే మరచిపోలేక పోతున్నాను. నా కళ్ళముందు ఆ ప్రవాహం కనిపించనంత కాలం నాకేం చేసే ఉత్సాహం రాదు. ఆ గాలిలో ఆ ప్రాణ శక్తి ఉంది. ఆ నీటిలో ఆ చైతన్య శక్తి ఉంది. అమ్మ ఒడిలోంచి వచ్చేసిన నాటినుంచి సరిగా తినలేదు. త్రాగలేదు. ఏది రుచించడం లేదు. మూడేళ్ళు ఎలా ఈ జైలులో గడపగలనా ? అనిపిస్తోంది."

"నేను ఐదేళ్ళు గడపాలి. మగాళ్ళం ఎలాగైనా గడపగలం. నాకు మాత్రం మా వదిన గుర్తుకు వస్తోంది. ఆమె వితంతువై భయంకర విషాదంలో మునిగి ఉంది. నీకు గంగమ్మ తల్లి ధ్యాస. నాకు వదిన ధ్యాస. విచిత్రం చూశావా ? అందరికీ ఏదో ఒక దుఃఖం వెలితి ఉంటూనే ఉంటాయి. అయినా కాలం గడుస్తూనే ఉంటుంది. మనిద్దరం ఒకే ప్రాంతానికి చెందిన వాళ్ళం. ఇక్కడ కలిశాం. కష్టసుఖాలు పరస్పరం చేసుకొని ఊరట చెందుదాం. ఆ రకంగా మనకి రోజులు గడుస్తాయి. నువ్వు పెళ్ళి చేసుకొన్నావని విన్నాను" అన్నాడు గోపీ.

"అవును. ముగ్గురు పిల్లలు. ఎంతో ఆనందంతో గడుస్తున్న జీవితం. ప్రతీ ఏడాది యాభై ఎకరాలలో పంట వేసేవాడిని. ఎంత తిన్నా తరగనంత పంటని గంగమ్మ తల్లి యిచ్చేది. కాని జమీందార్లకి కన్నుకుట్టింది. గంగమ్మ తల్లి గుండెలపై వారు అత్యాచారానికి పాల్పడసాగారు. నాకు మనసొప్పలేదు. మగబిడ్డనై ఉండి తల్లికి జరుగుతున్న అన్యాయాన్ని సహించగలనా ?"

"మటరూ ! నువ్వు సరైన పనే చేశావ్ ! రైతుల జీవితాలని దోపిడీ చేసే జమీందార్లకి గుణపాఠం చెప్పావు. నువ్వుండగా అక్కడ తమ ఆటలు సాగవని

జమీందార్లు నాటకం ఆడారు. కాని అక్కడ నీ వైపున ఉండి ఈ అన్యాయాన్ని ఎదిరించిన వాళ్ళే లేకపోయారా ?"

"కొందరు రైతులు ఒక ఏడాది నా అండగా నిలిచారు. కాని వాళ్ళల్లో పట్టుదల లేదు. అయినా మరికొన్నాళ్ళు నన్ను సమర్థించారు. ఇప్పుడు నా పరోక్షంలో వాళ్ళెలా ఉంటారో, ఎలా ప్రవర్తిస్తారో వేచి చూడాలి" అన్నాడు మటరూ.

"వాళ్లు నీ దగ్గరకి వచ్చినప్పుడు అడిగి చూడు" అని సలహా యిచ్చాడు గోపీచంద్.

xx xx xx

క్రమక్రమంగా గోపీ, మటరూ అనుబంధం బలపడసాగింది. ఇద్దరి స్వభావాలు ఒక్కటే. ఇద్దరి కష్టాలూ, దుఃఖాలూ ఒక్కటే. ఇద్దరి జీవితాలూ ఒక్కలాగే ఉన్నాయి. అందుకే ఇద్దరూ బాగా దగ్గరయారు. ఒకరికొకరు ఆత్మీయులుగా ఉండి కబుర్లు చెప్పుకోవడం, కష్టసుఖాలు చెప్పుకోవడం, యేవేవో వూహలు అల్లుకోవడంతో ఇప్పుడు కాలం బాగానే గడిచిపోతోంది. ఇద్దరూ ఒకే బేరక్‌లో ఉండసాగారు. జైలులో పనులు గురించి ఎవరితోనూ వారికి ఎలాంటి వివాదం లేదు. అధికారులు కూడా వాళ్ళిద్దరి పని గురించి ఎన్నడూ వంకపెట్టలేదు. వాళ్ళెప్పుడూ అధికార్ల చేత మందలింపులు పొందలేదు. మటరూ యొక్క "గంగమ్మ తల్లి" మాట మాత్రం జైలులో ప్రసిద్ధి చెందింది. జైలులో పెద్దలూ, చిన్నలూ ఎవరు ఎప్పుడు అతన్ని కలుసుకొన్నా "జై గంగమ్మ తల్లి" అని నమస్కరించి పలకరిస్తున్నారు. ఆ జైలులో వాళ్ళందరికీ ఒక విచిత్రమైన జీవన సరళి అలవాటై పోయింది. బయటి ప్రపంచంలో వలెనే అక్కడకూడా ఈర్ష్యాద్వేషాలు, ఆనందోద్వేగాలు, పాటలు పల్లవులూ, ఏడ్పులు, నవ్వులూ మామూలే కద. ఎన్నాళ్ళు వాళ్ళు మాత్రం సామూహిక జీవనం నుంచి విడిపడి ఉండగలరు ? వందలాది మధ్య సుఖదుఃఖాలను పంచుకొంటూ గడపడంలోనే మనిషికి ఒక ఆనందం ఉంది కద.

కాలం గడుస్తోంది. జైలు నుంచి విడుదలై వెళ్ళిపోయాక బయట కూడా కలిసి జీవించే అవకాశాలు గురించి యిప్పుడు మటరూ, గోపీ ఆలోచిస్తున్నారు.

విడిపోవాలనే ఆలోచన వచ్చినప్పుడు యిద్దరూ యెంతో వ్యాకులపడేటంత సాన్నిహిత్యం యిద్దరిలో బలపడింది.

"గోపీ ! జైలు నుంచి బయటకు రాగానే నువ్వూ నా దగ్గరికి వచ్చేయకూడదూ ! ఒక్కసారి ఆ గంగమ్మ తల్లి చల్లని దీవెన పొంది, ఆ గాలి పీల్చి, ఆ నీరు త్రాగితే యింక నేను తరిమికొట్టినా నువ్వు అక్కడినుంచి కదలవు. నీలాంటి ఒక మంచి స్నేహితుడి అండ నాకూ కావాలి. అక్కడి జమీందార్లు నాపై కత్తికట్టి ఉన్నారు. దౌర్జన్యం జరపడానికి సంసిద్ధులై ఉన్నారు. నన్ను ఈ జైలుకి పంపించేశాక అక్కడ వాళ్ళేం చేసేశారో నాకు తెలీదు. నేను తిరిగి అక్కడకు వెళ్ళాక వాళ్ళు నాతో మరల సవాలుకొస్తారు. నాపై దాడి చేస్తారు. సంఘర్షణకి పాల్పడతారు. ఇకనుంచి నేను వాళ్ళని అనుక్షణం ప్రతిఘటిస్తుండాలి. అక్కడి రైతులు దెబ్బతినకుండా ఉన్నట్లయితే నాకు తప్పక సహాయపడతారు. గంగమ్మ తల్లి గుండెలపై మేటలు వేసి, అది వ్యూసర క్షేత్రం కారాదని నా ఆశ. వరద వచ్చినప్పుడల్లా అక్కడే అంతా చదునైపోతుంది. వరద తీయగానే ఎవరి ఓపికనుబట్టి వారు విత్తనాలు చల్లుకొని పంటలు వేసేవారు. అక్కడ నేలలో ఏ కొరతా లేదు. అంత సారవంతమైంది అది. అక్కడ అందరికి సమాన అధికారం ఉంది. అయితే జమీందార్లు అక్కడి రైతుల్ని బెదిరించి శిస్తు వసూలు చేసుకోవాలనుకొంటున్నారు. అదే నాకు గిట్టదు. గంగమ్మ తల్లిపై ఎవరికో అధికారం ఏమిటి గోపీ !" అన్నాడు మటరూ.

"ముమ్మాటికీ యిది జమీందార్ల అన్యాయమే. వాళ్ళ ఆట సాగనిస్తే కొన్నాళ్ళయాక గంగమ్మ తల్లి నీళ్ళు గూడ తమవే అని, ఆ నీరు వాడుకొనేవారు పన్ను కట్టాలని వాళ్ళు జులుం చెలాయించవచ్చు," అన్నాడు గోపీ.

"ఆ లంక పొలాలు తమ పొలాలకి సరిహద్దులుగా ఉన్నాయని, అవి తమవే అని, వాటిని కమతాలుగా విడకొట్టుకొని జమీందార్లు పంచుకొనే పన్నాగం పన్నుతున్నారని విన్నాను. నా గొంతులో ప్రాణం ఉండగా అక్కడ ఎవరి అజమాయిషీని అనుమతించే ప్రసక్తి లేదు. గోపీ ! అక్కడ నేను నా బలగాన్ని ఏర్పరుచుకొని వాళ్ళతో పోరాడాలి. నువ్వు నాతో ఉన్నట్లయితే నా బలం రెట్టింపు అవుతుంది" మటరూ అన్నాడు.

"నాకూ యిష్టమే. కాని మా యింట మిగిలినవాడిని నేనొక్కడినే. నాన్నకి కీళ్ళ జబ్బు. ముసలి తల్లి. విధవ అయిన వదిన. వీళ్ళ బరువు బాధ్యతలు నాపై ఉన్నాయి. వాళ్ళని వదిలేసి ఎలా రాగలను చెప్పు ! అవసరమైతే యాభైమందిని నీకు సహాయంగా పంపించగలను. ఇంకా నన్ను చూడాలని నీకు మనసైతే ఏడాదికి నాలుగైదుసార్లు వచ్చి అక్కడ గంగమ్మ తల్లి ఆశీస్సులు పొంది నీ కోరిక తీరుస్తాను. మన యిద్దరి యోగక్షేమాలు ఒకరికొకరికి తెలుస్తూనే ఉంటాయి."

గోపీ మాటలకు మటరూ ఉదాసీనుడవుతాడు. అతనికి గోపీ అంటే పంచప్రాణాలంతగా ఆత్మీయత పెరిగింది. కాని అతడి కుటుంబ పరిస్థితి తెలిసి బలవంతపెట్టలేడు కద.

"పోనీలే గోపీ ! మన స్నేహం మాత్రం ఎప్పుడూ ఉంటుంది. ఈ మిత్రత్వానికి మకిలి పట్టకుండా మనం జాగ్రత్త పడదాం" అనేవాడు మటరూ.

xx xx xx

ఈ మధ్య వాళ్ళని పరామర్శించడానికి ఎవ్వరూ రాలేదు. ఇద్దరికీ బాధ కలిగింది. ఆవేదన కలిగింది. అయితే ఎంతో దూరపు గ్రామాల నుంచి రైతులు కాశీ వచ్చి వెళ్ళడం అంత సులభమైన పనికాదు. మొత్తం జీవిత కాలంలో యెన్నో యేళ్ళకి ఒకసారి వాళ్ళు కాశీ, ప్రయాగ తీర్థయాత్రలు చేస్తారు. చేయగలుగుతారు. ఎప్పుడుపడితే అప్పుడు తిరిగి రావడానికి వాళ్ళకి అవకాశమూ లేదు. తీరికా కాదు. ఒకరోజు పనికి వెళ్ళకపోయినా, పని చేయకపోయినా వాళ్ళకి గడవడం ఎలా ? ఒకవేళ ఆ అవకాశం ఉన్నా పొలాలు కొనుక్కోవాలనుకొంటే ఎక్కువ సంపాదించుకోవాలి కదా ! అందుకే వాళ్ళకి తీరిక అనేది లేదు.

గోపీ బావమరదులు రెండు, మూడు నెలలకి ఒకసారి వచ్చి చూసివెళ్ళేవారు. ఎప్పుడైతే ఒక చెల్లెలు మరణించి, రెండవ తోబుట్టువు వితంతువుగా మిగిలిపోయిందో అప్పటినుంచి వాళ్ళ రాకపోకలు తగ్గిపోయాయి. ఈ విధంగా గోపీని చూడడానికి వచ్చేవారు లేకుండాపోయారు.

ఇక మటరూ సంగతి. అతని అత్తవారు సామాన్య కుటుంబీకులు. జీవితంలో వాళ్ళకి బయటి ప్రపంచాన్ని చూడవలసిన అవసరమే కలగలేదు.

కాని మావగారు, బావమరదులు ధైర్యవంతులే అయినప్పటికి వాళ్ళకే యిబ్బందులు వచ్చాయో ఒక్కసారి కూడా పరామర్శించి పోవడానికి రాలేదు.

వచ్చే నెల చంద్రగ్రహణం. ఆ సమయంలో కాశీకి ఎవరో ఒకరు వచ్చి తమను కలుసుకొంటారని ఇద్దరూ ఆశపడుతున్నారు. ఎందుకంటే గ్రహణ సమయంలో గంగా స్నానం పుణ్యప్రదం కనక పవిత్ర స్నానం చేసి తమ గ్రామస్తులు తమ దగ్గరకు వస్తారని వాళ్ళ ఆత్రుత.

గ్రహణానికి ముందు రోజు ఆదివారం. ఉదయం నుంచే ఖైదీలను చూడడానికి అనుమతించారు. ఏ ఖైదీలను బంధువులు, స్నేహితులు కలుసుకొందుకు వచ్చారో వాళ్ళ పేర్లను వార్డెన్ చదువుతున్నాడు. పేరు పిలిచిన ఖైదీ ముఖం వికసిస్తోంది. పేరు పిలవని ఖైదీ నిర్లిప్తంగా, ఉదాసీనంగా ఉండిపోతున్నాడు. మొత్తం మీద ఆ వాతావరణం అంతా కోలాహలంగా, ఆనంద సందేహంగా ఉంది.

గోపీ, మటరూ తమ 'బేరక్' బయట ఉదాసీనంగా చూస్తూ నిలబడి ఉన్నారు. తమ కోసం ఆ రోజు ఎవరో ఒకరు తప్పక వస్తారని వాళ్ళిద్దరు విశ్వసిస్తున్నారు. కాని పేర్లు పిలవడం పూర్తి అయింది. వాళ్ళ పేర్లు పిలవలేదు. వాళ్ళ కళ్ళల్లో విచారం మౌనంగా స్రవించింది.

"చూశావా ? ఇవాళ కూడా ఎవ్వరూ రాలేదు" అన్నాడు గోపీ.

"అవును. గంగమ్మ తల్లికి కోపం !" అన్నాడు మటరూ.

అతడి మాట పూర్తికాకుండానే వార్డెన్ పరుగున వచ్చి "ఏయ్ ! గంగా పహిల్వాన్ ! రాః నీ కోసం ఎవరో వచ్చారు. పదిహేను నిమిషాలై పోయింది. రా !" అని అరిచాడు.

"నా కోసం ఎవరూ రాలేదా ?" అడిగాడు గోపీ.

"లేదబ్బాయ్ ! వస్తే చెప్పవేవిటి ? ఈ పహిల్వాన్ కోసం వచ్చారు. ఇన్నాళ్ళూ యితగాడికి గంగమ్మ తల్లి తప్ప ఎవ్వరూ లేరనుకొన్నాను" అన్నాడు వార్డెన్.

"నాతోబాటు గోపీ వస్తాడు. అతనూ నాకు బంధువే !" అన్నాడు మటరూ.

"జైలర్ పర్మిషన్ లేకుండా ఎలా ? కుదరదు. నువ్వెళ్ళు టైమైపోతోంది," వార్డెన్ పట్టు వదలలేదు.

"ఏంటి వార్డెనూ ! ఇన్నాళ్ళ తర్వాత ఎవరో ఒకరు చూడడానికి వచ్చారు. మా కోసం ప్రతి నెల ఎవ్వరూ రావడం లేదు కదా ! కొంచెం దయ చూపవయ్యా ! ఈ జైలుకి పెద్ద జైలర్‌వి మా దృష్టిలో నువ్వే కనికరించు" అన్నాడు మటరూ.

"కష్టం నాకు మాట వస్తుంది. అయినా నీ మాట కాదనలేను కదా ! పద. అవతల నీ కోసం వాళ్ళు ఎదురు చూస్తున్నారు" వార్డెన్ తొందర చేశాడు.

"నువ్వెళ్ళు మటరూ ! మా వూరి విశేషాలు కూడ అడుగు. నా కోసం ఎందుకింత ?" గోపీ ఏదో అనబోయాడు.

"ష్ ! నువ్వు మాట్లాడకు" అని మందలించి మటరూ జైలర్ వైపు తిరిగి "వార్డెనయ్యా ! నువ్వు తలచుకొంటే చేయగలవు. నాకు తెలుసు. ఇన్నాళ్ళుగా నిన్ను నేనేమీ అడగలేదు. ఈ ఒక్కసారి నన్ను కనికరించు" అని ప్రాధేయపడుతూ చూసి "గంగమ్మ తల్లి నీకు మగపిల్లాడిని యిస్తుంది" అన్నాడు.

వార్డెన్‌కి పిల్లలు లేరు. మగ పిల్లాడు పుడతాడన్న ఆశచూపి ఖైదీలు అతడిచేత అన్ని రకాల పనులు చేయించుకొంటారు. అది అతడి బలహీనత. ఎవరి నోటిలోంచి భగవంతుడు యే శుభాశీస్సును పలికిస్తాడో అని, ఎవరి వాక్కు ఫలించి తనకు పుత్ర సంతానం కలుగుతుందో అని వార్డెన్ ఎదురు చూస్తుంటాడు. అందుకే 'పుత్ర సంతానం' మాట అన్నవారికి సహాయం చేయకుండా ఉండలేడతను. ఇప్పుడూ అదే పరిస్థితి ఎదురయింది. ధర్మ సంకటంలో పడ్డాడు.

"చూస్తాను. నడు. నన్ను యిరుకున పడేశావ్ !" అన్నాడు అతను.

"ఖచ్చితంగా చెప్తేనే. లేకపోతే నేనూ వెళ్ళను. నన్ను కలుసుకొందుకు వచ్చిన వాళ్ళకి నేను చచ్చిపోయానని చెప్పు. గంగమ్మ తల్లీ !" అన్నాడు మటరూ.

"సరే నాయనా ! నువ్వు పద. సమయం చూసి యితన్నీ పంపిస్తాను. ఏదో ఒకనాడు మీరు నా ఉద్యోగం వూడగొట్టేట్టున్నారు" అని వార్డెన్ అడుగు వేశాడు.

xx xx xx

మటరూ వచ్చి మావగార్కి నమస్కారం చేశాడు. బావమరిదిని కుశలప్రశ్నలతో పలకరించాడు. వాళ్ళు కుశల ప్రశ్నలు వేసుకొంటుండగానే గోపీ అక్కడకు వచ్చేశాడు.

"ఇతను గోపీ. మాణిక్ - గోపీల పేరు విన్నారుగా. హర్దియా గ్రామస్తుడు" అని మటరూ పరిచయం చేశాడు.

"ఆ ! ఆ !" అన్నారు వాళ్ళిద్దరూ.

"ఇక్కడ నాకు మంచి స్నేహితుడు. వీళ్ళ వూరి సంగతులు, యింటి సంగతులు ఏమైనా తెలుసా ?" మటరూ తన కుటుంబం కన్న ముందు గోపీ యింటి సంగతులు అడిగాడు.

"అంతా బాగానే ఉండి ఉంటారు. ఏదైనా ముఖ్యమైన సంఘటన జరిగితే తెలుస్తుందిగా. మీ యిద్దరు కలవడం బాగుంది" అన్నాడు ముసలి మావగారు.

మటరూ బావమరిది వైపు తిరిగి పొలాలు గురించి, రైతులు గురించి, గంగమ్మ తల్లి ప్రవాహం గురించి అడిగాడు. బావమరిది యిలా చెప్పాడు.

"బావా ! ఈ ఏడాది ఫాల్గుణంలో గంగమ్మ తల్లి ప్రవాహం బాగా వెనక్కి తగ్గిపోయింది. మన గుడిసెకన్న అరక్రోసు దూరం వెనక్కి వెళ్ళిపోయింది. మేటకూడా బాగా వేసింది. నువ్వు చూస్తే ఆశ్చర్యపోతావు. ఈ ఏడాది పంట బాగా తగ్గవచ్చు. నేనేం చేయలేకపోయాను. పశ్చిమం వైపున జమీందార్ల పంట బాగానే పండింది. నా గుండె మీద కుంపటి పెట్టినట్లయింది."

"మరి రైతులు !"

"జమీందార్లు వాళ్ళని పిలిపించి చూశారు. తమవైపు తిప్పుకోవా లనుకొన్నారు. నీ భయంచేత వాళ్ళు ఏం చేయలేదు. వాళ్ళు పంటలు కూడా వేసుకోలేదు. ఆ జమీందార్లకి పంటని దక్కనిస్తానా ? ఏం జరుగుతుందో చూస్తావ్‌గా. నీ మీద అన్యాయంగా కేసు బనాయించినందుకు అందరూ కోపగించి ఉన్నారు. నువ్వు జైలు నుంచి రాగానే అక్కడ ఏ జమీందారు బాబు వచ్చి పొలాల వైపు చూస్తాడో చూస్తాం. అన్ని ప్రయత్నాలు జరుగుతున్నాయి" అన్నాడతను.

"శభాష్ ! నువ్వు యింత ఘటికుడవని నాకు తెలుసు," అని అతనిని మటరూ ప్రశంసించాడు.

"గంగ నీరు త్రాగి, ఆ మట్టిలో పెరిగిన ఎవ్వరూ పిరికివాళ్ళు కారు బావా ! నువ్వు వచ్చి చూస్తావుగా," అన్నాడతను. ఆ తర్వాత మటరూ తమ బంధు బాంధవుల పెద్దల యోగక్షేమాలు గురించి అడిగి తెలుసుకొన్నాడు.

"నీ ఆరోగ్యం ఎలా ఉంది ?" బావమరిది అడిగాడు.

"ఫర్వాలేదు. గంగమ్మ తల్లి దయ వలన బాగానే ఉంది. నువ్వు మనవాళ్ళని జాగ్రత్తగా కనిపెట్టి ఉండు. జమీందార్లు రైతుల్ని తమవైపు తిప్పుకోకుండా చూడు. మిగిలిన సంగతుల్ని నేను వచ్చాక చూసుకొందాం. పంటల పరిస్థితి ఏమిటి ?" మటరూ అడిగాడు.

"ఒక తడుపు వేస్తే పంట బాగుంటుంది. మొక్క బాగానే ఉంది. కాని మన చేతి తడుపు చాలదు. గంగమ్మ తల్లి తడపాలి. రెండెకరాలు వేశాను. అయినా ఫర్వాలేదు. లంక పొలాలు గూడా బాగానే ఉన్నాయి. నువ్వేం దిగులుపడకు."

"పిల్లలు ?" అప్పుడడిగాడు మటరూ.

"పెద్దాడు బడికి వెళ్తున్నాడు. వాణ్ణి బాగా చదివించాలి. ఇంట్లో కనీసం ఒక్కడయినా బాగా చదివిన వాడుండాలి. పట్వారీలు, జమీందార్లు చదువుకొని చట్టాలు గురించి తెలుసుకొని మనపై సవారి చేస్తున్నారు. వాటి సంగతి తెలీడానికైనా మనోడు చదవాలి. ఇప్పుడు జమీందార్లు ఒక చట్టం గురించి ఆలోచిస్తున్నారట. అడవిపై అధికారం ఉన్నవారికే లంక భూములపై, బంజర్లపై హక్కు ఉండాలని. అడవిని నరికించేసి వాళ్ళు భూముల్ని దౌర్జన్యంగా అమ్మిస్తున్నారు. నిజంగా వాళ్ళకి ఆ హక్కు ఉందా ? అని అడిగితే నీకు చట్టం ఏం తెలుసురా ? చూద్దువు గాని ఈ పంట ఎలా తీసుకు వెళతారో ? అని బెదిరిస్తున్నారు. బావా ! ఏ హక్కుతో మనం వాళ్ళని ఎదిరించగలం ! ఏం హక్కుతో వీళ్ళీ పంటని తీసుకొని పోతున్నారు ? ఇవన్నీ తెలియాలి. ఎవరైతే కష్టించి పనిచేసి పంట పండిస్తున్నారో వాళ్ళకే హక్కు ఉండాలి భూమిపై, పంటపై. అందుకే మేం అందరం పంట పండించిన వాళ్ళ యిళ్ళకే చేరాలని నిర్ణయించాం."

"నిజం ! నిజం ! తినడానికి, త్రాగడానికి ఏమీ తేలేదా ? ఇక్కడ నాలుక రుచి చచ్చిపోయింది" అన్నాడు మటరూ.

"తెచ్చాం. కాని అక్కడ పోలీసులు తీసుకొన్నారు. వాళ్ళే నీకిస్తారట. మేమే యివ్వాలని అనుకొన్నాం. కాని చట్టం ఒప్పుకోదట. బావా ! వాళ్ళు అవి నీకిస్తారా ? అడిగాడతను.

"ఇస్తారు. సగం తినివేసి సగం యిస్తారు" మటరూ అన్నాడు. "అదే చట్టమా ?" బావమరిది బేలగా అడిగాడు.

"అదీ మన చుట్టమేగా" అని మటరూ మావగారికి చేతులు నివిరి సెలవు తీసుకొన్నాడు. టైమ్ పూర్తి అవుతోంది.

"బావా! ఈసారి వచ్చినప్పుడు గోపీ యింటి సమాచారం తీసుకొనిరా" అన్నాడు మటరూ బావమరిదితో.

"అలాగే !"

"అప్పుడప్పుడు వచ్చి వెళ్తుండండి."

"అలాగే !"

వారికి కేటాయించిన టైమై పోయింది. నవ్వుతూ వచ్చిన వాళ్ళ ముఖాలు యిప్పుడు విషాదంతో నిండి ఉన్నాయి. కొందరు వెక్కిళ్ళతో నిశ్శబ్దిస్తున్నారు. కొందరి కళ్ళ నీళ్ళు ఒత్తుకొంటూ వెళ్ళిపోతున్నారు. వెనక్కి వెనక్కి చూస్తూ కొందరు వెళ్తున్నారు. ఆ దృశ్యమే అంత. ఆ సన్నివేశమే అంత. అంతా గాంభీర్యం. అంతా విషాదం.

## ఎనిమిది

రెండు సంవత్సరాలు గడిచాయి. గోపీ యింటికి బంధు బాంధవులు తీర్థప్రజ వలె రాసాగారు. అతను విడుదలై రావడానికి యింకా రెండు సంవత్సరాకు పైనే పడుతుంది. అయినా అతడు రాగానే పెళ్ళి చేస్తారు. అందుకని ఆడపిల్లల తండ్రులు, తల్లులు వచ్చి ముసలి దంపతుల్ని పరామర్శించి తమ పిల్లనిస్తామని చెప్పి వెళ్తున్నారు. అలా బంధువులూ, అపరిచితులూ వచ్చినప్పుడల్లా ఆ ముసలి దంపతుల ఆనందానికి

హద్దులుండడం లేదు. మరల తమ యింట యౌవ్వన సౌభాగ్య జ్యోతి వెలుగుతుందని వాళ్ళ ఆశ. ఆ ఆశ వెలిగించిన ఆనంద దీపాల కాంతులు వాళ్ళ కళ్ళల్లో కనిపిస్తున్నాయి.

అయితే యిదంతా వదినకి యిష్టంగా లేదు. అయినా అయిష్టంగానే బంధువులకి సంభారాలు సమకూర్చుతోంది. గౌరవ మర్యాదలతో సాగనంపుతోంది. లోలోపల కోపాన్ని దిగమింగుకొంటోంది. ఎర్రబడ్డ కళ్ళని ఒత్తుకొంటోంది. ఎప్పుడైనా ఎవరైనా బంధువులు వస్తారని తెలీగానే అత్తమామలు తొందరచేస్తే ఆమె చికాకుగానే యిలా అంటోంది.

"తొందరేం ఉంది ? వచ్చేవాళ్ళు రాక మానరు. రానివ్వండి చూద్దాం. పెళ్ళి ఎలాగూ చేస్తారు. పెళ్ళి అవక మానదు. అందుకని యిప్పట్నుంచి కాళ్ళూ చేతులూ విరగ్గొట్టుకోవాలా ?"

"వాడికి పెళ్ళి అయ్యే వరకు నీకీ బాధలు తప్పవు" అని అత్తగారు మెటికలు విరిచేది.

ఆ మాట విని ఆమె విలవిలలాడేది. శరీరం అంతా వివశమైన కోపంతో కంపించేది. కాళ్ళ క్రింది నేలను పాతాళానికి తొక్కేద్దామన్నంతగా ఆమె వూగిపోయేది. పెదిమలను పళ్ళతో బలంగా నొక్కిపట్టేది. పిచ్చిదాని వలె తనలోతానుగొణుక్కొనేది.

ఆమె కవళికలను, హావభావాలను, ప్రవర్తనను పసిగట్టిన అత్తగారు "నీ వరసేం బాగాలేదు. దేవుడు మనకెంత రాసి పెడితే అంతే వస్తుంది. నవ్వు రాసి పెట్టుంటే ఆనందం, ఏడుపు రాసి పెట్టుంటే దుఃఖం అనుభవించక తప్పదు. నోటికి లోటు లేకుండా యింత బువ్వ రాసి పడేశాడు. అందుకే నాలుగు ముద్దలు తినగలుగుతున్నావు. అదీ లేకపోతే పస్తులే ! అమ్మా బువ్వ ! అయ్యా బువ్వ అని బిచ్చమే" అని కసిరేది.

"ఎందుకలా కసురుకొంటావ్ ! మా అయ్య, అన్నయ్య లేరనుకొంటున్నావా ? వాళ్ళు రమ్మన్నా వెళ్ళనందుకు ఫలితం యిప్పుడు అనుభవిస్తున్నాను. ఎక్కడ చాకిరీ చేస్తే అక్కడే పట్టెడన్నం దొరుకుతుందిలే" అని ఆమె అత్తగారికి తిరిగి సమాధానం చెప్పేది.

భార్యని కోడలు కించపరచడం, కసురుకోవడం చూసి మావగారు కోపగించేవాడు. అగ్గి మీద గుగ్గిలం వలె చిటచిటలాడేవాడు.

"వెళ్ళవే ! నాలుగు రోజులు పుట్టింట ఉండి వస్తే నీకే తెలుస్తుంది. మా రోజులు బాగుండక నీ చేత చేయించుకొంటున్నాం. అంతమాత్రానికే మాకేదో చేసేస్తున్నట్లు కళ్ళు అంత నెత్తికి ఎక్కాలా ? ఇప్పుడు నీకేం తెలీదే. ముందు ముందు తెలిసొస్తుంది" అని శాపనార్థాలు పెట్టినట్లు మావగారు అరిచేవాడు. అశక్తుడికి అహంకారం ఎక్కువ కద.

ఇంత గొడవ అయాక ఆమె తన గదిలోకి వెళ్ళి ఆత్మాభిమానం పెల్లుబికి రాగా ఏడ్చేది. తన దురదృష్టాన్ని నిందించుకొనేది. ఆమెని ఆ స్థితిలో చూసి ముసలివాళ్ళు "దేవుడా ! రోజూ ఈ గొడవ భరించలేకపోతున్నాం మమ్మల్ని తీసుకు వెళ్ళిపో !" అనేవారు.

ఇరుగు పొరుగు వారికి యిప్పుడు ఆ యింటి గురించిన ఆసక్తి యేమీ లేదు. ఆ యింట గొడవ మామూలైపోయింది. ఎక్కడ యెప్పుడు యేం జరిగినా ఆడవాళ్ళకి తెలిసిపోతుంది. వాళ్ళ ద్వారానే చకచక అది వ్యాపిస్తుంది. కొందరు ముసలివారైన అత్తమామల్ని ఓదార్చేవారు. మరికొందరు కోడలిని సముదాయించేవారు.

"చూడమ్మ ! నీ ఖర్మని నిందించుకొని కష్టాన్ని దిగమింగుకొని నువ్వు కాలక్షేపం చేయాలి. అయ్య, అన్న జన్మతోటివారు కాని కర్మతోటివారు కారు. అత్తవారింటికి వచ్చాక ఆడదాని బ్రతుకు యిక్కడే తెల్లారాలి. శాంతించు. అత్తమావలే నీకు అన్నీను" అని వారామెను సముదాయించేవారు.

తమకేదో చెప్పబోయే ఇరుగు పొరుగు వారితో అత్తమావలు యిలా అనేవారు.

"మేం పుట్టెడు దుఃఖంలో ఉన్నాం. కొడుకు పోయాడు. చిన్నాడు జైలు పాలయాడు. చిన్న కోడలు పోయింది. మాకు అనారోగ్యం. ఆ పనీ యీ పనీ చేసి మూడు ప్రాణాలకి కాస్త వండి పడేయడానికే యిది య్యింత నంగనాచి మాటలు మాట్లాడుతోందే ! మేం మాత్రం ఏం అన్నాం అని. ఎవరైనా వస్తే కాస్త మర్యాదలు చూడమన్నాం. అంతమాత్రానికే పుట్టింటికి పోతానని బెదిరించాలా ? ఎత్తిపొడవాలా ?"

ఇరుగు పొరుగు వారు అటు మాట అటు, ఇటు మాట ఇటు మాట్లాడడం ఆమెకి అలవాటై పోయింది. అంతకన్న వాళ్ళు మాత్రం ఏం చేస్తారు ? అయినా వాళ్ళ ధోరణి ఆమెకి నచ్చేది కాదు. కోపం వచ్చేది. అలా అని నోరు విప్పి మాట్లాడేది కాదు. విని వూరుకొనేది. ఆ మూకల మధ్య నోరు

విప్పే సాహసాన్ని ఆమె చేయలేదు. అది యిష్టం లేదు. మాటలు పెంచి ప్రయోజనం లేదు.

పుట్టింటికి వెళ్ళిపోతానని బెదిరించింది తనే. కాని నిజానికి ఎక్కడికీ వెళ్ళడం ఆమె ఆంతర్యం కాదు. మరిది జైలు నుంచి వచ్చాక అన్ని విషయాలు సర్దుకొంటాయని ఆమె భావిస్తోంది.

అత్తమామలు కూడా కోపంతో కోడలితో దెబ్బలాడినా మళ్ళీ అంతలోనే ఆమెతో కలిసిపోయేవారు. వాదులాడుకొన్న రోజున కోడలు భోజనం చేయకపోతే అత్తగారు మందలించేది. అత్తమామలు ఎంగిలిపడకపోతే ఆమె కోపగించి తినిపించేది. ఓ మాట అన్నా అనుకొన్నా అలాంటి కోడల సేవాభాగ్యం లభించదని వాళ్ళకీ తెలుసు. అంతేకాదు అత్తగారు పోట్లాడితే మావగారు, మావగారు దెబ్బలాడితే అత్తగారు ఆమె పక్షాన నిలిచి సముదాయించేవారు.

గోపీకి సంబంధాలు తెచ్చినవారి గురించి ఆమెకు చెప్పి, అభిప్రాయం అడిగేవారు.

"సంబంధం మంచిదే కాని, మన అంతస్థుకు తగినవాళ్ళు కారు. మొదటి సంబంధం మంచిది చేశారు. ఇప్పుడు పట్టువదల వద్దు" అని ఆమె గడసరిగా అనేది.

కోడలి మాటలు విని మామగారు గర్వపడేవాడు. రాజపుత్ర కుటుంబ మర్యాదకి తగినట్లు ఆమె చెప్పిందని ఆనందించేవాడు.

"నిజమేనమ్మా ! వంద సంబంధాలు కాదన్నాక మీ సంబంధాలు చేశాను. ఏం లాభం ! అంతా తారుమారైంది. నా రామలక్ష్మణుల సీతావూర్మిళల బ్రతుకులు బండలయాయి" అని అంటూనే మావగారి కళ్ళు అశ్రుపూరితాలయేవి.

"ఇప్పుడా దర్పం ఏదీ ! వ్యవసాయం దెబ్బతింది. కుటుంబం చితికి పోయింది. ఇదివరకటి వలె యిప్పుడు మనకి పెద్ద సంబంధాలేం వస్తాయమ్మా !" అని మావగారు శూన్యంగా చూసేవాడు. "అలా పేద ఆలోచన చేయకండి మావగారూ ! ఇప్పుడేమైందని ? మరిది రాగానే అన్నీ సర్దుకొంటాయి. మళ్ళీ యీ యింటికి పూర్వ వైభవం, కళాకాంతీ వస్తాయి. అప్పుడు మన అంతస్థుకు తగిన వాళ్ళెందరో వచ్చి మీ కాళ్ళు పట్టుకోక

మానరు. అంచేత మీరు నిదానించి పనిచేయండి. ఇప్పుడే తొందరేం లేదు," అని ఆమె హితవు చెప్పేది.

"ఔనమ్మా ! వాడు వచ్చాకే అన్నీ, అందుకే ఎవరికీ ఏ మాటా చెప్పడం లేదు. వాగ్దానం చేయడం లేదు. అయినా రేపు మన చేతిలో లేదు కద. ఎవ్వర్నీ తూలనాడటం మంచిది కాదు. అందుకే అందరి బంధుత్వాన్ని మన్నిస్తున్నాను. డబ్బు పోయినా ఈ కుటుంబ గౌరవం యింకా పదిలంగా ఉందమ్మా ! అదే శ్రీరామరక్ష !" అనేవాడు మావగారు.

xx xx xx

అదేరోజు సాయంత్రం ఒక అపరిచితుడు వచ్చి గ్రామంలో ఒకరిద్దరిని "గోపీసింహ్ యిల్లు ఎక్కడ అని" వాకబు చేశాడు.

వేసవి కాలపు సాయంకాలం. చుట్టూ దట్టమైన తోటలు ఉరడడం వలన చీకటిగా అనిపిస్తోంది. రైతులు పొలం పనులు పూర్తి చేసుకొని యిళ్ళకు వచ్చి వేడినీళ్ళ స్నానాలు చేసి తీరికగా అక్కడక్కడ చేరి ఆ రోజు విశేషాలు చెప్పుకొంటున్నారు. దగ్గరలోని చెరువులో కొందరు యింకా స్నానాలు చేస్తూ మెట్లు యెక్కి వస్తూ "రామ్ ! రామ్ !" అనుకొంటున్నారు. తోటల్లోంచి పక్షుల కలకలారావం సందడిగా వినిపిస్తోంది. గాలి లేక ఉక్కగా ఉంది.

ఆ కొత్త వ్యక్తి ప్రశ్న విని అందరి చూపులు అతడివైపు తిరిగాయి. పొట్టిగా ఉన్నవారు మోకాలెత్తి అతడిని చూడసాగారు. "ఎవరు నువ్వు ? ఎవరి యిల్లు గురించి అడుగుతున్నావ్ ?" అన్నారెవరో.

ఆ ఆగంతకుడు లుంగీ కట్టుకొని ఉన్నాడు. లావుగా ఉన్నాడు. ఛాతీమీద దట్టంగా పెరిగిన వెంట్రుకలు కనిపిస్తున్నాయి. మెడలో నలుపు రంగు కండువా వుంది. పెద్ద పెద్ద మీసాలు గెడ్డాన్ని కలిసి ఉన్నాయి. కళ్ళు పెద్దవిగా, తీక్షణంగా ఉన్నాయి. తలపై వెంట్రుకలు మెడ వరకు పెరిగి జడవలె ఉన్నాయి.

ఆ ప్రశ్న వేసిన ఆసామియే గోపీ యిల్లు గుర్తు చెప్పి "ఎక్కడి నుంచి వచ్చావ్ ?" అని అడిగాడు.

"కాశీ నుంచి. అక్కడ జైలులో ఉండేవాడిని" అని ఆ ఆగంతకుడు ముందడుగు వేయబోయాడు. అంతలోనే మరొకరెవరో వెంటనే "గోపీ కూడా కాశీ జైలులోనే ఉన్నాడని విన్నాం. అక్కడ నిన్ను కలిశాడా ?" అని అడిగారు.

ఆగంతకుడు "ఆ ! కలిసే ఉన్నాం. వాళ్ళ యింట్లో అతడి యోగక్షేమం చెబ్దామని వచ్చాను" అన్నాడు.

ఆ మాట విని అందరు అతడి చుట్టూ చేరారు. "అతడి సంగతులు చెప్పు" అని అడిగారు.

"బాగానే ఉన్నాడు. ఆందోళన పడక్కరలేదు" అని ఆ ఆగంతకుడు పరుగున గోపీ యింటివైపు సాగాడు. అతడిని అందరూ వెంబడించారు.

"అతడికి గాయం అయింది. తగ్గిందా ?"

"ఆ !"

"అతడితో వెళ్ళిన వాళ్ళు ఎలా ఉన్నారు ?"

"వాళ్ళు అక్కడ లేరు. సెంట్రల్ జైల్లో ఉన్నారేమో ?"

"మీరిద్దరూ కలిసి ఉండేవారా ?"

"అవును."

"నీదే వూరు ? జైలుకు ఎందుకు వెళ్ళావ్ ?"

"జమీందార్లతో భూమి తగాదా గొడవైంది. ఈ వూరి వాళ్ళకి తెలీదా? మూడున్నర యేళ్ళ క్రితంనాటి మాట. మటరూ పహల్వానని తెలీదా ?"

"మటరూ పహల్వాన్ !" అనీ అందరూ ఆశ్చర్యంగా నిలిచిపోయి "జై గంగమ్మతల్లి !" అన్నారు.

"జై ! గంగమ్మతల్లి !" ఆ ఆగంతకుడు అన్నాడు. "మాకు ఆ సంగతులు అన్నీ తెలుసు. మిమ్మల్ని జైలుకు పంపించారట, ఎన్ని సంవత్సరాలు శిక్ష పడింది ?".

"మూడేళ్ళు".

"గోపీకి ఐదేళ్ళ శిక్ష కదూ ! ఇప్పటికే ఆ యిల్లు నాశనం అయిపోయింది. అతడు వచ్చేటప్పటికి ఏం మిగులుతుందో !".

"ఏవిటీ ?" ఆగంతకుడు ఆశ్చర్యపోయాడు.

"ముసలాళ్ళిద్దరూ మంచానపడ్డారు. గోపీ పెళ్ళాం ఏడాదిలోగానే పోయింది. వాడికి ఎవరూ చెప్పలేదా ?"

"అతడికి తెలిస్తే నాకూ చెప్పేవాడేనే, అయ్యయ్యో !"

"అంతాయింతా కష్టమూ పాపం !" అన్నగారు పోయాడు. భార్య చచ్చిపోయింది. పాపం వదినగారు మాత్రం లాక్కొ వస్తోంది. ఆ యింటి పరిస్థితి తలుచుకుంటే గుండె తరుక్కుపోతుంది. ఎంత కలకలలాడుతూ ఉండేది. ఇప్పుడెంత విలవిలలాడుతుంది ! అంతా విధి."

వాళ్ళందరూ దూరంగా ఉండగానే ఏడుపుధ్వని వినిపించింది. వదినగారు, అత్తగారు ఆగంతకుడు వచ్చిన కబురు విని ఏడుపు లంకించుకున్నారు. పాత సంగతుల్ని తలుచు తలుచుకొని ఏడ్వసాగారు. ఇరుగు పొరుగు స్త్రీలు చేరారు ముసలాయిన గోడ ఆసరాగా లేచి కూర్చున్నాడు. అతడు మౌనంగా విలపిస్తున్నాడు. ఎవరో దీపం వెలిగించి తెచ్చి అక్కడ పెట్టారు. మరొకరు చాప పరిచారు.

ఆ వచ్చినవాడు మటరూసింగ్. అతను ముసలాయిన పాదాలు స్పృశించినపుడు ఆశీర్వదించాడు.

"గోపీ ఎలా వున్నాడు ?" అని అడిగి వలవల ఏడ్చాడు.

చాలామంది గోపీ యోగక్షేమం గురించి వినాలని అక్కడ గుమిగూడి ఉన్నారు. గోపీ హత్యచేసిన పాప భారంతో ఉన్నట్లు మటరూ మౌనంగా ఉన్నాడు. కొందరు కొంతసేపు గుసగుసలాడి మూరు మాట్లాడుకోలేదు. మరి కొందరు ముసలాయన్ని ఓదార్చారు.

"మంచి తీర్థం పుచ్చుకొంటావా ?" ఎవరో మటరూనీ అడిగారు.

"అడుగుతావేమిటి ? ప్రయాణం బడలిక కనిపించడం లేదూ ! చల్లటి మంచినీళ్ళు యివ్వు." మరొకరు మందలింపుగా అన్నారు. మటరూ మాత్రం మౌనంగా ఉన్నాడు. అతడు వూహించినది వేరు. ఇక్కడ పరిస్థితి వేరుగా ఉంది. తాను వచ్చి వాళ్ళ జ్ఞాపకాలను మేల్కొల్పి వ్యథ కలిగించాడనిపించింది.

క్రమంగా అక్కడ వ్యథాపూరిత వాతావరణం సన్నబడింది. మనస్సులు కుదుటపడ్డాయి. అప్పుడు ముసలాయనే అన్నాడు.

"బాబూ ! ముఖం, కాళ్ళు కడుక్కో, మా దుఃఖంలో నీ మర్యాద సంగతే చూడలేదు. ఏమి అనుకోకు."

అప్పుడు మటరూ లేచి వెళ్ళి ఎవరో అందించిన నీటితో కాళ్ళు ముఖం కడుక్కొని వచ్చి విశ్రాంతిగా కూర్చున్నాడు. శర్బత్ త్రాగి తనలో తనే అనుకొంటున్నట్లు మటరూ ఇలా చెప్పాడు.

"కంగారు పడవలసిన పనేంలేదు. గోపీ బాగానే ఉన్నాడు. జైల్లో మేం యిద్దరం ఒకే చోట కలిసి ఉన్నాం. ఎంతగానో కలిసి పోయాం. ఇంటి సంగతులేం తెలీడంలేదని బాధపడేవాడు."

"ఏం చేస్తాం నాయనా ముసలాయన కదలలేడు. ఎవరూ వినేవాళ్ళు కబురు చెప్పేవాళ్ళు లేరు," అంది ముసలావిడ.

"ఉత్తరం ముక్క రాయచ్చుగా," మటరూ అన్నాడు.

"మాకేం తెలుసుబాబు ! జైలుకి ఉత్తరాలు వెళతాయని ?"

"నెలకి ఒకసారి ఉత్తరాలు వస్తాయి."

"అయితే రేపే ఉత్తరం రాయిస్తాను".

"మీరేం శ్రమ పడకండి నేను వ్రాస్తాను. గోపీ భార్యా పోయిన సంగతి కూడా అతనికి తెలీదే !"

"నేనే కబురు చేయవద్దన్నాను. ఈ ఏడుపు కబురు విని ఏడిస్తే వాడినీ అక్కడ వోదార్చేవారెవరనీ ?"

"వాడికి మళ్ళీ అలాంటి పిల్లతో పెళ్ళి చేయగలమా అని బాధపడుతున్నాను అని ముసలాయన అన్నాడు.

"మీరేం బాధపడకండి. గోపీ వివాహం నేను చేస్తాను. అతను నా తమ్ముడి వంటివాడు. అతడూ నన్ను తక్కువగా ఏం చూసేవాడు కాడు. అన్నగారికన్న ఎక్కువగా గౌరవించేవాడు. గోపీ వదిన బాగుందా ? అతను పదే పదే ఆమెనే తలుచుకొనేవాడు," మటరూ అన్నాడు.

తలుపు చాటున నిలచి ఆమె యీ మాటలు అన్నీ వింటున్నదని అక్కడ ఎవరూ గమనించలేదు.

"దాని రాత అలా ఉంది. జీవితాంతం అలాపడి ఉండవలసిందే. ఏంచేస్తాం. దాని తండ్రీ, అన్నలూ కబురేలేదు" అందాముసలావిడ.

"గోపీ మాత్రం ఆమె గురించి చాలా చాలా తలుచుకొనేవాడు. "వదిన ! వదిన !" అని రాత్రింబగళ్ళు పలకరించేవాడు. వాళ్ళిద్దరికీ అంత అనురాగం ఉందా ?"

"అది అంతమంచిది. ఏం చేస్తాం. దానిజన్మ అలా కాలిపోయింది. దాని సేవ మీదనే ఇలా ఉన్నాను. ఏమైనా అది దేవత, ఈ యింటికి పెద్ద కోడలు, ఈ యింటి యజమానురాలు అదే !" అన్నాడు ముసలాయన.

ముసలామెకి ఈ ప్రశంసావాక్యాలు నచ్చలేదు. ఇక ఆ మాట మార్చాలని "అబ్బాయీ ! ఏం తింటావ్ ?" అని అడిగింది.

## తొమ్మిది

స్వచ్ఛందత, సాహసం, తీర ప్రాంత రైతుల నైసర్గిక లక్షణం, క్రోసుల దూరం విస్తరించిన మైదానాలు, డొంకలు, తుప్పలు, అడవి, నదీప్రవాహం - వీటిలో చిన్నపటి నుంచి వారికి అనుబంధం పెనవేసుకొని ఉంటుంది. అడవిలో నిర్భయంగా పశువుల్ని మేపడం, చితుకులు ఏరుకోవడం, నదిలో ఈదడం, పడవలు నడపడం, గోతిలో దిగి కుస్తీలు పట్టడం, గేదెపాలు త్రాగడంతో వారి బాల్యం, జీవితం ప్రారంభం అవుతాయి. మైదానాల విశాలత్వం, నదీ ప్రవాహపు స్వేచ్ఛ, కండలు తిరిగిన శరీరపు సాహసం వారికి సహజంగానే సంక్రమించి వస్తాయి. జమీందారుల నివాసాలు దూరంగా ఉంటాయి. అయినా వారక్కడ నుంచి వీరిపై జులుం చెలాయించాలని చూస్తుంటారు. దగ్గరగా ఉన్న రైతులని తమకు బానిసలుగా చేసేసుకొంటారు. కాని తీర ప్రాంత రైతులంటే మాత్రం భయపడుతుంటారు. వాళ్ళ ధైర్యం ముందు, సాహసం ముందు స్వేచ్ఛా ప్రియత్వంముందు, బలం ముందు తాము నెగ్గుకు రాలేమని వాళ్ళకి తెలుసు. అందుకే వాళ్ళతో జమిందార్లు సయోధ్యగా ఉంటారు. మగతా సరిగా యిచ్చినా యివ్వకపోయినా, సగమే చెల్లించినా, పావు యిచ్చినా మిన్నకుండిపోతారు తప్ప వివాదానికి దిగే సాహసం చేయరు. పోలీసులు కూడా వారి జోలికి నేరుగా వచ్చే ధైర్యం చేయరు. పోలీసులపై జమిందార్లు ఒత్తిడి తెచ్చినప్పుడు లంచాలుతోసు, ఒకటి రెండు తప్పుడు

కేసులు బనాయించి రైతుల్ని యిబ్బంది పెట్టి పోలీసులు తమ ఉనికిని, అధికారాన్ని ఒక్కోసారి చూపిస్తుంటారు.

ఈ రైతులు ఎంత స్వేచ్ఛా ప్రియులో, ఎంత సాహసికులో, ఎంత బలవంతులో అంతటి మూర్ఖులు. చీటికీ మాటికీ కర్ర లెత్తడం, కొట్టుకోవడం, పంటల్ని తగలబెట్టుకోవడం, దోపిడీలు చేస్తుండడం వాళ్ళకి పరిపాటి. దూరదృష్టితో ఆలోచించి యేపని చేయడం వాళ్ళకి తెలీదు. దేనినైనా సరే దండమే పరిష్కారం అని వాళ్ళ నమ్మకం. ఒకడు ముందు పరుగెడితే అందరూ అతడిని అనుసరించి గుర్రాలవలె లగెత్తుతారు. ఒకడు ఒకమాట అంటే అందరూ ఆ మాటనే పట్టుకొని వేలాడుతారు. ఎవరూ యిక ఆలోచించరు. పరస్పరం చర్చించుకోరు. తర్కం చేయరు. ఒకమాట కోసం ప్రాణాలయినా ఒడ్డుతారు కాని వెనకంజవేయరు. ఏ మాట పట్టింపు వచ్చినా వాళ్ళకి కొట్టుకోవడం, దెబ్బలాడడం, ప్రాణాలు తీయడం, తీసుకోవడం తప్ప మరేమీ తెలీదు.

ఎవరైతే బలవంతుడో, నదిని ఏకబిగిన ఈదగలడో, కర్రసాము అద్భుతంగా చేయగలడో, జమిందార్లని సవాలు చేయగలడో, వాళ్ళ మెప్పుపొందగలడో అటువంటి వాడే వాళ్ళకి నాయకుడు.

ఈ రైతులకి వ్యవసాయ క్షేత్రాలంటే ప్రాణం. వాళ్ళ బలహీనత అదే. పొలం కోసం, పశువులకోసం వాళ్ళు ప్రాణాలొడ్డుతారు. ఎంత ధరకైనా సరే పొలం తీసుకొనేందుకు సిద్ధపడతారు. ఈ బలహీనతని ఆసరాగా తీసుకొని జమీందార్లు వాళ్ళని మోసం చేస్తుంటారు, లాభం పొందుతూంటారు. వాళ్ళని మూర్ఖుల్ని చేసి ఆడిస్తుంటారు. పశువుల్ని కొనాలంటే అందరూ కలిసి వెళతారు. ధర ఎంత చెపితే అంతా పెట్టి కొంటారు. అమ్మేవాడు ఒప్పుకొంటే సరే లేకుంటే రాత్రికి రాత్రి అతడినీ అడవిలో మాయంచేసి తమ సాహసాన్ని ప్రదర్శిస్తారు. అక్కడ యెవ్వరూ ఈ పనిని తప్పుగా, నేరంగా భావించనే భావించరు.

నదీ తీరాన ఉన్న బంజరు భూముల సాగు గురించి మొదటగా మటరూసింగ్ చెప్పినప్పుడు వాళ్ళేం మాట్లాడలేదు. అతను జైలుకి వెళ్ళాక, జమీందార్లు వాళ్ళకి ఆశలు చూపి వ్యవసాయం చేయమని అడిగినా ఏమీ కదలలేదు. కాని ఇప్పుడు వారిలో చైతన్యం వచ్చింది. మటరూ జైలు నుంచి వచ్చి అతడేం చెప్తే అదే చేయాలన్న సంకల్పం వారిలో కలిగింది.

ఫ్రూజన్‌లాంటివారు స్వయంగా అక్కడ వ్యవసాయం మొదలుపెడదాం అనుకొన్నారు. అయితే ఆ నదీ తీరాన ఒంటరిగా ఉండి, గుడిసె వేసుకొని, వ్యవసాయం మొదలు పెట్టి జమీందార్లతో పోరాటం చేసే సాహసం, బలం లేనందున ఇరవై, ముప్ఫై మంది రైతుల సాయం అడిగారు. వాళ్ళు ఎవ్వరు చెప్పినా వినరు. పైగా అప్పటికే వారు ఒక తీర్మానం చేసుకొని ఉన్నారు. అదేమంటే మటరూ వచ్చే వరకు ఏం చేయరాదని, ఆ మాటే ఫ్రూజన్‌కి నిష్కర్షగా చెప్పేశారు.

చివరకు జమీందార్లు అక్కడ తమ ఆధిపత్యాన్ని స్థాపించుకొనే ప్రయత్నం ప్రారంభించారు. అది పెద్ద పులి నోటిలో చేయిపెట్టడం వంటిది. సాధారణంగా వాళ్ళెప్పుడూ అలా చేయరు. కాని యిప్పుడు పరిస్థితి వేరుగా ఉంది. ఏమి చేయని పక్షంలో ఆ భూములపై వారి హక్కులు పోతాయి. కొంత కిరికిరి జరుగుతుంది. అందుకని వాళ్ళక్కడ గుడిసెలు వేయించారు. తమ మనుష్యుల్ని పంపించి అక్కడ దున్నించి విత్తనాలు జల్లించారు. కొందరు బలవంతుల్ని రక్షణగా ఉంచారు. అయినా వాళ్ళకు తెలుసు అక్కడి కౌలు రైతులతో వ్యవహారం కుదరనంత వరకు పంట దక్కించుకోవడం కష్టమని. అందుకని రక్షకులుగా అక్కడి వారినే ఉంచాలని ప్రయత్నించారు కాని ఎవ్వరూ రాలేదు. రానన్నారు. కాపలాదారులకోసమే బోలెడు ఖర్చు పెట్టవలసి వచ్చింది. పంట వచ్చి యింటికి తెచ్చుకొన్నా అది ఆ ఖర్చుకు తక్కువే వుంటుంది. అయినా ఆ పొలాలపై హక్కు భుక్తానికై జమిందార్లు యీ పని చేశారు. ఖర్చు పెట్టారు. ఆ మాత్రం హడావుడి చేయకపోతే జమిందారీ దర్పం ఏం ఉంటుంది ?

విత్తనాలు మొలచాయి, మొక్కలు పెరిగాయి పంట వచ్చింది. చూస్తుండగానే గుండెల ఎత్తునకు ఆ సస్యం ఎదిగి కన్నుల పండుగ చేసింది. అది చూసి రైతుల గుండెలపై పాములూ, జెర్రెలూ పాకినంతపనయింది. తమ పొలాలపై యెవరో ఆక్రమణ చెలాయిస్తున్నారని, తమ యిళ్ళ గాదెలలోంచి ధాన్యాన్ని ఎవరో దొంగలించుకొనిపోతున్నారని మళ్ళీ బాధపడ్డారు. వివశులై అలా చూస్తుండిపోయారు.

ఈ అవకాశాన్ని ఫ్రూజన్ ఉపయోగించుకోవాలనుకొన్నాడు. మటరూతో సంబంధం వలన అతనికి అక్కడి రైతాంగంతో పరిచయాలు ఉన్నాయి. వాళ్ళ మనో భావాలు గమనించీ ఒకసారి వాళ్ళందరినీ కలిసి యిలా చెప్పాడు.

"మిత్రులారా ! మనందరం చూస్తుండగానే మన గంగమ్మతల్లి ఒడిలో పంటలు పండిస్తున్నారు. ఒకసారి యీ పంట ఆ జమీందార్ల యిళ్ళకు వెళ్ళినట్లయితే వాళ్ళకళ్ళు నెత్తికి ఎక్కుతాయి. మటరూ రావడానికి యింకా చాలా ఏళ్ళు పడుతుంది. మనం పూరుకొంటే అప్పటికి ఈ భూమి చేతులు మారుతుంది. మనిషి రక్తం రుచిచేసిన మొసళ్ళవలె జమీందార్లు ప్రవర్తిస్తారు. అప్పుడు "మటరూ ! మటరూ !" అని మొత్తుకొన్నా చేయగలిగింది యేమీ లేదు. చేయిదాటి పోయిన తర్వాత వచ్చి మటరూ మాత్రం ఏం చేయగలడు ? అంచేత మేల్కొనండి, పంట జమీందార్ల యిళ్ళకి చేరకుండా అడ్డుకొందాం, మీరాపని చేయగలరు.

అలాంటి ఆలోచన రైతులకే ఉంది. అది పూజన్ నోటిలోంచి వెలువడింది. యువకులు చాలామంది "అతని వెంట ఉంటామ"ని హామీ ఇచ్చారు. అందుకు తగిన యేర్పాట్లు జరిగాయి. పంటకోతకు వచ్చింది. ఒకనాటి రాత్రి, వారందరూ నావలలో వెళ్ళి లంకల మీది పంట కోసుకొని ఒడ్డుకు చేర్చేశారు. రక్షణగా ఉన్న కాపలాదారులు ఏం చేయలేక చూస్తుండిపోయారు. జమీందార్లకోసం ప్రాణాలర్పించే మూర్ఖులు కారువారు.

మరునాడు పెద్దగొడవే జరిగింది. ముఖియా (గ్రామపెద్ద) దగ్గర జనం చేరారు. పోలీసులూ వచ్చారు. ఎవ్వరూ ఏం చెప్పలేదు. ఎవరికి మాత్రం ఏం తెలుసు ? ఆ నదీ తీరం వెంట బోలెడు పల్లెలున్నాయి ఎందరో జనం ఉన్నారు. ఎవరు రాత్రి పూట పంటకోసుకొని పోయారో ఎలా చెప్పగలరు ? ఎలా నిర్ధారించగలరు ? పైగా నదీ తీరం వెంట చాలా చోట్ల పంట తాలూకు గుర్తులు కనిపించాయి. అంతటితో ఆ గొడవ నిలిచిపోయింది. "ఎక్కడి నుంచో ఎవరో వచ్చి పంటని కోసుకొనిపోయారనే" వార్త మాత్రం వ్యాపించింది.

ఈ పరిణామంతో యువకుల ఉత్సాహం పెరిగింది. వాళ్ళ ధైర్యం యినుమడించింది. అడవి భూములలోకూడా వాళ్ళు ప్రతాపం చూపించ సాగారు. కొన్నిచోట్ల దహనకాండ సాగించారు.

ఈ సంగతులు తెలిసి జమిందార్లు నిప్పు తొక్కిన కోతులవలే గంతులు వేయసాగారు. ఈ అవమానాన్ని దుఃఖాన్ని వారు భరించలేకపోతున్నారు. ఒకసారి పోలీసుల చేతులు తడిపి నష్టపోయారు. ఇప్పుడు మళ్ళీ అదే పని చేయడానికి వాళ్ళకి మనస్కరించడం లేదు. వాళ్ళ పరిస్థితి అడకత్తెరలో పోక చెక్కవలె ఉంది.

ఫ్యూజన్ పలుకుబడి ఆ రైతాంగంలో పెరిగింది. అతనంటే వాళ్ళకి గౌరవం పెరిగింది. కాని అతను కూడా అంతకన్న ఏం చేయలేకపోయాడు. జమీందార్లు మౌనంగా ఉండిపోయారు. రెచ్చిపోయి చేయగలగేదీ, సాధించ గలిగేదీ ఏమీ లేదని వాళ్ళు భావించారు. ఈసారికి శాంతంగా ఉంటే రైతులూ శాంతించగలరని, ఆ తర్వాత ఏదైనా రాజీ చేసుకోవచ్చునని జమీందార్లు అనుకొన్నారు. వాళ్ళేమీ ప్రతిచర్య పాల్పడక పోవడంతో రైతులు కూడా మిన్నకుండి పోయారు. మటరూ వచ్చాక భవిష్యత్ కార్యక్రమం గురించి నిర్ణయించుకొనవచ్చునని వాళ్ళు నిరీక్షించసాగారు. ఇక ఆ సంవత్సరం తర్వాత అక్కడ చెప్పుకోదగిన సంఘటనలు ఏం జరగలేదు.

xx xx xx

గోపి యింటి దగ్గర మటరూ కలతగానే గడిపాడు. తర్వాత రైలుకి వచ్చాడు. ఆ వూరి నుంచి మటరూ గ్రామం పది క్రోసులుంటుంది. రైలులో కూర్చున్నాడన్నమాటే కాని మనసంతా గంగమ్మతల్లి మీద ఉంది. రైలు దిగి నడక ప్రారంభించాడు. ఎన్ని సంవత్సరాలయింది ఆ అమ్మ ఒడిలో పడుకొని, ఆ నీరు త్రాగి, ఆ గాలి పీల్చి ! మటరూ గంగమ్మ దగ్గరకు వేగంగా అడుగులు వేస్తున్నాడు. ఇదంతా అతని వూహ మాత్రమే !

గోపి ఇంటి దగ్గర పరిస్థితి అతన్ని కలిచివేసింది. ముసలివాళ్ళ పరిస్థితి మరీ కృంగదీసింది. ఆ రాత్రికి రాత్రే వెళ్ళిపోదాం అనుకొన్నాడు. కాని దీనుల్ని, దుఃఖితుల్ని విడిచిరావడం అతనికి అంత సులభంకాదు. ఆ రాత్రి భోజనం చేసి అక్కడే పడుకొన్నాడు. నిద్రరావడం లేదు. గోపి క్షేమ సమాచారం చెప్పేసి, వాళ్ళ యోగక్షేమాలు తెలుసుకొని వెళదాం అనుకొన్న మటరూ మనస్కరించక రాత్రి ఉండిపోయాడు. మంచం మీద వాలాడన్నమాటేకాని కంటికి కునుకు రావడంలేదు.

గంగమ్మతల్లి తనని పిలుస్తున్న అనుభూతి. "రా ! రా ! ఎన్ని సంవత్సరాలయింది నన్ను వదిలి రా !" అని అమ్మ పిలుస్తోంది.

ఆ నది, ఆ పొలాలు, ఆ పైరుగాలి, ఆ మట్టి కణాలు, ఆ మొక్కలు, ఆ చెట్లు అన్నీ ఆహ్వానిస్తాయి.

"ఇంత దగ్గరకు వచ్చి ఆగిపోయావేం ! ఎన్నాళ్ళు మమ్మల్ని వదిలి ఉంటావ్ ! రా ! మా మధ్యకు రా ! మా కౌగిలిలోకి రా !" అని ఆ ప్రకృతి

అతన్ని ఎలుగెత్తి, చేతులెత్తి పిలుస్తోంది. ఆ పిలుపు అతని చెవుల్లో గింగురు మంటుంది. శరీరం మీది ప్రతి రోమం గగుర్పాటుకు లోనవుతుంది.

మటరూ వ్యాకులుడై లేచి కూర్చున్నాడు. మూసిన కళ్ళు తెరిచి పెద్దవి చేసి చుట్టూచూశాడు. ఆ పిలుపు దగ్గర నుంచి రాలేదని అర్థం అయింది. గంగమ్మతల్లి తన దగ్గరకు నడిచి రాలేదు కద.

మటరూ మంచందిగి నిలబడ్డాడు. వేగంగా నడక ప్రారంభించాడు. చుట్టూ నిలాంత నిశ్శబ్దం పేరుకొని ఉంది. భయపడినట్లు గాలి కూడా కదలడం లేదు. ఏమీ కనిపించడంలేదు. అయినా గంగమ్మతల్లి దగ్గరగా ఎలా వెళ్ళాలో అతనికి బాగా తెలుసు. వడిచి వెళ్ళడం అతనికి కష్టం కాదు.

కోసిన పంట చేలల్లోంచి మటరూ వేగంగా వెళ్ళిపోతున్నాడు. క్షణకాలపు ఆలస్యాన్ని కూడా అతను భరించలేక పోతున్నాడు. దారిలో ఏం ఉన్నదీ ఏమో కనిపించకపోయినా, కాళ్ళకు రాయీ, రప్పా తగిలినా లక్ష్యపెట్టక అతను పరుగున వెళ్తున్నాడు. అతని కళ్ళముందు గంగమ్మ ధార కనిపిస్తోంది. చెవులలో "రా ! బిడ్డ రా !" అన్న గంగమ్మతల్లి పిలుపు వినిపిస్తోంది. "వచ్చానమ్మ !" అన్న తన సమాధానం తలపుకు వస్తోంది.

నిద్రమత్తు ఆవరించిన భూమి బరువుగా శ్వాసిస్తున్నట్లుంది. చీకటి శయ్యపై గాలి నిద్ర పోయింది. పగటి ఎండ వేడికి సొమ్మసిల్లినట్లు రాత్రి నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడా అలికిడి లేని నిశ్శబ్దం ఆవరించి ఉంది. మాతృ వాత్సల్య స్పర్శకై మటరూ నిర్విరామంగా పరుగు పెడుతున్నాడు. అతడి ఒంటి నుంచి చెమట కారుతోంది. తన ఒడిలోనికి తీసుకొనేందుకు కెరటాలు చేతులు చాస్తున్న గంగమ్మతల్లి మాత్రం అతనికి కనిపిస్తూనే ఉంది. అతడిలో తాదాత్మ్యతని చూసి ఆశ్చర్యపోయినట్లు ఆకాశంలో నక్షత్రాలు అలా నిలిచి పోయాయి. మటరూ మాత్రం యివేమీ పట్టించుకోక తదేక ధ్యాసలో పరుగెడుతున్నాడు.

గంగమ్మతల్లి ఒడిని చేరాలన్న తహతహతో అతను పరుగుపెడుతూనే ఉన్నాడు. పరుగిడుతూనే ఉన్నాడు.

ఇది లంక గాలుల పరిమళం, ఇది లంక భూముల సువాసన. ఇది గంగమ్మతల్లి వాత్సల్య పరిమళం. మటరూ ప్రాణాలు ఉన్మత్తాలయాయి. ప్రతీ రోమం ఉత్ఫుల్లం అయింది. అతడి పాదాలలో విద్యుత్ ప్రవహిస్తోంది. అతడు తుఫానువలె "అమ్మా ! అమ్మా !" అని అరుస్తున్నాడు. అతని

పిలుపునకు పరవశించినట్లు" నాయనా ! నాయనా ! వచ్చావా !" అని కెరటాల ప్రతిధ్వని చేస్తున్నాయి. ప్రతిస్పందనగా కదులుతున్నాయి.

దశదిశలూ ప్రతి ధ్వనిస్తున్నాయి.

"నాయనా ! నాయనా !"

భూమి పిలుస్తోంది.

"బిడ్డా ! బిడ్డా!"

కోట్లమంది తల్లులూ, పిల్లలూ పరస్పరం పిలుచుకొంటున్నట్లు భూమ్యాకాశాలు ప్రతిధ్వనిస్తున్నాయి.

ఆకలివేసిన బిడ్డవలె మటరూ ఆబుగా గంగమ్మతల్లి ఒడిలోకి దూకాడు. బిడ్డకి సర్వ స్పర్శలూ చేసే తల్లివలె గంగమ్మతల్లి అతడిని ఒడలంతా తడిమింది. అది కెరటాల ప్రవాహాల కలకలధ్వని కాదు. బిడ్డకి తల్లి పెట్టే ముద్దుల శబ్దం. దిశలు స్తంభించాయి. గాలి గుసగుసలాడింది. మట్టి ముసిగా నవ్వింది.

"మా బిడ్డ వచ్చేశాడు, మా బిడ్డ వచ్చేశాడు." అన్ని అవన్నీ ఆనందాతిశయంతో చెప్పుకొంటున్నాయి.

## పది

అది యెంత అసంభవమైన విషయమో ఆమెకు తెలుసు. అయినా ఆ వూహకి ఆమె మనసులో పెంచి, పోషించుకొంటోంది. మనిషి జీవించడానికి గాలి, నీరు ఎంత అవసరమో, వూహలు కూడా అంతే అవసరం. హస్తవాధారం లేనప్పుడు వూహలలోనే, అవాస్తవమైన ఆలోచనలలోనే మనిషి బ్రతుకుతాడు. కల్పనలు, స్వప్నాలు దేనిమీదా ఆధారపడి లేవని తెలిసి కూడా మనిషి వాటినే ఆశ్రయిస్తాడు. వాటి నుంచే శక్తి నిగ్రహించి జీవిత యాత్ర సాగిస్తుంటాడు. నిరాధార స్వప్నాలు, అసాధారణ కల్పనలు కూడా యేదో ఒకనాడు నిజం అవుతాయేమో ఎవరికెరుక ?

ఎటువంటి ఆధారమూ లేనప్పుడు మనిషి యిటువంటి ఆశనే ఆశ్రయిస్తాడు. అది మానవ స్వభావం, జీవించాలన్న పేరాశ మాత్రమే/

యిందుకు ప్రోత్సహిస్తుంది. ఆమె అటువంటి వివశ జీవితాన్నే గడుపుతున్నది కద అందుకని ఆమె అలాంటి కాల్పనిక ప్రపంచాన్ని ఏర్పరచుకోవడంలో ఆశ్చర్యం ఏం ఉంది.

జైలులో ఉన్న గోపీ కూడా తన గురించి తలుచుకొంటున్నాడని మటరూ చెప్పడం విన్నప్పటి నుంచి ఆమెలోని ఆ అనురాగ బీజాలకు అమృత సేచనం జరిగి అవి అంకురించసాగాయి. ఆ మాటల స్మరణ ఆమె జీవన సంగీతాన్ని శ్రుతి చేస్తున్నాయి. "గోపీకి ఆమె ఆలోచనే ఎక్కువగా ఉండేది" అనే మాటలే ఆమె పెదాలపై నర్తిస్తున్నాయి. "రాత్రింబవళ్ళు వదినా ! వదినా !" అని కలవరిస్తున్నాడు అనే మాటలే ఆమె చెవుల్లో వినిపిస్తున్నాయి. "వాళ్ళిద్దరి ప్రేమ ఎక్కువే" అనే అక్షరాలే ఆమెకి గిలిగింతలు పెడుతున్నాయి.

ఆమె మనస్సుకు అమృత సరస్సులో స్నానం చేసినట్లుంది. ఏదో లోకంలో ఉన్నట్లు ఉంటుంది. ఆ భావుక లోకంలోంచే మాట్లాడుతున్నట్లు ఆమె "అవును ప్రేమ ఉంది. ఓ ! పరదేశీ ! నా ప్రేమ గురించి నువ్వతనికి ఉత్తరం వ్రాయి. నా ప్రాణాలు కూడా రాత్రింబవళ్ళు అతని గురించే ఆక్రోశిస్తున్నాయని వ్రాయి. అవును - పరదేశీ ! మా యిద్దరి మధ్య బోలెడు ప్రేమ ఉంది. బోలెడు" అని అనుకొనేది.

ఈ మంత్ర జపం ఆమెని యెంతగానో మార్చివేసింది. ఆ నిర్లిప్తత, చికాకు, నైరాశ్యం, ఏవగింపు, అన్ని మాయం అయాయి. ఇప్పుడు ఆమెలో కొంచెం ఉత్సాహం వచ్చినట్లనిపిస్తోంది. తప్పుచేసినా కొంత జీవకళ, తాదాత్మ్యత కనిపిస్తున్నాయి. పూజా, పారాయణాల పరమార్థం కొంచెం అనుభూతికి వస్తోంది. అత్తమామల సేవాశుశ్రూషలలో కొంత ఫలతీర్థం కలిపిస్తోంది. వ్యర్థ జీవితంలో కొంత సార్థకత సాక్షాత్కరిస్తోంది. "తన గురించి రాత్రింబవళ్ళు ఆలోచించే వాళ్ళు ఎవరో ఉన్నారు. ఎవరో ఉన్నారు" ఈ ఆలోచన ఆమెలో యింత మార్పును తెచ్చింది.

ఇంటిలో యిప్పుడు కయ్యాలూ, కలహాలు లేవు. అన్నీ సక్రమంగా జరిగిపోతున్నాయి. మామగారికి ఫిర్యాదులేం లేవు. అత్తగారికి అలుకలు లేవు. చక్కగా వండి యిద్దరికీ ఆప్యాయంగా పెడుతుంది. వాళ్ళేం చెప్పినా బుద్ధిగా విని, చకచక చేసేస్తోంది. ఆమె సేవలకు వాళ్ళిద్దరూ ఎప్పుడూ బానిసలే. కోడలి ఆసరా లేకపోతే తాము ఆ మరునాడే మరణించి ఉండేవారమని వాళ్ళు

అనుకొంటారు. ఎంతటి రోగం వచ్చినా కోడలి సహనశీలత తమని రక్షిస్తుందనే ధీమా వాళ్ళకి వచ్చేసింది. అందుకే వినిపించీ వినిపించనట్లు ఆశీర్వదించేవారు.

"ఎందుకు నాలాంటి దురదృష్టవంతురాలిని యిలా దీవిస్తారు ?" అని ఆమె అడిగేది. అటువంటప్పుడు వాళ్ళు కళ్ళలో నీరు పొంగి వచ్చేది. వ్యాకుల స్వరంతో యిలా అనేవారు. "నాకు తెల్సమ్మా ! వూసర క్షేత్రంలో విత్తనాలు వేయడమే ఇది అని. నువ్వు సుఖంగా ఉండాలనే అనుకొంటామమ్మా !"

కరుణహాసం పెదాలపై సందడించగా ఆమె "నా సుఖ సంతోషాలు ఆయనతోనే పోయాయి" అని కన్నీళ్ళు వదిలేది.

"నిజమేనమ్మా ! స్త్రీ సుఖం పురుషుడితోనే ముడిపడి ఉంది" అనేవాడు ముసలి మామగారు.

"నేను త్వరగా యీ జీవన యాత్ర ముగించుకొని యిహలోక బంధాల నుంచి విముక్తిని పొందాలని ఆశీర్వదించండి" అనేది ఆమె.

"అలా అనకమ్మా ! ఈ ముసలవాళ్ళని వదిలి నువ్వు వెళ్ళి పోవాలి" అని ముసలాయన బేలగా అనేవాడు.

ఆమె తలపైకెత్తి కళ్ళనీళ్ళు చీరకొంగుతో తుడుచుకొని "మరిదికి భార్య వస్తుంది కదా, ఆమె మీకేం తక్కువ చేస్తుందని" అనేది.

"ఎవరికి తెల్సమ్మా ! ఎలాంటి పిల్ల వస్తుందో ! ఇదివరకటి జన్మలో నువ్వునా కూతురివై ఉంటావు. ఎంతటి గంగాస్నాన పుణ్యం చేసుకొన్నానో యీ జన్మలో నిన్ను కోడలగా పొందాను. ఎవరి పిల్లో అయితే యింత సేవ చేస్తుందామ్మా ! నాయీ తృప్తిని తుడిచేయకమ్మా !" అనేవాడు ముసలాయన.

"కాని ఈ దురదృష్ట జీవితం ఎంత త్వరగా ముగిస్తే అంత హాయి అనిపిస్తోంది" అనేది ఆమె.

"చావు పుట్టుకలు మన చేతిలో లేవమ్మా ! నా అదృష్టం నిన్ను బ్రతికిస్తోందనిపిస్తోంది. ఇలాంటి కదలలేని జబ్బుతో నన్ను శపించిన ఆ దేవుడే నిన్ను వరంగా ప్రసాదించాడు. ఆ దేవుడి సంకల్పం ఏవిటో ఎవరికి తెల్సమ్మా ! ఇదెందుకు ప్రాప్తించిందో నా సేవ కోసమే నువ్వు పుట్టావనిపిస్తుంది. అలా అనుకొన్నప్పుడు నాకు గోపీ గురించిన ధ్యాసే రాదు. మటరూ చెప్పాడుగా నువ్వంటే గోపీకి ఎంతో అభిమానం అని. వాడుండగా నీకెలాంటి లోటూ, ఆపదా రానివ్వడు" అనేవాడు ముసలాయన ఆమెని సముదాయిస్తూ.

"ఎవరి యోగం యెలా వుందో ఎవరికి తెలుసు. గోపీ అంటే నాకూ యిష్టమే అతణ్ణి ఒక్కసారి చూసి చచ్చిపోతా. అతని క్రొత్త భార్య ఎలా ఉంటుందో, నాతో యెలా వ్యవహరిస్తుందో యివన్నీ నేను భరించలేను మామగారు ! అతను ఎవరివాడో అయాక నేనెక్కడ ఉండగలను" ఆమె ఏడుస్తూ అనేది.

"ఆ మాటలేవిటమ్మా ! నువ్వియింటి పెద్ద కోడలవి. ఈ యింటి యజమానురాలివి. నీ స్థానం అది. నువ్వంత ఎత్తుని ఉంటావ్ !" అనేవాడు మామగారు సముదాయిస్తూనే.

"కొత్తకోడలు మరిదిని మంత్రిస్తుంది. ఆమె మొహంలో మన స్థానాలు మారిపోతాయి. నేను ఉరిపోసుకుని మరణించడమే మేలు" అనేది ఆమె.

"ఉరి, గిరిలాంటి మాటలు అనకమ్మా ! నువ్వెలాంటి యింటి నుంచి వచ్చావ్. ఎలాంటి సంప్రదాయం మనది ఆలోచించావా ! దరిద్రదేవత యీ యింట తాండవించ వచ్చునేమోకాని ఈ కుటుంబ మర్యాద మంట కలవడానికి వీలులేదు. నువ్వు నుయ్యో, గుయ్యో చూసుకున్న మరుక్షణం నేను ప్రాణాలతో ఉండను. ఈ ముసలాడి ఆత్మాభిమానాన్ని గుర్తుంచుకొని, నువ్వేదైనా చేయి. నీ యిష్టం" అని ముసలాడు మందలించేవాడు.

ఇక ఆ ముసలాడితో మాట్లాడి లాభం లేదని ఆమె కళ్ళు ఒత్తుకొని వెళ్ళిపోయేది. అతనికి ఏం చెప్పినా గ్రహించలేడు. అర్థంకాదు. అతని సేవా శుశ్రూషలు చేయడానికే ఆమె కావాలి. కుటుంబ మర్యాదకి మనసాక్షిగా తానుండిపోవాలి. అంతే తప్ప తనకు కోరికలుంటాయని అతడు గుర్తించలేడు. ఒక క్షత్రియ కులపు కోడలికి యిది అసంభవం. అసంభవం. ఈ ఆలోచన రాగానే ఆమెని మరల నిర్లిప్తత ఆవరించేది. అటువంటప్పుడు ఆమె చెవులలో "వదినా ! నీ గురించిన నా ఆలోచన అంతా యింతా కాదు. రాత్రింబవళ్ళు నీ గురించే ఆలోచిస్తున్నాను. నిన్ను నేను ప్రేమిస్తున్నాను. జైలు నుంచి రానీయి అప్పుడు..." అని వినిపిస్తున్నట్లుండేది.

రకరకాల ఆలోచనలతో డోలాయనం అవుతూనే ఆమె ఎవరేమను కుంటారోఅనే ఆలోచనలు లేకుండానే తన పనులు తాను చేసుకొని పోతుంది.

మొదట్లో వలెనే దినచర్య మొదటికొచ్చింది. అదే పూజ, అదే రామాయణ పారాయణం. అత్తమామల సేవ, ఇంటి చాకిరి, మధ్య మధ్య దేవుణ్ణి యిలా ప్రార్థించేది.

"ప్రభూ ! నువ్వు విశాల హృదయుడివి. నీ చేయి చాలా పెద్దది. ఎందరికో ఎన్నో ఉపకారాలు చేస్తుంటావ్. నన్ను ఆశీర్వదించు."

ఒకనాడు గడ్డి మోటులోంచి గడ్డిపీకి పాలేరుకి యిస్తోంది. ఆనాటి వలెవాడు. ఆ మాట మళ్లీ అనాలని ఆమె అనుకొంటోంది. వాడు మాత్రం నోరు మెదపకుండా నిలబడి గడ్డి లుంగచుట్టుకొంటున్నాడు.

"దయ్యం పట్టిందేరా ! ఏం మాట్లాడకుండా మూగనోము పట్టావ్ !" అంది ఆమె.

"చిన్నమ్మగారూ ! అవాళ బుద్ధి గడ్డితిని నోరు జారీ ఏదో అన్నాను. మళ్ళీ నోరు విప్పితే ఏం కొంప మునుగుతుందోనని" అని వాడు ఆగిపోయాడు.

"నేనప్పుడే మరిచిపోయాను !" అందామె. "ఏమోనమ్మా ! నేను మనసులో మాట ఉంచుకోలేను. ఆ మాట అని మీ మనసు కష్టపెట్టాను. క్షమించండి. మాకేం కుళ్ళు బుద్ధులుండవమ్మా ! మీ పెద్దింటోళ్ళు లోపలొకటి పైకొకటి చెప్పుంటారు. ఆ ముసలాళ్ళిద్దరూ మీ ఒంటిని ఎలా చూస్తున్నారో మాకు తెలీదు. కాని యింత చిన్న వయస్సులో మీరిలాఅయిపోవడం నాకు బాధగా ఉంది. అందుకే చిన్నయ్యతో నీ పెళ్ళి అవాలన్నాను".

ఆ మాట విని ఆమె మనసు మరల కలవరపడింది. కళ్ళు విప్ఫారితలయాయి. అంతలోనే తమాయించుకొని "ఆ మాట అనకు" అనేసి లోపలకు వెళ్ళిపోయింది.

పాలేరు కాసేపు అక్కడ నిలబడి తర్వాత పశువుల కొట్టాం వైపు అడుగులు వేశాడు. ఇదివరకు ఆ మాట అన్నప్పుడు ఆమె కోపగించింది. ఆ తీవ్రం యిప్పుడు తగ్గిందే. ఆమె యివాళ తిట్టలేదు. నిజంగా చిన్నయ్యతో ఆమెకి పెళ్ళైతే ఎంత బాగుంటుంది. పాపం బతుకంతా హాయిగా గడిచి పోతుంది. చిన్నయ్య పెళ్ళి చేసుకోకపోయినా ఆమెని ఉంచుకోవచ్చు. ఎందరో అలా చేస్తుంటారు. ఈయన ముత్తాతగారు ఎవతెనో ఉంచుకొన్నట్లు. ఈమె చిన్నయ్యకు వదినాయె మొదట్లో కొంత గడబిడ జరుగుతోంది. తర్వాత అంతా శాంతిస్తుంది. కసాయి పాల్పడిన ఆవుని రక్షిస్తే ఎంతో పుణ్యం !

xx xx xx

నెల, రెండు నెలలకు ఒకసారి వచ్చి మటరూ వెళ్ళి యోగక్షేమాలు తెలుసుకొని వెళ్తున్నాడు. లంకభూముల కబ్జా గురించి పథకాలు వేస్తున్నాడు. అందుకని గుడిసెని వదిలి బయటకు పోవడం లేదు. ఎట్టి పరిస్థితులలోనూ శత్రువులకి సమయం యివ్వడం అతని అభిమతం కాదు. తన ఈ ప్రకృతి కోటలో ఎవ్వరూ తనపై దాడిచేసే సాహసం చేయరు. పైగా యిప్పుడు తాను ఒంటరి కాడు. అతని గుడిసె దగ్గర డజన్ల గుడిసెలు వెలిశాయి. యాభై మందికి పైగా రైతులు, యువకులు కర్రలతో యెప్పుడూ అతనికి రక్షణగా ఉంటున్నారు. పైగా ఎన్నో తాలింఖానాలు ప్రారంభం అయాయి. ఎందరివో పశువులు అక్కడే ఉంటున్నాయి. మటరూ విడుదలై వచ్చేసరికి రబీ పంటకి లీగు వచ్చేసింది "అక్కడ రబీ పంట మాత్రమే వేయగలం" అని అందరూ అనుకొనేవారు. కాని ఖాళీగా ఉండడం మటరూకి ఎంతమాత్రం యిష్టంలేదు. తిని కూర్చోవడం అతని స్వభావానికి విరుద్ధం. అందుకే లంకల్లో "చెరుకు వేద్దాం" అన్నాడు. అందరూ "వద్దు" అన్నారు. అయినా లక్ష్యపెట్టక మటరూ అక్కడ చెరకు వేశాడు. అతడు వేశాడని మిగిలినవారు వేశారు.

"గంగమ్మతల్లి మనకు అన్యాయం చెయ్యదు. ఒకళ్ళకేం జరిగితే అందరికీ అదే జరుగుతుంది" అన్న మటరూ మాటలే అందరినీ ప్రోత్సాహకాలు అయాయి.

"పంట చేతికి వచ్చిందా బెల్లానికి లోటుండదు" అన్నాడతను.

ఇప్పుడు ఆ తీర ప్రాంతం చిన్న బస్తీలా అయిపోయింది. పొయ్యిలు వెలిగాయి. పశువుల కలకలం వినిపిస్తోంది. చూస్తుండగానే చెరకు బ్రహ్మాండంగా పండింది. అందరికి కన్ను కొట్టేటంత పంట. ఆ తోటల్లో ఏనుగు చొరబడినా కనిపించదు. కాని యిక యిప్పుడు గంగమ్మతల్లి భయం పట్టుకొంది. వర్షాకాలం వచ్చేసింది. వరద జోరు పెరగసాగింది.

"గంగమ్మ తల్లీ ! కరుణించు పంట కోసుకోనియ్యి". అని అందరూ మొక్కుకొని ప్రార్థనలు చేయసాగారు.

వాళ్ళ ప్రార్థనల్ని గంగమ్మతల్లి ఆలకించిందేమో ప్రవాహం తగ్గింది. వచ్చిన వరద నీరు మధ్యగా ప్రవహించి పోయింది. వాళ్ళ పంట దెబ్బ తినలేదు. అందరూ మటరూని ప్రశంసించారు. ఒక్కొక్కసారి నదీ

ప్రవాహాలు దారి మళ్ళుతూ ఉంటాయి. అయినా "అదంతా గంగమ్మతల్లి కరుణ" అని మటరూ నమస్కరించాడు.

జమీందార్లు నేరుగా వచ్చి వివాదాన్ని పరిష్కరించదలచలేదు. మటరూ యిప్పుడు ఏకాకి కాడు. అందుకే వాళ్ళు చట్టాన్ని ఆశ్రయించారు. రైతులు తమ భూముల్ని ఆక్రమించారని, ప్రభుత్వం దోషులని శిక్షించాలని కోరుతూ వాళ్ళు 'పిటిషన్' పెట్టారు.

ఏం జరిగిందో ఏమీ తెలీదు. ప్రభుత్వం వారి దర్బారు చాలా దూరంలో ఉంది. వారికి ఏం వినిపిస్తుంది ? ఏం కనిపిస్తుంది ? అన్నీ తెలిసి సర్కార్ యంత్రాంగం కదిలేటప్పటికి అక్కడ ఏం ఉండదు. పట్వారి లెక్కల్లో మాత్రం లంక భూముల వివరాలున్నాయి. అది ఎవరి పేరునా లేదు. అంచేత ప్రభుత్వం ఏం చేయలేదు. చేస్తే గంగమ్మతల్లి ఊరుకొంటుందా ?

xx xx xx

వర్షాకాలంలో మటరూ, అతని బృందం చాలా జాగ్రత్తగా ఉన్నారు. వారంతా కలిసి ఒక దళంగా ఏర్పడ్డారు. ఆ సమీప గ్రామాల రైతులందరి వాళ్ళతో బంధువులవలె అన్నదమ్ముల వలె కలిసిపోయారు. ప్రతి విషయాన్ని వారు బాగా తెలుసుకొంటున్నారు. మటరూకి చెప్తున్నారు. ఇప్పుడతని దగ్గరకు వచ్చే పోయే వారి సంఖ్య వందలలో ఉంది. అతడిని పట్టు కోవడం సాధ్యమైన పనికాదు.

పది, పదిహేను మందితో కలిసి మటరూ రాత్రివేళ గోపీ యింటికి వచ్చిన సంగతులు తెలుసుకొని తెల్లవారకుండానే వెళ్ళిపోతున్నాడు. అతనిని అందరూ ఉత్సాహంతో గౌరవిస్తున్నారు. "గోపీ పెళ్ళి గురించి ఏమైనా ప్రయత్నించావా?" అని ముసలాళ్ళిద్దరూ అడుగుతున్నారు.

"తొందరేం ఉంది, వాణ్ణి విడుదలై రానీండి. నెల తిరక్కుండా ఎలాంటి కోడల్ని తెస్తానో చూద్దురుగాని" అనేవాడు మటరూ.

అతను గోపీకి ఉత్తరాలు రాస్తున్నాడు. అతడి భార్య మరణం గురించి మాత్రం తెలియనివ్వలేదు. తిరిగి వచ్చాక అతని జీవితం ఎలా గడుస్తుందో ! తాను గంగమ్మతల్లిని, తననే నమ్ముకొన్న రైతాంగాన్ని విడిచి ఉండలేదు. తాను

లేకుండా జమీందార్లు ఏదైనా అఘాయిత్యం తలపెడితేనా ! - ఇలా ఆలోచిస్తూనే కోడలు చేసిన వంట భోజనం చేసేవాడు.

"మా బావున్నాయమ్మా ! గోపీ అదృష్టవంతుడు, ఇంత రుచికరమైన భోజనం చేసినవాడు జన్మలో మరిచి పోలేడు" అనేవాడు.

ఆమె విని ఏమనుకొనేదో తెలీదు. ఒకసారి వీలు కల్పించుకొని ఆమె మటరూకి కనిపించింది. ఆమెను చూడాలని అతనికీ ఎన్నోమార్లు అనిపించింది. ఆమెను చూడగానే ఒక్కసారి తుళ్ళిపడ్డాడు. గోపీ వదినగారు అంత చిన్నవయసు పిల్ల అని, అందగత్తె అని అతనికి తెలీదు. అలా అనుకోలేదతను.

అప్పటినుంచి ఆమెపట్ల మటరూకి సానుభూతి పెరిగింది. ముసలివాళ్ళ దగ్గర కూర్చుని బిగ్గరగా ఆమెకి వినిపించేలా సానుభూతి మాటలు చెప్పేవాడు. అవి విని ఆమె కొంత వూరట చెందేది.

ఇప్పుడు మటరూ ఆలోచన వేరుగా ఉంది. ఆమెవంటి అందమైన యువతిని గోపీ కోసం యెక్కడ నుంచి వెతుక్కురాగలడు ? అలాంటి స్త్రీని అతనింతవరకు ఎక్కడా చూడలేదు. గోపీ ఆమెంటే ప్రాణం యిస్తాడు. అందులో వింతయేమీలేదు. అలాంటి అందాలరాశి కోసం ప్రాణం యివ్వని వాడెవరు ? చనిపోయిన ఆమె చెల్లెలు కూడా అలాగే ఉండి ఉంటుంది. అటువంటప్పుడు అతని మనస్సు వేరే యువతిపై ఎందుకు ఉంటుంది ?

ఇంటి పాలికాపు వలెనే మటరూ ఆలోచన పోతోంది. గంగా తీరాన లంక భూముల స్వచ్ఛందత మధ్య ఎదిగిన అతనికి ఈ కట్టుబాట్లు వంశ మర్యాదలు గురించి అంతగా తెలీదు. అతనికి ఎప్పుడూ ఏది తోస్తే అదే చేశాడు. ఏ బంధనాలని అతను మన్నించలేదు. మనిషికి బలం, సాహసం ఉంటే చాలునని నమ్మిన వాడతను. అటువంటి వారేం చేసినా యెవ్వరాపగలరు. గోపీ అంగీకరించే పక్షంలో ఈ పెళ్ళి చేసి తీరాలని మటరూ నిశ్చయించుకొన్నాడు. అందుకై చాలా రాద్ధాంతం జరుగుతుంది. గోపీ తన యింటిని విడిచి పెట్టి రావాలి. అదే జరిగితే తన లంకలో అతనికి ఒక గుడిసె, కొంత భూమి యివ్వాలి. తన వలెనేవాళ్ళు ఉండవలసి వస్తుంది. ఒక యువతి జీవితం బాగు పడుతుంది. ఆమె రక్షించబడుతుంది.

# పదకొండు

శిక్ష పూర్తి అయి విడుదలకాగానే యితర ఖైదీల వలె గోపీకి ఆనందంగా లేదు. ఇవాళ అతను తన యింటివైపు వెళ్తున్నాడు.

వితంతువైన వదినగారి ముందుకు వెళ్ళి నిలబడాలి. సింధూరం చెరిగిపోయిన ఆమె ముఖాన్ని చూడక తప్పదు. గడిచిన నాలుగు సంవత్సరాలుగా ఆ సన్నివేశాన్ని ఎదుర్కొనడానికి అతను మానసికంగా తయారవుతున్నాడు. ఇవాళ ఆ క్షణం వచ్చేస్తోంది.

అతను గ్రామంలో ప్రవేశించే సమయానికి సాయంకాలం అవుతుంది. సంధ్యాకాంతులు భూమిపై పరచుకొంటున్నాయి. అది శిశిరకాలం, నలు ప్రక్కలా నిశ్శబ్దం వ్యాపించి ఉంది. గ్రామంపై నిలిచిన మేఘ శకలాలు గమ్యం తెలియక పరుగెడుతున్నాయి. దారిలో ఎవరినైనా తన "యింటి సంగతులు అడుగుదాం" అనుకొన్నాడు. ఎవరూ కనిపించలేదు.

దగ్గరలో చిన్న దేవాలయం ఉంది. "పూజారిగారిని కలుసుకొంటే ఏం" అనుకొన్నాడు. దైవదర్శనం చేసుకొని, పూజారిని తన యింటి విషయం కనుక్కోవచ్చుననుకొన్నాడు. చాలా యేళ్ళు యింటి దగ్గర లేనందున ఆ మధ్యకాలంలో జరిగిన సంగతుల్ని త్వరత్వరగా తెలుసుకోవాలని ఆత్రుత పెరుగుతోంది. అయినా చెడు సంగతులు యేమైనా వినవలసి వస్తుందేమోనని మనస్సు కీడుని శంకిస్తోంది.

దేవాలయం నిర్మానుష్యంగా కనిపించింది. ఇది హారతి యిచ్చేవేళ. మరి యిలా ఉందేవిటి ? ఇంత నిశ్శబ్దంగా ఉందేవిటి ? అక్కడ మంటపం దగ్గర ముసలి ముష్టివాడు ఏదో గొణుక్కొంటున్నాడు. వాడు గోపీని చూసి "ఏవిటి బాబూ !" అని అడిగాడు.

"ఆలయం మూసేసి ఉంది. పూజారి లేడు" అని గోపీ అడుగుతూ అతని దగ్గరకు వచ్చాడు.

ముష్టివాడు బిగ్గరగా నవ్వాడు. పళ్ళు లేనందున అతడి నవ్వు తమాషాగా ఉంది.

"నీదీ వూరు కాదేటి? పూజారిగారు పారిపోయి మూడు సంవత్సరాలయింది. ఈ వూరి అమ్మాయితో పట్టుబడ్డాడు" అని ముష్టివాడు పకపక నవ్వాడు.

ఆ మాటలు విని గోపి చేతులు వణికాయి. చెవులు మూసుకొన్నాడు. క్షణం కూడా అక్కడ నిలబడ లేకపోయాడు. శంకిస్తున్న మనసుతోనే, సందడిస్తున్న వ్యాకులతతోనే ఇంటి వైపు వేగంగా నడిచాడు. ఏదో అనుమానం అతన్ని పీడిస్తోంది.

దారిలో యిళ్ళ అరుగులమీద కూర్చున్నవారు అతన్ని వింతగా చూస్తూ వేసే ప్రశ్నలకు గోపి జవాబులు యిస్తూ యివ్వకుండా వేగంగా వెళ్తున్నాడు. అయినా అతని మనసు వ్యాకులంగా ఉంది. తన ఆత్మీయుల శవాన్ని దహనం చేసి తిరిగి వస్తున్న మనిషివలె అతను కనిపిస్తున్నాడు.

ఎవరో పరుగున యింటికి వెళ్ళి గోపి వస్తున్న వార్త చెప్పారు. అతను యింకొంచెం దూరంలో ఉండగానే తన యింటినుండి పెడబొబ్బలతో ఏడుపు వినిపించింది. అతని గుండె ఆర్ద్రం అయింది. శరీరం అంతా వ్యాకులత వ్యాపించింది. పాదాలు వణికాయి. కళ్ళముందు అంధకారం ఆవరించింది. తల తిరిగింది. అతని వెంట వస్తున్న వాళ్ళకి అతడి స్థితి అర్థం అయింది. ఎవరో కొందరు అతనికి అండగా నిలిచారు. "భీముడిలాంటి అన్నగారి చావుని తట్టుకోవడం తరమా ? పాపం ఆ దేవుడు పెళ్ళాన్ని గూడా తీసుకుపోయాడు" అన్నారెవరో !

ఆ మాట విని గోపి తత్తరపడి ఏవిటీ ?" అన్నాడు.

"ఇప్పుడు బాధపడి ఏం లాభం, దానితో నీకు ఆ కొద్ది రోజుల అనుబంధమే రాసి ఉంది. ఇక మిగిలిన వాళ్ళని చూసుకోవాలి, ఆదుకోవాలి" అని సముదాయించారు.

పిడుగులాంటి శూలం యేదో తన శరీరంలో ప్రవేశించి అవయవాలను చేరేస్తున్నట్లనిపించిందతనికి. భరించలేని వ్యాకులత అతన్ని కంపింపజేయగా ప్రక్క వారిపై వాలిపోయాడు.

అతడిని యింటికి తీసుకువచ్చి చాపపై పరుండపెట్టారు. ముఖంపై నీరు చిలకరించారు. అతనికి స్పృహ రాసాగింది. ముసలి వాళ్ళని, వదినని అక్కడ చేరిన వారు సముదాయిస్తుండడం అతనికి తెలిసింది.

xx xx xx

నెలల తరబడి ఆ ఇంటిని దుఃఖం ఆవరించి ఉంది. నెలల తరబడి వాళ్ళ కళ్ళ నీళ్ళు కారుతూనే ఉన్నాయి.

దుఃఖానికి ఎంత క్రుంగదీసే శక్తి ఉందో అంతకన్న యెక్కువ శక్తి ప్రకృతికి ఉంది. అది మనిషికి సహన శక్తిని యిచ్చింది. దుఃఖానికి నిశ్చిత శక్తి లేనట్లే సహనానికి గూడా నిశ్చిత శక్తి లేదు. దుఃఖ భారం మనిషి ఆత్మని కదిలిస్తోంది ఆ దుఃఖమే ఒక్కొక్కసారి పదిరెట్లు శక్తిగల సహనశీలతను ప్రదీప్తం చేసి, మనిషిని కలుపుతుంది. ఏడ్చి యేడ్చి మనిషి దుఃఖాన్ని మరిచిపోతాడు. విషాద మేఘం తొలగిపోతుంది. మనిషి ముఖంపై ఆనందం మెరుస్తుంది. తనపై విషాద మేఘం ఆవరించిన సంగతినే అతడు మరిచిపోతాడు. కొందరి విషయంలో యిది వర్తించదేమో కాని చాలా మంది విషయంలో యిదే నిజం.

గోపి, అతని తల్లిదండ్రులు, వదిన, వీళ్ళందరూ మామూలు మనుష్యులే. దుఃఖ సముద్రంలో వ్యథాతరంగాల దెబ్బలు తిన్నవారు సంవత్సరాల తర్వాత యిప్పుడు ఆ తరంగాలే తమకిప్పుడు స్పర్శని, సాంత్వన స్పర్శని, సుఖస్పర్శని యిస్తున్నట్లు కోలుకొంటున్నారు. కోలుకొన్నారు. గతాన్ని మరిచిపోతున్నారు.

వదిన, మరిది ఒక దౌర్భాగ్యానికి గురి అయినవారు. ఒకరికొకరు ఎలా సముదాయించుకోవాలో తెలియనివారు. ఇదివరకటిలాగానే ఆమె పూజ చేసుకొని, యింటి పనులలో నిమగ్నం అయిపోతుంది. ఆమె యంత్రం వలె పని చేసుకొనిపోతుంది. యంత్ర విధులు, నియమాలు మారవుకద. పనిచేసి పనిచేసి భాగాలు అరిగపోయి యంత్రం శిథిలం అయిపోతుంది. మనిషి కూడా అంతే.

వదిన యిప్పుడు యిదివరకటికన్న ఎక్కువ గంభీరం అయింది. మౌనం అయింది ఉదాసీనం అయింది. పూజాపారాయణాలు, యింటి పనులో తప్ప తనకేం లేవనే స్తబ్ధత ఆమెని ఆవరించింది.

మూర్తీభవించిన ఉదాసీనత వలె, రూపుదాల్చిన దుఃఖం వలె ఉన్న వదినని చూసి గోపి "ఆమె జీవితం యింతేనా ?" అని బాధపడేవాడు. ఆమె జీవితం అలా గడిచిపోనివ్వడమేనా ? ప్రపంచంలో శిశిరం తర్వాత వసంతం వస్తుంది. కాని వదిన జీవితంలో శిశిరమే కాని వసంతం లేదా ? రాదా ? ఆమె జీవితంలో వసంతాన్ని తీసుకురాలేమా ? శిశిరాక్రాంతమైన ఆమె జీవన విహంగం మూగపోవల్సిందేనా ? ఆ కోయిల గానం మరొకసారి వినలేమా?

తమ సమాజపు కట్టుబాట్లు, పద్ధతులు గురించి గోపీకి బాగా తెలుసు. భర్త మరణించి, వైధవ్యం ప్రాప్తించిన రాజపుత్ర స్త్రీ భర్త చేతిపై సహగమనం చేయకపోతే జీవితాంతం చితిపై మండుతూ ఉండవలసిందే. ఆమె చితా భస్మరాశిగా మారకముందు ఆమెపై చేయివేసే ధైర్యం ఎవరికి ఉండదు. ఆమె ఆవేదనాగ్నిని చల్లార్చడం ఎలా ? వదిన కూడ అలా బూడిద కావల్సిందేనా ? తాను ఎన్నటికీ ఆమె వ్యథాగ్నినీ చల్లార్చలేడా ? గోపీ కళ్ళముందు యీ ప్రశ్నలే కదలాడుతున్నాయి. ఈ విషయమే అతను ఎక్కువగా ఆలోచిస్తున్నాడు. వదిన సుఖదుఃఖాల జీవితంతో అతనికీ సంబంధం ఉంది. ఇప్పుడు ఆ బంధం మరీ పెరుగుతోంది. ఇదివరకటి వలె వదినగారి జీవితంలో మరల స్నేహానందాన్ని చూడాలని అతను ఆశపడుతున్నాడు.

xx xx xx

లోకం యెలా ఉన్నప్పటికీ ఆడపిల్లల తండ్రులు మాత్రం వూరుకోరు కద. గోపీ జైలు నుంచి విడుదలై వచ్చాడని తెలిసి, వురకులు పరుగులు మీద వాళ్ళు మరల పెళ్ళి ప్రస్తావనలు తెస్తున్నారు. గోపీనే అడగమని తల్లిదండ్రులు చెప్పేశారు. ఇక వాళ్ళందరూ అనేక రకాలుగా గోపీని ఒప్పించడానికి ప్రయత్ని స్తున్నారు. వాళ్ళని చూసినప్పుడల్లా గోపీకి జాలి, కోపం కలుగుతున్నాయి.

వదినని ఆ స్థితిలో వదిలి తాను పెళ్ళి ఎలా చేసుకోగలడు ? ఆమె యీ పెళ్ళి తంతును ఎలా చూడగలదు ? పెళ్ళి పాటలను ఎలా వినగలదు ? ఆమె ఏమనుకొంటుంది ? ఆమె గుండె పగిలిపోదా ? దుఃఖాగ్ని సంతప్తమైన ఆమెపై యిలా ఉప్పును చల్లడం భావ్యమా ? ఇలా ఆలోచించే గోపీకి దిక్కులు తోచడంలేదు.

పెళ్ళి ప్రస్తావన తెచ్చిన బంధువుల్ని నిలువునా కేకలేసి పంపేద్దాం అనుకొనే వాడు. మర్యాద కాదని వూరు కొనేవాడు.

"పెళ్ళి చేసుకోను" అని వాళ్ళతో సౌజన్యంగా అనేవాడు. "ఎందుకు చేసుకోవని" వాళ్ళు నిలదీసి అడిగితే ఏం సమాధానం చెప్పలేకపోయేవాడు.

"ఈ వయస్సులో పెళ్ళి లేకుండా ఎలా ఉండగలుగుతున్నావ్" అని ఎవరైనా అడిగితే అతని మనస్సు వదిన వైపు మళ్ళేది. ఆమె వయస్సూ అతని

వయస్సుతో సమానమైనదే. ఆమె యెలా ఉంటోంది ? ఆమె మౌనంగా ఎలా గడపగలుగుతోంది ? అనుకొనేవాడు.

"ఎప్పుడో ఒకప్పుడు పెళ్ళి చేసుకోక తప్పదయ్యా !" అని మరెవరైనా అంటే "ఆ మాట వదినని ఎవ్వరూ అడగరేం" అని అతను అనుకొనేవాడు. అలా అని తనూ ఆమెతో యీ మాట అనలేకపోయేవాడు. తన నిస్సహాయతకు తానే కోపగించుకొనేవాడు.

పిల్లలుంటే ఆ పరిస్థితివేరు. వాళ్ళను చూసుకొని కాలం వెళ్ళబుచ్చవచ్చు. వదినకి పిల్లలులేరు. మరి ఆమె యిలా ఆలోచించటంలేదా ?

గోపీకి మరల తనపై తనకే కోపం వస్తుంది. ఏం చేయలేని స్థితి అతనిది.

"వంశ మర్యాదని కాపాడాలి, కట్టుబాటులను మన్నించాలి" ఎవరైనా ఈ మాట అంటే ఉరుము ఉరిమినట్లు చూసి "నా కుటుంబ గౌరవం గురించి నువ్వేం చెప్పక్కర్లేదు, వెళ్ళు వెళ్ళు" అని గద్దించేవాడు.

"వింత మనిషి, మనం మంచే చెప్తున్నాం వీడేం మాట్లాడుతున్నాడు" అనుకొని బంధువులు మరల "కట్న కానుకలు చాలవనుకొంటే చెప్పు" అనేవారు.

"అదేంలేదు. నేను పెళ్ళి చేసుకోను, చేసుకోను, చేసుకోను" అని అతనే అక్కడనుంచి లేచి వెళ్ళిపోయేవాడు.

అయినా ఎన్నటికీ ఆ తంతు ముగియడం లేదు. బంధువులు విడిచి పెట్టటంలేదు. అందుకే ఎవరైనా బంధువులు వస్తున్నారని తెలిస్తే అతనికి పిచ్చి యెక్కిపోతోంది. అతనిలో ద్వైదీ భావం మరీ పెరిగిపోతుంది. అతను మనసుతోనే తనను తాను ప్రశ్నించుకొంటున్నాడు.

"చిన్న వయసులోనే వితంతువైన వదిన కళ్ళముందు ఎలా యీ పెళ్ళి పందిరి వేయించగలను. నా హృదయ వేదనని నిర్లక్ష్యం చేస్తే ఎవరినైనా పిల్లను తీసుకువచ్చి సుఖ సంసారం ఎలా చేయను ? జరగదు, ఇది జరగదు."

ఇలా అనుకొని అతను కుమిలి కుమిలి ఏడ్చేవాడు.

# పన్నెండు

ఈసారి లంక పొలాలలో మంచి రబీ పంట పండింది. మైళ్ళ దూరం విస్తరించిన గోధుమ పంటతో ఆకాశం ఎర్రగా కనిపిస్తోంది. కోతల సమయం వార్తవిని ఎందరో స్త్రీ పురుషులు వ్యవసాయ కూలీలై అక్కడకు చేరుకొన్నారు. మటరూ వాళ్ళందరికి చక్కటి సదుపాయాలు, జీతాలు ఏర్పాటు చేయించాడు లేకపోతే వాళ్ళు పంటని దొంగిలించుకొని పోతారు కద.

గంగా తీరాన పెద్ద మేళా వలె ఉంది. ఎందరో వ్యాపారులు ఆటవీలకు అవసరమైన సంభరాలలో చిన్న చిన్న దుకాణాలు తెరిచారు. ధాన్యం తీసుకొని వాళ్ళు సరుకులు యిస్తారు. ఇక్కడ డబ్బెవరి దగ్గర ఉంది ? కూలీలకు ప్రతిరోజూ సాయంత్రం ఆ రోజు వేతనాన్ని కొలిచి యిస్తారు. దానిలోంచి వాళ్ళు కొంత ధాన్యంతోనే సరుకులు కొంటారు.

పగటిపూట మాట ఎలా ఉన్నా రాత్రి మాత్రం వాళ్ళు చక్కటి రొట్టెలు వగైరా తింటారు. అందుకోసం అక్కడ వందల పెనాలు పెట్టుకొన్నారు. ఆకాశం నుంచి మేఘాల ముక్కలు గంగా తీరాన విడిది వేసినట్లు ఆ దృశ్యం కనిపిస్తోంది.

ఆ ఆనంద కోలాహలాన్ని జీవన సంగీతాన్ని వింటున్న మటరూ సంతోషానికి, సంతృప్తికి మితి లేకుండా ఉంది. ఆ జనం పొగుడుతోంటే అతనికి సిగ్గుగా ఉంటోంది.

"ఇది మటరూ వస్తాదు ఇలాకా, మరొకరు దీనిని నిర్మించగలరా ? అంత ధైర్యం, సాహసం ఎవరికి ఉన్నాయి. అరణ్యాన్ని కూడా గులాబి తోటగా మార్చగలవాడు అతను. మరెవరు అలా చేయగలరు ! నరసంచారమే లేని బీడు భూములు యిప్పుడు జనమేళాగా మారిపోయాయి. వందల మంది రైతులకు, వేలమంది కూలీలకు నిత్యాన్నదాత అయింది ఇది. ఇదివరకు జమీందార్లు వేలు ఖజానాలో వేసుకొని మనకు పదలు యిచ్చేవారు. ఇప్పుడు మనం అమ్ముడుపోనక్కరలేదు. మనిషంటే మటరూ వస్తాదులా ఉండాలి.

బ్రతకాలి. బ్రతికించాలి. అతడు సింహం. వేలమంది కూడా అతన్ని ఏం చెయ్యలేరు. ఏ జమిందారు అతడుపై కత్తి కట్టగలడు చేయెత్తగలడు ?" ఇలా ఆ జనం మటరూని ప్రశంసిస్తూ ఆశీర్వదిస్తుండేవారు. జయజయధ్వానాలు చేస్తుండేవారు.

అవన్నీ విని మటరూ గంగానదికి చేతులెత్తి నమస్కరించి "ఇదంతా గంగమ్మతల్లి దయ. ఆమె ఖజానాలో ఏ వస్తువుకు కొరతలేదు. తీసుకొనే వారుండాలి అంతే. తల్లిఒడి బిడ్డల కోసం ఎప్పుడూ ఖాళీకాదు. ఆమె జగన్మాత, జై గంగమ్మతల్లి" అని భక్తితో అనేవాడు.

×× ×× ××

కృష్ణపక్ష చంద్రుడు కనిపించగానే పనినుంచి క్రమంగా కూలీలను మటరూ, ఫూజన్ పంపించేసేవారు. పగటి పూట ఎండ వేడిమికి, గాడ్పునకు యిబ్బంది పడే కూలీలు ఉదయం పూట ఎండ ఎక్కకుండా రెండు మూడు గంటలలో చేసే పనిని ఆ తర్వాత ఏడెనిమిది గంటలలో చేయగలిగేవారుకారు. రాత్రిపూట పనివారు నదీతీరాన ఇసుకపై చల్లటి వాతావరణంలో నిద్రించేవారు. ఎంతో మృదువైన, చల్లనైన ఉత్తరపు గాలులు ప్రసరిస్తున్నాయి. చంద్రుడు మధురమైన చల్లటి వెన్నెల కురిపిస్తున్నాడు. నది మంద్ర స్వరంతో కమలగీతం వినిపిస్తున్నట్లు ప్రవహిస్తోంది.

ఏ అలికిడి అయినా వాళ్ళు వెంటనే లేచేస్తున్నారు. ఆ నది తీరాన నాలుగైదు గంటల విశ్రాంతితో అలసట తీరి హాయిగా ఉంటోంది. కొత్త శక్తి ఉత్సాహం వస్తున్నాయి. గ్రామాలలో తమ యిళ్ళ దగ్గర రాత్రంతా నిద్రపోయినా లభించని తృప్తి, పూరట యిక్కడ లభిస్తున్నాయి.

ఒక చోట అందరూ గుమిగూడి హుక్కా పీలుస్తారు. పొగాకు నములుతారు. పరాచకాలడుకొంటారు. ఆ తర్వాత కోత పని మొదలుపెడతారు.

పొలమంతా ఆడకూలీలు మగకూలీలు బారులు తీరి కూర్చుని కోత కోస్తున్నారు. ఒక కొసన మటరూ ఉన్నాడు. రెండవవైపున ఫూజన్ ఉన్నాడు. ఫూజన్ అక్కడి ఒక ముసలి ఆడ కూలీని "ఓ పాట అందుకో !" అని ప్రోత్సహించాడు.

ఆమె తన ప్రక్కనున్న మరొక ఆడ కూలీకి, ఆమెకు ప్రక్క కూలీకి యిలా అందరికీ పాట ఊపు అందింది. యువతులు గొంతు సవరించుకొన్నారు. "నువ్వు మొదలెట్టు నువ్వు మొదలెట్టు !" అని

కొంతసేపు గుసగుసలు వినిపించాయి. భూమి పుత్రికల కంఠాల నుంచి ఒకే శ్రుతిలో, ఒకే లయతో పాట పెల్లుబికింది. వాళ్ళ ముఖాలు వికసించాయి. కళ్ళు ఆనంద విస్ఫారితలయ్యాయి. చేతులు వేగం పెరిగి, కోత చకచక సాగుతోంది. శ్రమైక జీవన సౌందర్యం గొంతెత్తి పాడుతోంటే ఆకాశంలో చంద్రుడు, నక్షత్రాలు మరీ ఆనందంగా ప్రకాశించాయి. గంగానదీ తరంగాలు ఉన్మత్తాలై తీరాలను తాకుతున్నాయి.

"ప్రియా ! నువ్వు పరదేశం వెళ్ళకు !
అక్కడ ఏం దొరుకుతుంది ఇక్కడ కన్నా !
ఇక్కడ పంటలు కోతకు వచ్చాయి
బంగారం గింజలు తలలాడిస్తున్నాయి !
నేను మంద హాసాలతో అదృష్టం తెస్తాను
నృత్య గానాలతో పంట దేవతకి హారతులిస్తాను !
ఆనందించి ఆమె కొత్త పంటలు యిస్తుంది
బ్రతుకంతా వెన్నెల కురుస్తుంది !
రాజనాల అన్నం పెడతా
జలతారు బట్టలు పెడతా
చిక్కపాల పరమాన్నం పెడతా
చిక్కపోని వలపేయిస్తా !
ప్రియా ! నువ్వు పరదేశం వెళ్ళకు !
అక్కడ ఏం దొరుకుతుంది యిక్కడకన్నా."

ఉషాసుందరి మందహాసాల వెలుగులు ఆ పొలాలను యెర్రగా మెరిపిస్తున్నాయి. కూలీల ముఖాలు రాగరంజితాలయాయి. నదీ జలాలు ఎర్ర దుప్పటి వలె మెరుస్తున్నాయి. ఆ నిశ్శబ్ద ప్రశాంత వాతావరణాన్ని నేటి పక్షుల కలవరం వ్యాపించింది. చెట్ల మీది పిట్టలు కూడా కిలకిలా రాగాలు చేస్తున్నాయి. సూర్యుడిలోని కిరణాలు చరాచరా జీవుల పై ప్రసరించి వాటి ప్రేమ మత్తుని వదిలించాయి. చైతన్యవంతంకమ్మని తట్టిలేపాయి.

ఆ సమయంలోనే "మటరూ !" అని పిలుపు అతనికి వినిపించింది. అటు చూశాడు. ఆశ్చర్యపోయాడు. నడిచే చిత్తారువు వలె ముందడుగు వేసి "అరే గోపీ ! నువ్వా ! ఎప్పుడు వచ్చావ్ !" అని అడుగుతూ ఎదురు వచ్చిన గోపీని కౌగిలించుకొన్నాడు.

"భలే అడుగుతున్నావ్ ! నేను వచ్చి ఐదారు నెలలైంది. అసలు నీ కబురే లేదే" గోపీ నిష్ఠురంగా అన్నాడు.

"ఆ ! ఈ నెల్లో కదా నువ్వు విడుదలవాలి" అన్నాడు మటరూ.

"ఆరు నెలల రెమిషన్ యిచ్చారు. నువ్వు మా యింటి సంగతులు తెలుసుకొంటున్నావని విన్నాను. ఈ మధ్య ఎందుకు రాలేదు. బాగున్నావా నీ కోసం ఎదురుచూస్తూ గడిపాను" అన్నాడు గోపీ.

"అంతా గంగమ్మతల్లి దయ, ఇక్కడ పనుల తొందర వలన రాలేకపోయాను. నువ్వెలా ఉన్నావ్ ? ఈ కోతల పని అవగానే వచ్చివో రాత్రి మీ యింట గడుపుదాం అనుకొన్నాను. నువ్వొచ్చావ్ మంచిదైంది. నాకెక్కడా కదిలే తీరిక లేదు. పనులూ, అవసరాలూ అలాంటివి" తన గుడిసె వైపు గోపీని తీసుకు వెళ్తూ మటరూ వివరించాడు.

"ఒక్కణ్ణే ఉంటున్నానని చెప్పావ్ ! చూస్తోంటే యిక్కడ చిన్న బస్తీయే వుందే !" ఆ చుట్టూ కోలాహలాన్ని జన జీవితాన్ని చూస్తూ గోపీ అన్నాడు.

"అంతా గంగమ్మతల్లి దయ. ఇప్పుడు మటరూ ఒంటరి వాడుకాడు. అతడి సంసారం పెరిగిపోయింది" అని పకపక నవ్వాడు.

గుడిసె బయట మటరూ పెద్ద కొడుకు చేత నీటి కడవతో ఉన్నాడు.

"అలా చూస్తావేరా ! మావయ్య ! దండంపెట్టు" అని మటరూ అనగానే వాడు నీటికుండ క్రిందపెట్టి గోపీకి పాదాభివందనం చేశాడు. గోపీ అతడిని ఆశీఃపూర్వకంగా నిమిరి, పైకి లేవదీసి "పెద్దాడా !" అని మటరూని ప్రశ్నించాడు.

"అవును" అని మటరూ కొడుకు వైపు తిరిగి "పాలు తీస్తే మావయ్యకి తీస్కురా ! నువ్వు పాలం వైపు వెళ్ళు" అని పురమాయించాడు. "తొందరేం లేదు. ముఖం కడుక్కోవాలి" గోపీ అన్నాడు.

"సింహాలు పళ్ళు తోముకొంటూ యేమిటి ? పైగా గుమ్మపాలు బలం" అని మటరూ పకపక నవ్వాడు. గోపీ శ్రుతి కలిపాడు.

xx xx xx

జైలులో సంగతులు, యింటి విషయాలు చెప్పి గోపీ "పెద్ద చిక్కు వచ్చింది. నీ సలహా అడుగుదామని వచ్చాను. నువ్వే నన్ను ఒడ్డున

పారేయాలి. బంధువుల గోల ఎక్కువగా ఉంది. నాకేం తోచడం లేదు. వదిన పరిస్థితిని చూడలేకపోతున్నాను. ఆమెపై వ్యామోహం పెరుగుతోంది. ఆమె జీవితంలో మనం ఆనందం నింపలేమా ?" అని అడిగాడు.

"ఇన్నాళ్ళూ యీ సంకటాన్ని నేను అనుభవించాను. ఎప్పుడు మీ యింటికి వెళ్ళినా ముసలాళ్ళునీ పెళ్ళి గురించి నా ప్రాణం తీస్తూ వచ్చారు. మీ వదినని చూశాక అలాంటి పిల్ల ఎక్కడా ఉండదని అనిపించింది. ఆమెను నువ్వు పెళ్ళి చేసుకొంటే బాగుంటుందనిపించింది. నీ అభిప్రాయం తెలియకుండా నేనేం చేయగలను. అందుకే నువ్వు వచ్చేవరకూ వాయిదా వేస్తూ వచ్చాను. నీ కిష్టమేనా ?" మటరూ గంభీరంగా అడిగాడు.

"మన కిష్టం అయితే సరిపోయిందా ?" గోపీ ఉదాసీనంగా అడిగాడు.

"ఎందుకు కాదు. మగాడికి కొన్ని అధికారాలున్నాయి. ఒకవేళ ఈ లోకం అంతా నిన్ను వ్యతిరేకిస్తే మటరూ నీకు అండగా నిలబడతాడు. ఒకవేళ యీ వ్యవహారంలో మీ అమ్మా నాన్నా నిన్ను యింటిలోంచి గెంటెస్తే నా దగ్గర యిక్కడ నీకు అన్నీ ఏర్పాట్లు చేయాలనే వరకూ నేను నీ గురించె ఆలోచించాను. ఈ కొత్త పొలాలు మూశావుగా అందరం కలిసి పని చేసుకొందాం. మనల్ని ఎవ్వరూ ఏమీ అనరు. మీ వదిన పరిస్థితి చూస్తే నాకు గుండె తరుక్కుపోతుంది. నువ్వు ఆమెను పెళ్ళి చేసుకో. నీకు పుణ్యం ఉంటుంది. కసాయి బారినుంచి మేకని, తలారిబారినుంచి ఆవును రక్షించినంత పుణ్యం వస్తుంది. సాహసికులు యిటువంటి సందర్భాలలో వెన్ను చూపకూడదు. పిరికిపందలై పారిపోకూడదు" మటరూ స్థిరస్వరంతో గోపీని ప్రోత్సహిస్తూ అని వెన్ను నిమిరాడు, దన్ను యిచ్చాడు.

"ఆమె అంతర్యం తెలియాలి కద. ఆమె ఏం ఆలోచిస్తోందో ! ఈ పెళ్ళికి ఆమె ఒప్పుకొంటుందా అని" గోపీ సందేహంగా అడిగాడు.

"ఆర్నెల్లై వచ్చానంటున్నావ్. ఆమె వూహ కనిపెట్టలేకపోయావా ?" మటరూ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎలా తెలుస్తుంది ? ఆమె మౌనవ్రతం పాటిస్తోంది. మెడమీద కత్తివేటు పడబోయే పావురం వలె ఆమె నిశ్శబ్దంగా కన్నీరు కారుస్తూ చూస్తుంటుంది. ఎలా తెలుసుకోగలను ?" అన్నాడు గోపీ నిస్సహాయంగా.

"ఓ రోజున నువ్వే అడుగు".

"కానీ ... అమ్మా, నాన్నా."

"గోపీ ! ఒక సంగతి గుర్తుంచుకో 'అమ్మా, నాన్నా' మొహమాటంలో పడితే ఈ వ్యవహారం పరిష్కారం కాదు. వాళ్ళు కుటుంబ గౌరవాన్ని, సంప్రదాయాన్ని ప్రాణప్రదంగా చూసుకొంటారు. వాళ్ళకి ఆ వయసులో అంతకన్న ఏం ఆలోచన ఉండదు. నువ్వు యువకుడివి. ఆలోచించు వాళ్ళతో పెట్టుకొంటే నీకు మిగిలేదేమిటి ? భయాన్ని విడిచిపెట్టు. నీకు తోడుగా సర్వ వేళలా నేనున్నాను. ఎవరేం చేస్తారో చూద్దాం. గోపీ ! సాహసం కావాలి. ధైర్యం ఉండాలి. ధైర్యం ముందు లోకం తలవంచుతుంది" మటరూ మరీ హెచ్చరికగా అన్నాడు.

"సరే ! నువ్వెప్పుడు వస్తావ్ ? నువ్వొచ్చి చెప్తే అమ్మా నాన్నా త్వరగా రాజీకి వస్తారు."

"నాలుగైదు రోజుల్లో వస్తాను. ఈ పొలం పనులు పూర్తి చేసి, నీ పెళ్ళి జరిపిస్తాను. నువ్వు మాత్రం వదినకి ఈ విషయం చెప్పి వుంచు. పద అలా వెళ్ళి పొలాలు చూసి, గంగా స్నానం చేసి వద్దాం."

## పదమూడు

ఎందరో బంధువులు గోపీకి పిల్లనిస్తామని అడిగి విసిగి, వేసారి వెళ్ళిపోయిన తర్వాత ఒకనాడు వదిన పూజ చేసుకొంటున్న వేళ తల్లిదండ్రీ గోపీని తను వద్దకు పిలిచి నిలబెట్టారు.

"ఒరే ! నన్నూ మీ అమ్మనీ, మా అవస్థనీ చూశావుగా !" = తండ్రి అడిగాడు. ఏదో ఆలోచించుకొంటూ గోపీ తలవూపాడు.

"మా బతుకులు పండిపోయాయి. ఇవాళపోతే రేపటికి రెండు అని గుర్తుపెట్టుకో. మేం కన్న కలలు, పెట్టుకొన్న ఆశలు గురించి ఆలోచిస్తుంటే గుండె పగిలిపోతోంది. ఏం చేస్తాం. దైవలీల అలా ఉంది. ఇల్లు యిలా కళా విహీనంగా ఉండగానే మేం..." అంటూనే తండ్రి దుఃఖ భారంతో ఆగాడు. తల్లి వెక్కి వెక్కి యేడుస్తూ ముఖానికి కొంగుచాటు వేసింది.

ఆ దుఃఖ సన్నివేశాన్ని యెంతమాత్రం భరించడం చేతకాక, అక్కడ ఉండడం యిష్టంలేక నిర్దయగా గోపీ బయటకు వెళ్ళిపోబోయాడు. అప్పుడు తండ్రి" మా బొందిలో ప్రాణాలుండగానే నువ్వో యింటి వాడివైతే మేం శాంతిగా..." అన్నాడు. అంతవరకే గోపీవిన్నాడు. ఆ తర్వాత గోపీ పశువుల పాక దగ్గరకు వెళ్ళి వెక్కి వెక్కి యేడ్వసాగాడు. తనని ఎవ్వరూ ఎందుకు అర్థం చేసుకోరని అతడి బాధ.

ఒకరికి తమ కూతురి పెళ్ళి ముఖ్యం అయితే మరొకరికి కుటుంబ మర్యాద ముఖ్యం. తమ యిల్లు దీపకాంతులతో కొత్త కోడలి నడకలలో కలకలలాడాలని తల్లిదండ్రుల ఆశ. కాని తన గుండెకైన గాయం గురించి ఎవ్వరికీ అక్కరలేదు.

తన పరిస్థితి గురించి తానే స్థిరంగా ఆలోచించి, చివరకు గోపీ ఒక దృఢ నిర్ణయానికి వచ్చాడు. సమాజాన్ని ప్రపంచాన్ని దృష్టిలో ఉంచుకొని అతను పెళ్ళి చేసుకొనేందుకు నిశ్చయించుకొన్నాడు. తన గుండె గాయం మాయం అయి, వదిన జీవితంలో ఆనంద పవనాలు విచేరీతిలో వివాహం చేసుకొంటాడు. ఇది అతడి దృఢ నిర్ణయం.

మరునాటి సాయంకాలం తల్లి దండ్రికి పాదసేవ చేస్తున్నవేళ, వదిన పూజగదిలో పారాయణం చేసుకొంటున్నప్పుడు గోపీ వెళ్ళి ఆమె వెనుక నిలిచాడు. ఆమె తదేకంగా తన్మయంగా రామాయణం చదువుకొంటోంది.

"ఏ హి తన్‌సతీ భేంటే అబ్ నాహి" ఆమె ఈ పంక్తినే పదే పదే పఠిస్తోంది. అప్రయత్నంగానే ఆమె కళ్ళనుంచి నీళ్ళు జలజలరాలాయి. గోపీ హృదయం ద్రవించింది. అతని కళ్ళనుంచి బాష్పకణాలు జాలువారాయి.

కొంతసేపైనాక వదిన చీరచెంగుతో కళ్ళు ఒత్తుకొని దేవుడి పాదాల మ్రొక్కింది. చరణామృతం సేవించి, లేచి నిలచి విచిత్రావస్థలో తన ఎదురుగా నిలిచిన మరిదిని చూసి విభ్రాంతయింది. మరుక్షణంలో ఆశ్చర్యంగా కనురెప్పలు ఆడించింది. జైలు నుంచి తిరిగి వచ్చాక యింతవరకు వదిన వైపు కళ్ళెత్తి నేరుగా చూడలేకపోయాడతను. అలాంటిది ఏకాంతంలో కలుసుకొనే ప్రసక్తేలేదు. ఆమె చకిత హరిణంవలె మరిదిని మరొకసారి చూసి ప్రక్కనుంచి వెళ్ళిపోవాలని ప్రయత్నించింది. మొత్తం ప్రాణశక్తిని కూడదీసుకొని గోపీ ఆమె చీరచెరగు పట్టుకొని నిలిపాడు.

ఆమె అటాక్ అయి "గోపీ !" అని మాత్రం అంది. గోపీ ముఖం సన్నగా ఒణికింది. జ్వలిస్తున్న ఆవేశంలో అతను "వదినా ! ఈ జరుగుతున్నదాన్ని యింక నేను చూడలేను" అన్నాడు. అతని స్వభావం ఆమెకు బాగా తెలుసు. ఒక్క మాటతో మొత్తం తన ఉద్దేశ్యాన్ని చెప్పేస్తాడు. చెప్పింది చేస్తాడు. అతని ఆంతర్యాన్ని ఆమె గ్రహించింది. దుఃఖమ్లానమై, వివశతాగ్లానమైన ఆమె కళ్ళలో క్షణంసేపు ఆనందకిరణం మెరిసి మాయం అయింది. అంతలోనే దుఃఖతిరేకంతో యిలా అంది.

"నా నుదుటి వ్రాత యిలా ఉంది" అని దుఃఖాన్ని అదుపు చేసుకొందుకు పళ్ళతో పెదాన్ని అదిమిపెట్టింది.

"నాకవేం తెలివు వదినా ! నేను దుఃఖం గురించి, నా వదిన గురించి ఆలోచిస్తున్నాను. మనిద్దరం కలిసి ఈ దుఃఖ జీవితాన్ని గడపలేమా ? గాయపడి శూన్యం అయిపోయిన రెండు హృదయాలు కలిసి క్రొత్త ప్రపంచాన్ని సృష్టించుకోలేరా ?" గోపీ ఈ మాటలు అని వదిన వైపు సూటిగా చేశాడు.

ఆమె ఒక చల్లటి శ్వాస విడిచింది. ఆమె ముఖంపై ఆశానిరాశల వెలుగు నీడలు క్షణంసేపు తారట్లాడాయి.

"అలా ఎప్పుడూ జరగలేదు" అని మాత్రం అందామె.

"కాని యిప్పుడు జరుగుతుంది. జరగాలి. అసాధ్యం అనే మాటని నేను అంగీకరించను. మనం కలసి జీవించడం తప్ప వేరే మార్గం లేదు. నువ్విలా ఉండడాన్ని నేను క్షణం కూడా భరించలేను". గోపీ సూటిగా అని తలదించుకొన్నాడు.

అతడి హృదయ నైర్మల్యం ఆమెకి తెలియనది కాదు. అతడి హార్దికస్నేహం ఆమెకు బాగా పరిచితమైనదే. అతడి మీది నమ్మకంతోనే ఆమె యింతవరకు బ్రతుకు నెట్టుకు వచ్చింది. కాని తమ వివాహం అసంభవం అనే ఆమె భావిస్తోంది. మరి యివాళ గోపీయే తన నిర్ణయాన్ని చెప్పినప్పుడు ఏం చెప్పాలి ? ఇది ఆమెకు సంకట పరిస్థితి. ధైర్యం చేసి మరిది చెప్పిన మాటకు తాను సమాధానం చెప్పలేకపోయినట్లయితే అతడి ముందు చిన్నతనం అనిపించదూ ? ఇలా ఆలోచిస్తోంది ఆమె.

వదిన స్నేహార్ద్రత తన పట్ల ఆమె అభిప్రాయాలు అతనికి తెలుసు. ఆమె సహానుభూతి అతనికి తెలుసు. కాని ఆమె పరిధి గురించి కూడా అతనికి

తెలుసు. ఈ మాటని చెప్పడంతో తమ మధ్య యిన్నాళ్ళుగా ఉన్న స్నేహబంధం చెడిపోతుందేమో ? అప్పుడు తాను ఈ స్నేహాన్ని కూడా పోగొట్టుకొన్నవాడవుతాడు - ఇవి గోపీ వూహలు.

"మన సమాజం ! మన సంప్రదాయం ..... కుటుంబం, మీ అమ్మా నాన్నా యిది జరగనివ్వరు" అందామె అతికష్టం మీద.

"అవన్నీ నాపై వదిలేయ్. నేను నడవాలనుకొంటున్న బాట వెంట నువ్వు వస్తావా ? రావా ? చెప్పు" అని గోపీ అంతవరకు తన చేతివేళ్ళ కొనల మధ్య ఉన్న ఆమె చీర చెరగును గుప్పిట బంధించి "నీ నిర్ణయం మీదే నా జీవన్మరణ సమస్య ఆధారపడి ఉంది" అన్నట్లు ఆమె కళ్ళలోకి చూశాడు.

ఆమె పెదాలు ఒణికాయి. మనసులో మాట పెదాలపై నర్తిస్తోంది. కాని లక్షసార్లు ప్రయత్నించినా మాటలు పెగలలేదు. ఆమె ద్వంద్వస్థితి హృదయం మీదనుంచి ముఖంపై నీడలు పరిచింది. తన శారీరక, మానసికస్థితిని అదుపు చేసుకొంటూ ఆమె తలవంచుకొని నిలిచింది. గోపీకి జవాబు లభించింది. ఆమెను దగ్గరగా లాక్కొని కౌగలించుకోవాలన్నంత భావావేశం అతనికి కలిగింది. కొద్దిగా ఆమె పైటకొంగును లాగాడు గూడ, కాని మరులప్తలో ఆ కొంగును వదిలి అక్కడ నుంచి బయటకు వెళ్ళిపోయాడు.

ఆమె హృదయ దౌర్బల్య విహ్వలత ఉపశమింప జేసుకొనే వుద్దేశ్యంతో దేవుడి పాదాలచెంత వాలి "భగవాన్ ! భగవాన్ ! ఇది నిజమా ?" అనుకొంది.

xx xx xx

గోపీ తల్లిదండ్రుల దగ్గరకు వచ్చి నిలబడ్డాడు. ఆ యేటి పంట, మిగతా కూలిధాన్యాలు గురించి తండ్రి గోపీని వివరాలు అడిగాడు.

"ఇవాల్టితో పనులన్నీ పూర్తి అయ్యాయి" అన్నాడు గోపీ వివరాలు చెప్పాడు.

ముసలాయన ఆనందించాడు. వదిన వంటగదిలో వంట పనిలో నిమగ్నమై ఉంది.

"శుభ్రంగా స్నానం చేసిరా ! హాయిగా భోంచేద్దువుగాని" అని తండ్రి గోపీకి చెప్పి, భార్యవైపు తిరిగి "పంట యింటికి వచ్చిందంటే రైతు యేడాది

పొడవునా పడిన శ్రమ ఫలించినట్లే. ఆ ఒక్కరోజూ అతడికి విశ్రాంతి, మనస్సు తేలికగా ఉంటుంది" అన్నాడు.

"నాన్నా."

"ఏమిట్రా ! చెప్పు సందేహిస్తావేం ?"

"నేను పెళ్ళి చేసుకొంటాను."

"ఎంత ఆనందకరమైనమాట చెప్పావురా. ఈ మాటకోసం మేమేం కళ్ళల్లో ఒత్తులు వేసుకొని ఎదురు చూస్తున్నాం. నువ్వు వూ అంటే రేపే చేసేస్తాం. పాపం ఎంత మంది ఆడపిల్లల తల్లిదండ్రులు వచ్చి కాళ్ళరిగేలా తిరిగి వెళ్ళిపోయారు ! మటరూ కూడా కొన్ని నెలల క్రితం వచ్చి నీ పెళ్ళితాను చేస్తానని చెప్పి వెళ్ళాడు. ఈ మధ్య మరిచిపోయినట్లున్నాడు. రైతుకదా ఏవో తొందరపనులు వచ్చి ఉంటాయి. గోపీ మంచి పిల్లతోనే పెళ్ళి చేస్తాను" అని గుక్క తిప్పుకోకుండా అని భార్యవైపు తిరిగి "పొలం పంట యింటికి వచ్చేస్తే రైతుకి యిక యింటి సంగతే" అని నవ్వాడు తండ్రి. తల్లి ఆనందంతో ఉక్కిరి బిక్కిరై కొడుకు ముఖానికి అంటిన పొలం మట్టిని చీర చెంగుతో తుడిచి "ఇల్లాలొస్తే ఆకలితో నీ పొట్ట నిండుతుంది. పొట్టనిండాక - "అని పకపక నవ్వుతూ ఆగిపోయింది.

"కాని ... నాన్నా ..." అని గోపీ ఆగిపోయాడు. "ఏమిట్రా ! నాన్చుతావ్, చెప్పు, మన యింట సంబంధాన్ని ఎవరు కాదంటారు. మనకేం లోటని ? నువ్వేం అసమర్థుడివీ అయోగ్యుడివా ! కొద్ది రోజుల్లోనే సంపదని పెంచగలవు. నీ మనసులో మాట చెప్పరా ! నీ సుఖ సంతోషాలు చూడాలనే నేనింకా బ్రతికి ఉన్నాను" అన్నాడు తండ్రి.

"ఔనా ! నీ సుఖం కన్న మాకేం కావాలి" తల్లి అంది. "నాన్నా ... నేను..." అనీ గోపీ చూపులు క్రిందకు దించి "నేను... నాకు వేరే సంబంధాలేం తేవద్దు. నేను వదిన్ని..."

"ఏమిటి" క్రోధ కంపిత స్వరంతో తండ్రి అన్నాడు. అతడి కళ్ళ ఎర్రబడ్డాయి. ఆ మాట విన్న తల్లి రాయివలె అయిపోయింది. ఆమె కళ్ళు ఆశ్చర్యంతో మరీ పెద్దవై పోయాయి. తండ్రి జీరపోయిన కంఠంతో యిలా హెచ్చరించాడు.

"గోపీ ! నా కంఠంలో ప్రాణం ఉండగా యిది జరగదు. ఆమె మన యింటి కోడలే కాదు. దేవత. నువ్వు, నువ్వు..."

అంటూనే గోపిని కొట్టబోయి చేయెత్తి అలానే పడిపోయాడు. తల్లి క్రోధాగ్నినిండిన కళ్ళతో గోపిని చూసి భర్తని సముదాయించసాగింది. అతడి కేకవిని వదిన వంటగది గుమ్మం దగ్గరకు వచ్చి చిత్తారువులా నిలిచింది. గోపి తలని చేతులతో పట్టుకొని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

×× ×× ××

ఆ ముసలి వాళ్ళకు గోపీ, కోడలు రెండు కళ్ళు అని లోకానికి బాగా తెలుసు.

"ఆమె మా యింటి కోడలే. కాని అది నా కంటి దీపం. పూర్వ జన్మలో నా కూతురే అయి ఉంటుంది. అందుకే యిప్పుడిలా సేవలు చేస్తోంది". అని ముసలాయన అందరితో చెప్పుకొంటాడు.

"ఆమె మా యింటి మహాలక్ష్మి. నా పెద్ద కొడుకు అదే. అదే ఈ యింటి యజమాని" అని ముసలామె పొగిడేది.

అలాంటి ఆమె గోపికి ఏం అవుతుంది ? ఆమె సుఖం గురించి ఆలోచించలేని ఈ సంఘాన్ని, ఈ యింటిని, ఈ ముసలాళ్ళని తాను ఎందుకు భస్మీపటలం చేయలేకపోతున్నాడు. ఎందుకు ఎదిరించి బయటపడలేక పోతున్నాడు. గోపికి శరీరం అంతా కంపిస్తోంది. మనస్సు కలత చెందుతుంది. అడ్డువచ్చిన అందర్నీ ఎదిరించి వదిన చేయిపట్టుకొని అక్కడనుంచి వెళ్ళిపోవాలి. ఎన్నోసార్లు పశువుల కొట్టంలోంచి యింటిలోకి వెళ్ళాలని కాళ్ళు పీకాయి. పళ్ళుబిగిశాయి. వదినని తీసుకొని తల్లిదండ్రుల గుండెలపై కాళ్ళువేసి నిర్దయగా నడిచి వెళ్ళే ధైర్యం అతనికి లేదు. అంతటి సంస్కారం అతనికి లేదు. అయినా ఏదో ఒకనాడు అలా చేయక తప్పదేమో. మరి వాళ్ళకి ఆ వయసులో ఆధారం ఎవరు ?

వివశుడై, వెర్రివాడై తిరిగాడు. ఏం చేయలేక కూలబడ్డాడు.

ఇన్నాళ్ళుగా తాను పడిన ఆశవమ్మయింది. కలలు కల్లలయాయి. తండ్రి అన్న ఒక మాట అతని ఆశాసౌధాన్ని కూల్చి వేసింది. మేడ దగ్గరకు వెళ్ళిన కాళ్ళని బలవంతంగా నరికివేశారు. ఇవాళ అతని దుఃఖానికి అంతులేదు. సమాజం కట్టుబాట్లు మర్యాద వీటన్నిటిపైన అతనికి పట్టరాని కోపం వస్తోంది.

ఉదయ సంధ్యాకాశంలో ఒంటరి నక్షత్రం వంటి ఒక యువతి జీవిత కుసుమాన్ని నిర్దాక్షిణ్యంగా నలిపి వేయాలనుకొంటున్న ఈ దుష్ట సంప్రదాయంపై అతని పిడికిలి బిగుసుకొంటోంది. ఆ నిర్దాక్షిణ్య కాపట్యాన్ని ఈ కళ్ళతో చూస్తుండవలసినదేనా ?

వికల మనుస్కుడై గోపీ కోసిన చేలవెంట, ఎండిన పంట కాలువల వెంట రాత్రి పొద్దుపోయే వరకూ తిరుగుతూనే ఉన్నాడు. మటరూ వంటి పెద్దమనిషి సాన్నిధ్యంలో ఊరట చెందాలనిపిస్తోంది. అతడే ఏమైనా చేయగలడేమో ?

"వదిన అంగీకరించింది. మటరూకి సంగతులు చెప్తే పరిష్కార మార్గం చెప్తాడు. ఆ రాత్రే అతడి దగ్గరకు వెళ్ళాలి". అనుకొన్నాడు కాని యింటి దగ్గర ఆమె కేం జరుగుతుందో అని అనుమానించి యింటిదారి పట్టాడు. చీకటి అలుముకొని ఉంది. ఆ నిశ్శబ్ద నిశీధి వేళ యింటికి చేరేసరికి లోపల్నుంచి తల్లి మాటలు కర్కశంగా, కఠోరంగా వినిపిస్తున్నాయి.

"ఎంత నీచానికి దిగజారావే ! కులభ్రష్టురాలా ! మరిదిపై కన్ను వేయడానికి నీకు సిగ్గులేదూ ! నువ్వు సతీసావిత్రి వంటి కోడలవనుకొన్నాను. ఎంత నాటకం ఆడావే ! పూజలు, పారాయణాలు, సేవాశుశ్రూషలు ఇవన్నీ నీ నాటకాన్ని కప్పి పుచ్చుకొందుకేనన్నమాట. ఈ పాపం చేయడానికి నీకు సిగ్గులేదూ ! నీ మూలానే అన్ని సంబంధాలు చెడిపోయాయి. తిరిగి వెళ్ళిపోయాయి. నీ పాపిష్టి ముఖం వాడికి కనిపించకుండా ఉంటేవాడు బాగానే ఉండేవాడు. మావగారూ, నేనూ యిలా ముసలి వాళ్ళమై మూలపడ్డాం కనక నీ నాటకాలు సాగాయి యిలా. పోవే ! కుల భ్రష్టురాలా ! ఏ నూతిలోనో, గోతిలోనే పడి చావవే! పీడ విరగడువుతుంది".

గాయపడ్డ పెద్ద పులి వలె అరుస్తున్న తల్లి మాటలు గోపీకి కర్ణకఠోరాలై వినిపించాయి. ఇంక ఆ మాటలు వినలేకపోయాడు. అతని తల పగిలిపోతోంది, ఇంకా అక్కడే ఉంటే పట్టలేని కోపంతో ఏ అఘాయిత్యానికి పాల్పడుతానో అని గోపీ అక్కడనుంచి చరచరా బావి దగ్గరకు వెళ్ళిపోయాడు. అతని హృదయంలో "హాహాకారం" సుళ్ళు తిరుగుతోంది.

xx xx xx

ఆమె ఇదివరకు ఎప్పుడూ యిలాంటి మాటలు వినలేదు. మరణాసన్న వేళ మనిషికి గతం గుర్తుకు వచ్చినట్లు ఆమె కళ్ళముందు ఇదివరకటి జ్ఞాపకాలు దృశ్యాలై నర్తించాయి.

తల్లిదండ్రుల లాలన, తోబుట్టువుల వాత్సల్యం, మన్నన పెళ్ళైనాక భర్త ప్రేమ, మరిది సరదా, అత్తమామల గౌరవం. ఇవి మాత్రమే ఆమెకు తెలుసు. ఇలాంటి మాటలు తెలీవు. ఇవాళ యింత దారుణమైన పురుష వాక్యాలు వినవలసి వచ్చింది. ఇందులో తనతప్పేంలేదు. అయినా అత్తగారు అలాంటి మాటలు అనడం ఆమె గుండెని గాయపరిచింది. హఠాత్తుగా జరిగిన ఈ పరిణామానికి ఆమె ఏడ్వలేకపోయింది. ఏమీ అనలేక పోయింది. ఆమె గుండె పగిలిపోతోంది. ప్రతి అవయవం చిట్లిపోతున్నట్లు శరీరం బాధగా మూలుగుతోంది. స్పృహ నిస్పృహ మధ్య నలిగిపోతున్న ఆమె లేచి కూర్చుంది. అత్తగారు అలా తిడుతూనే ఉంది. కానీ ఆమెకిప్పుడు అవేం వినిపించడం లేదు. "ఏ నుయ్యో, గొయ్యో చూసుకొని చావు" అని అత్తగారన్న మాట ఒక్కటే ఆమె చెవులలో ప్రతిధ్వనిస్తోంది.

ఇదివరకు కూడా యెన్నోసార్లు చచ్చిపోవాలన్న ఆలోచన ఆమెకీ వచ్చింది. కాని ఒకే ఒక ఆశ, ఒకే ఒక ఆలంబనతో యిన్నాళ్ళు నెట్టుకువచ్చింది. అసంభవమైనదే అయినా అది ఆశకద. కాని నేడు అది విరిగిపోయింది. ఇన్నాళ్ళు కనిపించిన ఆ నక్షత్రం యిప్పుడు జారిపడిపోయింది. ఇప్పుడంతా అంధకారం. చుట్టూ చిమ్మచీకటి భయంకర నిశ్శబ్దం.

గొణుక్కుంటూ, సణుక్కుంటూ అత్తగారు నిద్రపోయింది. అన్నపానాలు గురించి, ముసలాయన మందు మాకులు గురించి, గోపీ రాక గురించి, ఆఖరుకు యింటి ముందు గుమ్మం తలుపు వేయడం గురించి ఆలోచించకుండానే ఆమె నిద్రపోయింది.

అర్ధరాత్రి మరీ చిక్కబడ సాగింది. ఇంటిలో నిశ్శబ్దం ఘనీభవిస్తోంది. వాతావరణం భయం భయంగా మారుతోంది. సమస్త వస్తువులూ నిద్రిస్తున్నట్లున్నాయి. శ్వాసక్రియలు కూడా బంధింపబడినంత నిశ్శబ్దం ఆవరించి ఉంది.

అంధకార పాతాళంలో మునిగి ఉన్న ఆమెకు మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. ఏదో మత్తులో ఉన్నట్లు లేచి నిలబడింది. ఏమీ ఆలోచనలేదు.

ఆమె కాళ్ళు యాంత్రికంగా అడుగులు వేశాయి. అది ఆ యింటి ఆఖరి మెట్టు. ఆ యింటిలోకి వచ్చాక ఆమె ఎన్నడూ ఆ మెట్టుదిగి బయటకు రాలేదు. కాని నేడు ఆమె ఆనాటి యువతి కాదు. ఒక శవం బయటకు నడుస్తున్నది. అయితే ఆ క్షణంలో తానేమీ చేస్తున్నది ఆమెకు తెలుసు మత్తువంటి చేతనలోనే ఆమె నడుస్తుంది.

అవి బావి దగ్గరకు వెళ్ళే మెట్లు. ఒకటి ... రెండు ...

"ఎవరు ?" అక్కడే మెలకువగా ఉన్న గోపీ అడిగాడు.

ఆమె మత్తు వదిలిపోయింది. స్పృహలోకి వచ్చింది. భయపడిన ఆమె నూతివైపు పరుగెత్తబోయే సరికి గోపీ బలంగా పట్టుకొన్నాడు.

"వదినా ! నువ్వా !" ఆశ్చర్యంగా అడిగాడు గోపీ. ఆమె స్పృహ కోల్పోతూ అతని బాహువుల్లోకి వచ్చేసింది.

"గోపీ ! ఇదే సమయం. ఇదే జరగవలసింది. జరిగింది. ఆలోచించే సమయం లేదు. ఫూం పద !" అతని మనస్సు హెచ్చరించింది.

వదినను గోపీ భుజాలపైకి ఎత్తుకొన్నాడు. పరుగుపెట్టాడు. అంతా చీకటి, ఎక్కడా దారి కనిపించడంలేదు. అయినా గోపీ పరుగుపెడుతూనే ఉన్నాడు. దారి వెతుక్కోవడానికి యిది సమయం కాదు. దొరికినదారి వెంట వెళ్ళి పోవడమే కర్తవ్యం. ఆ చండాలురు నుంచి వదినని దూరంగా, బహు దూరంగా తీసుకు వెళ్ళాలి. అంతే అతనికి తెలుసు. అదే చేస్తున్నాడు. అంతే !

## పధ్నాలుగు

తెల్లవారడానికి యింకా చాలా వ్యవధి ఉండగానే గోపీ మరల నూతి దగ్గరకు వచ్చేశాడు. తన మనస్సుకి ఆలోచనలను స్థిరీకరించుకొనే ప్రయత్నంలో ఉండగానే అతనికి లోపల్నుంచి తల్లి కేకలు వినిపించాయి.

"అయ్యో ! కోడలు యింట్లో లేదు. అయ్యో !"

ఆ అరుపు వినిపించి కూడా గోపీ నిద్రలో ఉన్నట్లు కళ్ళు మూసుకొని ఉండిపోయాడు.

క్రమక్రమంగా వీధిలోని స్త్రీలు ఆ యింటి గుమ్మం దగ్గర గుమిగూడసాగారు. పురుషులూ వచ్చారు. గోపీని నిద్రలేపారు. హంతకుని వలె అతను మౌనంగా చూస్తుండిపోయాడు. ఎవరికీ యేమీ తెలీడంలేదు. గుసగుసగులాడుకొని ఎవరికి వారు నెమ్మదిగా నిష్క్రమించసాగారు. ఈ సంగతి ప్రక్క వూళ్ళకు పాకడం మంచిది కాదనుకొని ఎవరికి వారు ముక్కున వేలేసుకొని వెళ్ళిపోయారు. కాని యిలాంటి విషయాలు రహస్యంగా ఉండవు. వాటిని దాచడం కష్టం. పైగా ఇలాంటివి జరిగినప్పుడు చీలవలో పలవలో అల్లుకొని గోరంతలు కొండంతలుగా చెప్పుకోవడం ప్రజలకి ఒక సరదా. ఒక మాటల ఆట. అదే జరిగింది. ఈ కబురు దరోగాకి తెలిసింది. అతను వచ్చి వాళ్ళని చూసి వెళ్ళాడు. చెవులు కొరుక్కుంటున్న వాళ్ళని మందలించి వెళ్ళాడు.

గోపీ పశువుల పాక దగ్గరకు వెళ్ళిపోయాడు. తల్లి ఏడుస్తూనే ఉంది. ఆమె ఏడుపుకి కారణం అతనికి అర్థం కావడం లేదు. "సుయ్యో గొయ్యో చూసుకొని ఛావవే" అని శపించి, చీదరించుకొన్నది ఆమే. మరిప్పుడు యిలా ఏడవడం ఏమిటి ? హాయిగా ఆనందించు. సంబరం చేసుకో... నీ కుల మర్యాదని పల్లకిలో కూర్చోబెట్టి వూరేగించు అనుకొన్నాడు. అతనికి తండ్రితో దెబ్బలాడాలని ఉంది.

"ఇప్పుడు కుటుంబ గౌరవం పెరిగిపోయిందిగా మీ ఆక్రోశం ఉపశమించిందా ? హంతకుడా ! ఒక అమాయకురాలిని చంపిన పాపం మిమ్మల్ని పట్టుకొని పీడించకమానదు. అంతవరకు యీ కుటుంబ గౌరవ జపమాలని తిప్పుకొంటూ ఉండండి. కట్టుబాట్లు పుష్పమాలని ధరించి మురిసిపోండి" అని తండ్రిని తిట్టాలనుకొన్నాడు.

కాని రాత్రి జరిగిన సంఘటన అతన్ని భయంకరంగా వేధించింది. పైగా ఒళ్ళంతా అలిసిపోయి ఉంది. అందుకే అక్కడనుంచి లేవలేకపోయాడు. అయినా తల్లిదండ్రులకన్న తనేమీ తక్కువ నేరస్థుడు కాడు. ఈ సంఘటన వెనుక వాళ్ళకెంత ప్రమేయం ఉన్నదీ తనకు అంత ప్రమేయం ఉంది. ధైర్యం చేసే తల్లిదండ్రుల్ని ఎదిరించి, వదిన చేతిని పట్టుకొని ఉంటె ఆమెకి

యింత దుస్థితి దాపురించి ఉండేదికాదు. తన పిరికి తనమే యింత అనర్థానికి కారణం అయింది.

"ఒక యువతి భర్త శవానికి అంటించిన చితి మంటలు ఆమె మరణించి, భస్మరాశిగా మారే వరకూ అలా మండుతూండవలసిందేనా ? వాటిని ఆర్పే హక్కు ఎవరికీ లేదా ? అలా విషాదాంతం కారాదని తన వదిన జీవితం కాలిబూడిదై పోరాదని తాను ప్రయత్నించడం అనధికార చేష్ట ? నిర్మలమైన సహానుభూతితో తాను చేసిన ఈ ప్రయత్నానికి పర్యవసానం ఇదేనా ? ఇంక మిగిలిందేమిటి ? వదిన బూడిదైపోవడంలో విధి ఎంత ? మనిషి బాధ్యత ఎంత ? రోజా బాగుండి బ్రతికి పోయింది కాని లేకుంటే ఏం జరిగేది ?" ఈ ఆలోచన రాగానే గోపీకి దుఃఖం ఆగలేదు. "భగవంతుడా ! నీకు వేలవేల నమస్కారాలు" అనుకొన్నాడు.

"ఇలా ఎందుకు జరిగింది ? ఎందుకు ? ఎందుకు ?" అనే ప్రశ్న అతనిని వేధిస్తూనే ఉంది.

"నువ్వు నిజాయతీపరుడవి. ఖచ్చితంగా మంచివాడివి. నీ మనసు మంచిది. ప్రయత్నం చేశావ్. కాని అప్రయత్న సాఫల్యానికి అవసరమైన సాహసాన్ని నువ్వు చేయలేకపోయావ్. నీ పిరికితనమే ఆమెకింత ప్రమాదాన్ని తెచ్చి పెట్టింది. సాహసం లేని యిలాంటి సానుభూతుల పర్యవసానం యిలాగే ఉంటుంది. ఈ అగ్నిని యింకా ప్రజ్వరిల్లజేస్తుంది. మనస్సుని మండించి బూడిద చేసేస్తుంది. ఇది పిల్లల ఆటకాదు. ఆలోచించు. భావుకత అనే వ్యర్థ భావనలో బందీవి కావద్దు. భావుకత అంటే అగ్నికి వాయువుని తోడు చేయడమే. గోపీ యుగ యుగాలుగా లక్షలాది యువ వితంతవుల జీవన సింధూరాన్ని గ్రహించి ఈ చితి మండుతూనే ఉంది. సంప్రదాయం దీనికి ఆజ్యం పోస్తూనే ఉంది. ఈ వ్యవస్థతో ఒంటరిపోరాటం జరపడం తమాషా కాదు. అడవిలాంటి దానిలో ఒక కొత్త బాట వేయడం సులభం కాదు ? ఆలోచించు. లే సాహసం చెయ్యి" అని అతనికి మనస్సులో హెచ్చరిక వినిపిస్తోంది.

ఓటమిని అంగీకరించడం కలలోకూడా సహించని గోపీ మరల తన సాహస ప్రదర్శన చేయాలని సంకల్పించుకొన్నాడు. ఇది అతని ప్రవృత్తికి మరొక సవాలు. సరిగా ప్రతిస్పందించక పోయినట్లయితే వదిన జీవితం నిలువునా కాలిబూడిదైపోతుంది. ఆ రోజున మొదటగా జోఖా మల్లచరిచి సవాలు

చేశాడు. ఇది రెండవ సవాలు. ఈ ప్రపంచంలో ఎవ్వరినీ లక్ష్యం పెట్టని ఉద్ధతిని రక్తంలో వేడిని మరల యివాళ గోపీ అనుభవానికి తెచ్చుకొన్నాడు.

xx xx xx

నూతిలో అంతా వెతికించారు. అనుమానం ఉన్నచోటల్లా అన్వేషింపజేశారు. ఫలితం లేకపోయింది. ఇక ఆమెపై రకరకాల వ్యాఖ్యానాలు సాగాయి. కట్టుకథలు ప్రచారం అయాయి. తోటి స్త్రీలే ఆమె శీలంపై దుర్భాషలాడారు. ముసలవాళ్ళందరూ "కలికాలం బుద్ధులు" అని నిందించారు. సమవయస్కులు ఆ కబుర్లు చెప్పుకొని ఆనందించారు. ఎవరేం అనుకొన్నా గోపీ మౌనంగానే విన్నాడు. గండిపడ్డాక వరదకారు ఎంతకాలం ఆగుతుంది !

రోజులు గడిచాయి. లోకం ఎప్పటిలాగానే నడుస్తోంది. ఒకనాటి రాత్రి గ్రామం అంతా నిద్రపోతున్నవేళ గోపీ యింటి తలుపు చప్పుడైంది. ఎవరో వచ్చారు. ముసలాయనికి నిద్రపట్టలేదు. చిరాకుగా కళ్ళు తెరచి "ఎవరూ!" అన్నాడు.

ఆగంతకుడు లోపలకు వస్తూ "ఇంకా నిద్ర పోలేదా ? బాబాయ్ !" అన్నాడు.

"అరె ! మటరూ ! నువ్వా !" ముసలాయన అని "కోడలు వెళ్ళిపోయిన నాడే నిద్ర కూడాపోయింది. ఇలా చచ్చినట్లుపడి ఉంటున్నాను. ఆమెలా మాకు సేవ చేసే వారెవరున్నారు ? ముసలిది చేయగలిగినంత సేవ చేస్తూనే ఉంది. రా ! మటరూ ! కూర్చో ! చాలా రోజులైంది వచ్చి. ఎన్ని కష్టాలు వచ్చి పడ్డున్నాయో చూశావా ? ఇంకా ఏం అనుభవించాలో !" అన్నాడు ముసలాడు.

గోడకి ఆనుకొని కూర్చుంటూ మటరూ "అన్నీ సర్దుకొంటాయి. మీరేం బాధపడకండి. ఈ యింటి కష్టాల్ని గట్టు ఎక్కించాలనే నేనింతకాలం తిరిగాను. మంచి సంబంధం దొరికేవరకూ మీ యింటికి రారాదని రాత్రింబవళ్ళు వెదికాను. నా స్వభావమే అంత. ఏం చేయను ఇంకమారదు. గంగమ్మతల్లి ఒడిలో గాలి, నీరు, అన్నం తిని బ్రతికిన జీవం కద. ఇంతే. పైగా జమీందార్లతో పోరాట మాయే. న్యాయంకోసం, నా హక్కు కోసం ఆరాటం. కోర్టేమో పొలాల్ని జప్తు చేయమన్నదట. అక్కడ ఏం ఉంది ?

అంతా గంగమ్మ నీరు. వచ్చే ఏడాదీ ఏంజరిగినా మాకూ కొంత వెసులుబాటు. ప్రాణాలైనా యిస్తాంకాని జమీందార్లని అక్కడ కాలు పెట్టనివ్వం. ఈ పోరాటం కొన్ని సంవత్సరాలే సాగుతోంది. గంగమ్మతల్లి కృప వలన మేమే నెగ్గుతాం. న్యాయం హక్కు మావైపున ఉన్నాయి. కపటం, మోసం, జులం ఎన్నాళ్ళు సాగుతాయి. పైగా మటరూ ఒంటరి వాడుకాడు. వేలాదిమంది రైతులు కూడా ఉన్నారు. భూమితల్లి కోసం ప్రాణాలిస్తారు. ఈ గొడవల్లో పడి రాలేకపోయాను. వరద వచ్చింది. గుడిసెని ఆ వైపు వేసుకోవలసి వచ్చింది. ఇక్కడి సంగతులేవిటి ? చాలా రోజులైంది కబురు తెలిసి" మటరూ అన్నాడు.

"మాకెంతో ఆసరాగా ఉండేది" అన్నాడు ముసలాడు.

"ఆ సంగతి విన్నాను" మటరూ అన్నాడు.

"ఏం చెప్పను మటరూ ! ఆమె జ్ఞాపకానికిరాని రోజులేదు. కంటిలో నీళ్ళు ఆరిపోయాయి. ఇంక నే బ్రతకలేను అన్నాడు ముసలాయన."

అలాఅనద్దు. గోపీకి మంచి సంబంధం నేను తెస్తాను. ఆ పిల్ల ఒక్కతే మీ కోడళ్ళిద్దరి స్థానాన్ని భర్తీ చేస్తుంది. మీరు బాధ పడకండి" మటరూ వూరడిస్తూ అన్నాడు.

"గోపీ ఒప్పుకోవాలిగా వాడు మాపై కోపగించి ఉన్నాడు. మాతో మాట్లాడడమే లేదు. నీ దగ్గర దాచడం దేనికి ! వాడు వదిననే పెళ్ళి చేసుకోవాలనుకొన్నాడు. అదెలా సాధ్యం చెప్పు. ముసలామె ఏదో అందని ఆమె యిల్లు వదిలిపోయింది. ఏమైందో అసలు బ్రతికి ఉందో లేదో తెలిదు. వాడికి అదంటే అంత యిదని మాకేం తెలుసు. ఇప్పుడువాడి కోపం తగ్గడం లేదు. తల్లిదండ్రులకి కొడుకుకన్న ఎవరెక్కువ చెప్పు. మాకేం. నలుగురైదుగురు పిల్లలుంటే అది వేరే సంగతి. వాడొక్కడేకద. బంధువులు అన్నం పెడతారా ? స్నేహితులు కనిపెట్టుకొని ఉంటారా ?నా కన్న కూతురే వెళ్ళిపోయినంత వెలితిగా ఉంది. వాడిని ఒప్పించగలవాడివి నువ్వే ?"' ముసలాయన భారంగా అన్నాడు.

"నే చెప్తాగా, నా మాట వింటాడు. నన్ను తన అన్నగారి కన్న యెక్కువగా మన్నిస్తాడు. మీరేం బాధపడకండి" అన్నాడు మటరూ.

"ఇంతకీ పిల్ల ఎవరో చెప్పలేదు" ముసలాయన అన్నాడు. "మా యింటి పిల్లే. మరదలు అనుకో. జాతకం వేయించాను. మంచి యోగ జాతకురాలు.

బుద్ధిమంతురాలు. రూపంలో, రంగులో అచ్చం గోపీ వదినగారివలె ఉంటుంది. ఏమీ తేడా ఉండదు. అచ్చు గుద్దినట్లు ఉంటుంది. గుణం కూడా అంతే. అన్ని పనులూ చేయగలదు. మీకు చక్కటి సేవలు చేస్తుంది. మీరే చూస్తారుగా. పెద్ద కోడలే మళ్ళీపుట్టి యిలా వచ్చిందా ? అనుకొంటారు. ఆమెని చూసి గోపీకి అంత చక్కటి అమ్మాయిని తేగలనా అనుకొన్నాను. దైవ ఘటన, అచ్చం అలాంటి అమ్మాయే దొరికింది. రెండో పెళ్ళి చేయడానికి వాళ్ళు అంగీకరించలేదు. పిల్ల అంత గుణవంతురాలు. గుణవంతురాలు అయినా నేను చెప్పానని వాళ్ళు ఒప్పుకున్నారు. నా మాట ఎవ్వరూ కాదనరు. మీరేం అడిగితే ఆ కట్నకానుకలు యివ్వాలని గట్టిగా చెప్పాను. మీరేం అడగాలని అనుకొంటున్నారో అడిగేయండి" మటరూ వివరించి చెప్పాడు.

"ఆ గొడవలన్నీ మాకెందుకూ ? గోపీతో మాట్లాడు. వాడి ఆనందం, సుఖం మాకు ఆనందం సుఖం అంతే. వాడు పెళ్ళాడాలి. ఈ యింటి కోడలు దీపం వలె మసలాలి. నువ్వు గోపీని ఒప్పించు. ఇంక ఆలస్యం వద్దు" ముసలాయన తొందర చేశాడు.

"ఆ భయం ఏంవద్దు. ఇవిగో తాంబూలం మిఠాయి. ఐదువందలు" అని మటరూ అంత వరకూ తన చేతి సంచిలో ఉంచిన వాటిని తీసి ముసలాయన చేతిలో ఉంచాడు.

"పురోహితుడు, బాజాలు మంత్రాలు ..." ముసలాయన ఉక్కిరి బిక్కిరవుతూ అన్నాడు.

"అవన్నీ మీరు చేసుకొందురు కాని. నేను రాత్రి అతిథిని. తెల్లవారితే గంగమ్మతల్లి దగ్గర ఉండాలి కదా ! అస్తమానం వచ్చి వెళ్ళే అవకాశం లేదుకదా. ఈ తాంబూలం తీసుకొంటే మీరు గోపీని ఒప్పించడం సులభం. ఇంక అతను తప్పించుకోలేడు. నా పని సులభం అవుతుంది. మీ ఆవేదన తీరుతుంది. నేను గోపీ చెవిన ఈ మాట వేసి వెడతాను. జై గంగమ్మతల్లి !" అని మటరూ లేచాడు.

xx xx xx

గోపీ మంచంపై పడుకొని శూన్యంగా చూస్తున్నాడు. మటరూ వచ్చి అతని భుజం చరిచి "ఏవిటోయ్ ! నీ పెళ్ళికోసం నేనింత రాత్రి గంగ దాటివస్తే నువ్వు నిమ్మకు నీరెత్తినట్లున్నావ్ ?" అన్నాడు.

"అటువెళ్ళి మాట్లాడుకొందాం" అని గోపీ లేచి పశువుల కొట్టం వేపు నడిచాడు.

"ఇక్కడైతే ఏం! నువ్వు తల్లినీ తండ్రినీ శత్రువులుగా మార్చేసుకొన్నావా?" అంటూ మటరూ అనుసరించాడు. ఇద్దరూ కొట్టంలో ప్రవేశించారు. గోపీ తలుపు వేశాడు. "నా పెళ్ళా ?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"గోలచేయకు, నన్ను నాపని చేయనియ్యి" అని మటరూ తన కుడిచేతి ఉంగరాన్ని తీసి ఏదో మంత్రం చదివి, గోపీ నుదుట తిలకం వంటిది అద్దాడు.

"ఇదేమైనా ఆట అనుకొంటున్నావా" గోపీ అడిగాడు. "ఆట అని నువ్వు అంటున్నావ్ ! సాహసికులకు అతికష్టమైన పనులు కూడా ఆటలవలెనే ఉంటాయి. పిరికి వాళ్ళకి తేలిక పనులు కష్టం అనిపిస్తాయి. గోపీ ! నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుసా ! మటరూతో. మటరూ అంటే దేనినీ కష్టం అనుకోని సాహసికుడు. కష్టాలతోనే బంతి ఆటలు ఆడేవాడు. అంచేత పిచ్చి పిచ్చి మాటలు మాట్లాడకు. ఒకటి అనుకొంటే చేసి తీరుతాను. నువ్వు నావాడివి. నీ సుఖ సంతోషాలు నాకు కావాలి. అది మాకివ్వలేకపోతే యిద్దర్నీ గంగమ్మతల్లికి నైవేద్యం పెట్టేస్తాను. ఓ సోదరుడు, సోదరి పోయారనుకొంటాను" అన్నాడు మటరూ భావావేశంతో.

గోపీ ఆనందాతిరేకంతో ఉక్కిరి బిక్కిరై అతని ఒడిలో వాలిపోయాడు. మటరూ అతని నడుము మీది రాస్తూ సముదాయిస్తూ యిలా అన్నాడు.

"గోపీ ! నేను ఉండగా నీ కెలాంటి కష్టంరాదు. రానివ్వనులే. నా మాటవిను. సమయం తక్కువగా ఉంది. నేనీ రాత్రి వెళ్ళిపోవాలి".

మటరూ గోపీని లేవనెత్తి ముంగురులు సవరించి "గోపీ ! సిసవన్ ఘాట్ దగ్గర నా నావ ఉంటుంది. అక్కడ వాళ్లకి నే చెప్తాను. వాళ్ళు నిన్ను నా దగ్గరకు తీసుకువస్తారు. ఇబ్బంది ఏమీ ఉండదు. నేను మీ నాన్నకి తాంబూలం యిచ్చి తిలకం పెట్టి లాంఛనం పూర్తి చేశాను. ఆయనతో గొడవ ఏం ఉండదు. నువ్వు రేపు పట్టు పంచె కట్టుకో. మిఠాయిలు పంచిపెట్టించు. ఆచారం ప్రకారం పెళ్ళికొడుకువై మా ఇంటికిరా. ఊరేగింపులు, జనం హడావుడి ఏం వద్దు. ఏదైనా పెట్టుకోవాలంటే స్వల్పంగా తీసుకురా. గంగమ్మ కోపంగా ఉంది. వరద ప్రమాదం. నా చెల్లెలి పెళ్లి ఏ లోటూ లేకుండా జరగాలి. నీ మనస్సులో ఎలాంటి ఆలోచనలు పెట్టుకోకు. మటరూకి గంగమ్మ తల్లి అన్నీ యిస్తుంది. ఆమె దర్బారులో ఎలాంటి లోటూ ఉండదు.

మటరూ గౌరవం పెరిగేలా అన్నీ జరుగుతాయి. నా మాటలన్నీ గుర్తుంచుకో అన్నీ శుభప్రదంగా జరుగుతాయి జాగ్రత్త" అని హెచ్చరించాడు.

"వదిన ఎలా ఉంది ?" గోపీ గద్గద స్వరంతో అడిగాడు. మటరూ నవ్వాడు.

"ఇంకా ఆమె నీకు వదినేనా ? పెళ్ళికూతురు అనాలి తెల్సిందా ? బాగుంది. హాయిగా ఉంది. గంగమ్మతల్లి గాలి పీల్చి నీరు త్రాగితే అన్ని లోపాలు ఉపశమిస్తాయి. ఇప్పుడామె అలాగే ఉంది. నువ్వు చూస్తే ఆశ్చర్య పోతావ్." అని మటరూ అతని నుదిటిపై ముద్దుపెట్టుకొని లేచాడు. గోపీ అతని పాదాలు స్పృశించాడు.

"బావగార్ని మంచి చేసుకొంటున్నావన్నమాట" అని మటరూ వేళాకోళం చేశాడు. గోపీ సిగ్గుతో తలవంచుకొన్నాడు. మటరూ అతన్ని కౌగలించుకొని తృప్తిగా విశ్వసించాడు.

## పదిహేను

కంటి చీకటి వదలకుండానే ముసలాయన పాలేరుని తొందర చేశాడు.

"పురోహితుణ్ణి పిలుచుకు రారా !" అని.

"ఏటి బాబయ్యా ! ఎవరైనా చుట్టాలొస్తున్నారా ? చిన్నయ్యకి పెళ్ళా ?" అన్నాడు పాలేరు.

"ఔన్రా ! పెళ్ళే ! నువ్వెళ్ళి త్వరగా పిలుచుకురా" పాలేరు వెళ్ళాడుకాని అలాంటి సుఖ సమయంలో ఉండవలసినంత వేగం, ఉత్సాహం వాడిలో కనిపించలేదు. ఆమె ఆ యింటి నుంచి వెళ్ళిపోయినప్పటి నుంచి వాడికి శాంతిగా లేదు. గోపీ వచ్చినప్పటి నుంచి అతడామెను చూడనేలేదు. పొలం పనులు, పశువుల పనులు గోపీయే దగ్గరుండి చేయిస్తున్నాడు. ఇద్దరూ ఒంటరిగా కలిసినప్పుడు యెన్నోసార్లు ఈ సంగతి ప్రస్తావిద్దాం అని ప్రయత్నించాడు. మాటలు పెదాల వరకు వచ్చి ఆగిపోయేవి. తన

తడబాటును చూసి గోపీ అడిగేవాడు కూడా, కాని చెప్పే ధైర్యం అతనికి లేదు. ఆమె స్త్రీ కనుక ధైర్యం చేసి ఒకనాడు చెప్పేశాడు. కాని గోపీ విషయం అలాకాదు. అతను కోపగిస్తే చాలా ప్రమాదం. పాలికాపు పనిలోంచి తీసేసినా తీసేయగలడు. పైగా రాజపుత్రుల పగ, పట్టుదల చాలా వూహించ లేకుండా ఉంటాయి. కోడలు యింటిలోంచి పారిపోయినప్పుడే అతనికి ఈ సంగతి బాగా అనుభవానికి వచ్చింది. అందుకే ముసలాళ్ళని 'శాపనార్థాలు' పెట్టుకొంటూ ఉండిపోయాడు తప్ప ఏం మాట్లాడలేదు.

చిన్నమ్మ అంటే వల్లమాలిన గౌరవం, అభిమానం ఆమె యిల్లు వదిలి వెళ్ళిపోయినప్పటి నుంచి దిగులుగా ఆలోచిస్తూనే ఉన్నాడు. ఎక్కడకు వెళ్ళిందీ ! ఎం కష్టాలు పడుతోందో ? ఎవరైనా ఆశ్రయం ఇచ్చారో ! లేదా, ఇల్లు విడిచి బయటి ముఖం ఎన్నడూ చూడలేదు. అయినా ఈ ప్రపంచం ఆమె గురించి మరిచిపోయింది. ఏమీ జరగనట్లే అందరూ ప్రవర్తిస్తున్నారు. ఇంట్లో పెళ్ళి పనులు జరుగుతున్నాయి. పెళ్ళి బాజాలు మ్రోగుతాయి, పెళ్ళి ఆనందంగా అవుతుంది. ఎంత తమాషా ఈ లోకం ! తమ సుఖసంతోషాల కోసం యితరుల దుఃఖాన్ని, కష్టాన్ని ఆలోచించనే ఆలోచించరు ఈ మనుషులు !

పురోహితుణ్ణి తీసుకొని పాలేరు యింటికి వచ్చేసరికి అక్కడ బాజా భజంత్రీల వారున్నారు. కొందరు ఇరుగుపొరుగువారు చేరారు. ఎవ్వరు పిలిచి చెప్పకుండానే అక్కడ పెళ్ళి సంబరం అవతరించింది.

"పిల్ల ఎవరూ, తల్లి దండ్రులెవరూ, ఏ వూరు ? వంశ మర్యాద ఏమిటి ? రాత్రికి రాత్రివచ్చి తాంబూలాలు యిచ్చి ఎందుకు వెళ్ళిపోయారు ? ఎందుకు ఆగలేదు. ఇలా యెక్కడైనా జరుగుతుందా ?" ఇలాంటి గుసగుసలుసాగాయి.

ఒక్కవైపున గోపీ మౌనంగా నిలబడి ఉన్నాడు. గోడ ఆసరాగా కూర్చున్న ముసలాయనతో కొందరు మాట్లాడుతున్నారు. పురోహితుడు రాగానే ముసలాయన తన దగ్గరకు పిలిచి మంచంపై కూర్చోబెట్టి యిలా అన్నాడు.

"పంతులుగారూ ! నేనేం గుడ్డివాడిని అనుకొంటున్నారా నా వంశ మర్యాద కుటుంబ గౌరవం తెలియని సంబంధం చేసుకొంటానాని వీళ్లందరూ యేవేవో నాకు జ్ఞాపకం చేస్తున్నారు. కళ్యాణం ఘడియ వచ్చేసింది. మటరూ ఆగే అవకాశం లేదన్నాడు. పెళ్ళికూతురు అతని మరదలట ! ఎన్నోసార్లు వీళ్ళకు

చెప్పాను, అయినా వినిపించుకోరే ! ఏవేవో అనుమానాలు ! గుసగుసలు ! అనారోగ్యంగా ఉన్నానని వీళ్ల మాటలు, ఆటలు సాగుతున్నాయి. మేం ఏవిటో, మా వంశం ఏమిటో వీళ్ళు మరిచిపోయినట్లున్నారు."

"కలికాలం బాబూ ! పెళ్ళి అంటే కొన్ని పద్ధతులు ఉన్నాయి. కట్టుబాట్లు ఉన్నాయి" ఒకతను అన్నాడు.

ఆ సమయంలో ఎవరి పక్షం వహించాలో పురోహితుడికి బాగా తెలుసు. ఎవరివైపు వుంటే లాభసాటిగా ఉంటుందో అతనికి తెలుసు. అందుకే పురోహితుడు గంభీరంగా యిలా అన్నాడు.

"మిత్రులారా ! మీరేం మాట్లాడుతున్నారో ! మీకే తెలియడం లేదు. శాంతించండి. అవసరాన్ని బట్టి ఆయా ఏర్పాట్లు చేసుకొనే అవకాశాలను భగవంతుడే మనకు ప్రసాదించాడు. వివాహ సమయానికి పెళ్ళి కొడుకు అనారోగ్యంతో ఉన్నట్లయితే ఒక చెంబుతో వివాహం జరిపించే ఆచారం కూడా మనకి ఉన్నది. సమయాన్ని, సందర్భాన్నిబట్టి మనం సర్దుకుపోవాలి. ఏదో అనివార్య పరిస్థితివలన మటరూసింగ్ యిక్కడ ఉండలేకపోయినంత మాత్రాన ఈ ముహూర్తాన్ని ఆపివేయడమేనా ? కుదరదు. దానిని సంప్రదాయం అంగీకరించదు. ఈ తంతు నడిపి తీరాల్సిందే."

"అది సరేనండి. ఇది లగ్నం కాదుగా, లగ్నం యింకా అయిదారు నెలలుంది. ఫాల్గుణంలో పెళ్ళి. అంచేత యీ ఆపద్ధర్మ సూత్రాలు కుదరవు" అన్నాడొకాయన.

"ఎలా కుదురుతుంది. వాళ్ళ దగ్గర తాంబూలం తీసుకొన్నాను. అది తిప్పి పంపివేయనా అని" ముసలాయన గద్దించి అడిగాడు.

"ఇది వరకు చాలా సార్లు యిలా జరిగింది కద."

"వాళ్ళకు నేను జవాబులు చెప్పాను."

"ఐనా యిదేం హరిశ్చంద్రుడి సత్య యుగమూ కాదు" మూడవ వారెవరో అన్నారు.

ఇంక ముసలాయన భరించలేకపోయాడు. ఆయన కంపించి, గర్జిస్తూ యిలా అన్నాడు.

"ఎవర్రా ఆ మాట అన్నది నాలుక చీరేస్తాను. నాకు అబద్ధం ఆడవలసిన పనిలేదు. ఒరే గోపీ ! నీ తండ్రికి అవమానం జరుగుతోంటే అలా నిమ్మకు నీరెత్తినట్లు ఉంటావేరా ? నేనేం అబద్ధం ఆడానా ?"

అక్కడి జనంలో కలకలం చెలరేగింది. కోలాహలం వ్యాపించింది.

"లేవండి రా ! ఈయన చేత తిట్లు ఎవరు తింటారు. ఇది సంప్రదాయ విరుద్ధం. మనం వెళదాం పదండి. ఈయన నోటిలో నోరు పెట్టి ఎవరు నెగ్గుకు రాగలరు" అని ఎవరికి వారు కదలసాగారు. పురోహితుడు వాళ్ళని ఆపాలని చేసిన ప్రయత్నం ఫలించలేదు. ముసలాయన ఈసారిమరీ ఉక్రోషంగా అన్నాడు.

"వెళ్ళండి ! మీరు లేకపోతే ఈ శుభకార్యం ఆగిపోతుందా ? పంతులు గారూ ! పూజకి ఏర్పాట్లు చేయండి. వీళ్ళతో మనకేవిటి ? వీళ్ళ మాటలకి లెక్కేమిటి ? నేనెప్పుడూ ఏం వచ్చినా ఒంటరిగానే ఎదుర్కొన్నాను. వీళ్ళు మీ మాట కూడా ఖాతరు చేయలేదు. వీళ్ళ గురించి పట్టించుకోవద్దు. మనకు పోయిందేమీలేదు. నాకు కొంత ఖర్చు తగ్గుతుంది. ఎవరూ లేని వాళ్ళకి దేవుడే ఉన్నాడు. ఎవరో లేరని ఎవరి పనులు ఆగిపోయాయి చెప్పండి."

"ఔనయ్యా ! మనకు భగవంతుడే ఉన్నాడు." అని పురోహితుడు పూజకి ఏర్పాట్లు ప్రారంభించాడు.

ఈ తంతు అంతా చూసి అందరికన్నా ఎక్కువగా ఆనందించినవాడు పాలేరు. ఈ ఇరుగుపొరుగువారి భయంవల్లనే చిన్నమ్మ బ్రతుకు బుగ్గయింది. వీళ్ళగోలే లేకపోతే ఆమె హాయిగా ఉండేది. ఒక ప్రత్యర్థిని జయించానన్న ఆనందం ఆతడిది. పట్టరాని సంతోషం అతనిది.

పూజాదికాలు పూర్తిఅయి, పురోహితుడిని పంపివేశాక గోపీ పాకలో ఒంటరిగా కూర్చుని ఆలోచించాడు. ఇది ఒకందుకు మంచిదే. ఈ గండు పిల్లుల గోల తప్పింది. సంప్రదాయ వాద మూర్ఖుల మహాపర్వతం తనంత తాను కూలిపోయింది. ఆ సమయంలో అతని దగ్గరకు పాలేరు వచ్చి కూర్చున్నాడు.

"చిన్నయ్యా ! వాళ్ళు పారిపోవడం నాకు ఆనందంగా ఉంది." అంటూ పాలేరు గోపీ వేళ్ళు విరవసాగాడు.

"ఎందుకు ?" గోపీ ఆశ్చర్యంగా అడిగాడు. "అలా అంటారేటి బాబూ ఈ కాకిమూక జనానికి భయపడేగా బాబూ చిన్నమ్మగారు ఎళ్లిపోయారు. ఈళ్ళ భయమే లేకపోతే అ యమ్మ యిక్కడే ఉండేవారుగా."

"నిజం చెప్పావురా !" ఏదో కోల్పోయిన వాడిలా గోపీ అన్నాడు.

"చిన్నయ్యా నీకు వీళ్ళ భయం ఉందా ?"

"ఉంది."

"కాని యివాళ మీరు మీ యీ బంధువులతో తెగతెంపులు చేసేసుకొన్నారు కద. ముందే యిది జరిగి ఉంటే చిన్నమ్మ యిల్లు వదిలేవారా ? ఈ ఇల్లు యిలా చీకటై పోయేదా ?" పాలేరు బావురమన్నాడు.

వాడి ప్రశ్నకి గోపీ అదిరిపడ్డాడు. ఈ పాలేరు కూడా యింత సంస్కారంగా మాట్లాడగలడని అతను వూహించలేకపోయాడు. అయోమయంగానే పాలేరు వైపు చూశాడు.

"అయమ్మయెలాగుందో ! ఎక్కడ ఉందో ? ఆమెని చూడాలని ఉంది చిన్నయ్యా ! గుర్తొచ్చినప్పుడల్లా కన్నీళ్ళే !" అని పాలేరు మరీ బేలగా మాట్లాడాడు.

గద్గదకంఠంతో గోపీ అరె ! ఏడుస్తున్నావా ? నీకులాంటి మనసునే దేవుడు అందరికి యివ్వాలి. నీలాంటి అభిమానాన్ని యివ్వాలి. అప్పుడు లోకంలో యీ దుఃఖం ఉండదు. నువ్వేం మాట్లాడకు అంతా శుభమే జరుగుతుంది" అన్నాడు.

"చిన్నయ్య ! చిన్నమ్మగారికి మీతో పెళ్ళి జరిగితే ఎంతో బాగుండేది అనుకొనేవాడిని. మీ ఇద్దరికీ మంచి జంట. ఈ కులం వోళ్ళ భయం లేక పోతే నువ్వు చిన్నమ్మని పెళ్ళాడేవాడివా ?" అన్నాడు పాలేరు.

గోపీ మనసు విహ్వలం అయింది. పాలేరు చేతిని తన చేతులలో నిమిరి, వాడికళ్ళు తుడిచి "నువ్వు చాలా మంచివాడివిరా. వెళ్ళు పొద్దుట్నుంచి నువ్వు యింటికే వెళ్ళలేదు. నీ కోసం మీ ఆవిడ వెతుకుతూ ఉంటుంది. వెళ్ళు, అంతా మంచి జరుగుతుంది" అని సముదాయించాడు.

## పదహారు

ప్రకృతి యేం చేయాలనుకొంటే అది జరుగుతుంది. ఎన్నో అడ్డంకుల వలెనే, జమిందార్ల కుట్రలవలెనే యీసారి కూడా రైతులకు గడ్డు సమస్య ఎదురయింది. వరద నీరు తీసింది. ఈసారి గంగమ్మతల్లి అక్కడ పాయలు

తీసి అటు ఒకటి ఇటు ఒకటి ప్రవహిస్తూ మధ్యన పెద్ద లంక ఏర్పడింది. రెండు గట్ల మధ్య కొండలా కనిపించసాగింది ఆ లంక. దీనికోసం యీ సారి కొట్లాట, సంఘర్షణ జరుగుతాయని మటరూ భావించసాగాడు. అందుకు తగిన సన్నద్ధతతోనే అతను ఉన్నాడు. రెండు పాయలుగా ప్రవహిస్తున్న గంగమ్మతల్లి తనకు లక్షలాది శత్రువులనుంచి రక్షణ యిస్తున్నట్లు మటరూ ఆనందించాడు.

నది మధ్యలంకపై మొదటగా మటరూ గుడిసె వేసుకొన్నాడు. క్రమంగా చూస్తుండగానే యెన్నో గుడిసెలు వెలిశాయి. ఈ ఏడాది రైతులెవరూ అక్కడ వ్యవసాయం చేయరని భావించిన జమిందార్ల అంచనాలు తారుమారయ్యాయి. గగ్గోలు యెత్తారు. ఠాణాలు, తహసీళ్ళు జిల్లాలలో కలకలం రేగింది. ఇంకా ఆలస్యం చేస్తే తమ పూర్వ వైభవం అంతరించి పోతుందని ఆ భూములపై శాశ్వతంగా తను ఆధిపత్యం పరిసమాప్తం అవుతుందని వారు భయపడ్డారు. ఏదో ఒకటి చేయాలని వారు సంకల్పించారు. ఇదే ఆఖరి పోరాటం అయి, గెలుపో, ఓటమో తేలిపోవాలని జమిందార్లు తీర్మానించుకొన్నారు.

లంకమట్టిపైకి తేలింది. చాలా చోట్ల యింకా బురద ఉంది. అంతా గట్టి పడడానికి చాలా సమయం పడుతుంది. ఇరు వైపులా ప్రవాహం బాగా వడిగానే ఉంది. విత్తనాల సమయం మించిపోతుంది. అయినా నేల అనుకూలం కాలేదు. ఆలస్యం అయితే నారు వేసినా ఉపయోగం ఉండకపోవచ్చు. మటరూ విచారించసాగాడు. ఈ ఏడాది ఖాళీ చేతులతోనే నిష్క్రమించాలా అని రైతులు బాధపడసాగారు.

ఫూజన్ పొలం మటరూ పొలానికి చాలా దూరంలో ఉంది. అతడు యేవేం ఆలోచించక ధాన్యం జల్లాడు, అవి మొలకెత్తాయి. ఆ ఆనందంతోనే ఫూజన్ "మటరూ ! ఈ ఏడాది ధాన్యం వేస్తే" అని సలహ యిచ్చాడు.

"ఈ రోజుల్లోనా ?" అన్నాడు మటరూ. అప్పుడు తన ప్రయోగం గురించి చెప్పి ఫూజన్ యిలా అన్నాడు.

"విన్నావో లేదో బెంగాల్, మద్రాసుల్లో రకరకాల ధాన్యాల పంటలుంటాయట. ఇప్పుడు మన భూములు కూడా ధాన్యం పంటకు ఉపకరిస్తాయనిపిస్తోంది. మనకి నీళ్ళకు యిబ్బంది లేదు. అదే నెలలతరబడి

పంటకాదు. అంచేత వరివేసి చూడు. ఏమీ పండలేదనుకో అనుభవం వస్తుంది. పండిందనుకో కొత్త సంగతి తెలిసివస్తుంది."

ఆ మాటలు విని మటరూ అతనితో వెళ్ళి అతడి పొలం, అక్కడి వరి చూసివచ్చాడు.

"నిజం చెప్పావ్ నీ మాటే నిజం అనిపిస్తోంది," అని ఫ్రూజన్‌ని అభినందించి మటరూ తన సహరైతుల్ని సమావేశ పరచాడు. తర్జన బర్జనలు జరిపారు. చివరకు అందరూ ఆ ఏడాది అక్కడ వరి వేయడానికి తీర్మానించుకొని పనులు ప్రారంభించారు.

×× ×× ××

ముహూర్తంలోగా ఒకసారి వచ్చి వెళ్ళమని మటరూ చెప్పినా యింత వరకూ గోపీ రానేలేదు. పడవ వాళ్ళు ఏ కబురు చెప్పనే లేదు. ఫాల్గుణ శుద్ధనవమి ముహూర్తం పెళ్ళి ఊరేగింపులో పది, పదిహేను మందికన్న అతిథులు ఉండరు. బంధువులు వాళ్ళతో భోజన బంధాలు తెగతెంపులు చేసుకొన్నారు. అంచేత సమస్యలేం ఉండవు.

ఒకనాడు ఆమె (వదిన) మటరూని అడిగింది.

"అన్నయ్యా ! నువ్వు తన్ని రమ్మని చెప్పావేమో ?"

"అవును"

"కాని రాలేదు. నీతో అబద్ధం చెప్పారా ?"

"అబద్ధం చెప్పడు. ఎలా రాగలడు ?"

"ఏం ?"

"పెళ్ళికి ముందు అల్లుడు అత్తగారింటికి వస్తాడా ?"

"ఛా అన్నయ్య ! వేళా కోళం ! నాకు రాత్రి పగలూ భయంగా ఉంటోంది."

"ఏం ! పెళ్ళి కొడుకు ఎలా ఉంటాడో ! గేదెలా నల్లగా ఉంటాడా? పులిలా భయంకరంగా ఉంటాడా అనా ?"

"అవును... మొదటిసారి చూడడంకద."

"అయితే."

"ఏమవుతుందో అని వాళ్ళకి ఎలాంటి మర్యాదలు చేయాలా ? ఎలాంటి సమాధానాలు చెప్పాలా ? అని."

"నీ భయం నాకు తెల్సమ్మా ! ఇదంతా పెద్ద తమాషా అని మేం అనుకొంటున్నాం అని నీ ఉద్దేశ్యం కాని చూడమ్మ ! ఇది నుయ్యి కాదమ్మా ! గంగమ్మతల్లి సన్నిధి. నూతిలో పడి మరణిస్తే నరకం వస్తుంది. గంగమ్మతల్లిలో లీనం అయితే వైకుంఠానికి వెళతారు. ఏం భయం లేదు. నే చూసుకొంటాగా" అని మటరూ పగలబడి నవ్వాడు.

"అన్నయ్యా ! నన్ను మీరు అలాగా చేయనివ్వలేదు. ఇప్పుడు మరల వాళ్ళు ఎదురు పడితే ఎలాంటి ప్రమాదాన్ని, అవమానాన్ని ఎదుర్కోవాలో అని నాకు భయం. అంతకన్న మరణించడమే సులభం" అంది ఆమె గంభీరంగా.

"ఏవిటమ్మా ! మళ్ళీ అదేమాట ! ఇంతటి అన్నయ్య ఉండగా నీ కింకా భయం పోలేదన్నమాట. పిచ్చిపిల్ల ! ఇక నువ్వు కొత్త యిల్లు కొత్త జీవితం గురించి ఆలోచించాలి. రెండు రకాల ఆలోచనలు వద్దు. ధైర్యంగా ఉండాలి. ధైర్యంలేనిదే ఏమీ చేయలేము. సాహసం లేనిదే అర్థంలేని యీ సంప్రదాయాన్ని బద్దలు కొట్టలేమమ్మా !"

"ఏదో విచిత్ర బంధంతో మీరంతా నన్ను బంధించారు."

"ఇలాంటి బంధాలు లేనిదే మనిషి బ్రతుకేం ఉందమ్మా ! చిన్నప్పుడు ఒక కథ విన్నాను. ఆ కథలో ఒక దేవత ఉండేది. ఆ దేవతకి ఒక పాప అంటే యిష్టం. ఆ పాప చనిపోయింది. అంతే దేవత కూడా మరణించింది. నేనూ అంతేనమ్మా ! ఈ అపరంజి చెల్లి లేకపోతే బ్రతకగలనా ?" అన్నాడు మటరూ.

"అన్నయ్యా ! ఇంకెప్పుడూ అలాంటి మాట అనకు" అందామె.

"మరి నువ్వు కూడా యింకెప్పుడూ పిచ్చి పిచ్చి మాటలు మాటలాడవద్దు. చూడమ్మా ! బ్రతుకు బ్రతకడానికే. పరిస్థితులతో పోరాడి విజయం సాధించడానికే. అదే జీవితం. మనస్సును కించ పరచుకొని ప్రపంచంలో ఏం సాధించలేం." అని మటరూ ఆమెను సముదాయించి ధైర్యం చెప్పాడు.

"నేను మగవాడినయితే !" అందామె వెలితిగా.

"కాదు స్త్రీగా పోరాడి విజయం సాధిస్తే ఈ ప్రజలందరికీ నువ్వు నా చెల్లెలవని చాటి చెప్పుకొంటాను. ధైర్య సాహసాలలో మగవాళ్ళకి నా చెల్లెలు ఏమీ తీసిపోలేదని చెప్తాను."

"నీ దగ్గర ఉంటే ఎలాంటి భయం లేదా."

"గంగమ్మతల్లి నీడన ఉంటే ఎవరికి ఏ భయం ఉండదు. ఈ మట్టి ఈ గాలి అలాంటివి. మీ వదిన కూడా మొదట ఎంతో భయపడింది. కాని ఇక్కడ ఉండడం అలవాట్లై అన్ని భయాలు పోగొట్టుకొంది."

"అది సరేకాని నాతోబాటు మీరు కూడా కొన్నాళ్ళు మా దగ్గర ఉండాలి" అందామె.

"ఏం గోపీమీద నమ్మకం లేదా ?"

"ఉంది. కాని నీ మీద ఉన్నంత విశ్వాసం లేదు."

ఆ మాట విని మటరూ తన భార్యని పిలిచాడు.

"చూశావా ! ఈమె నీకు సవతి అవుతోంది" అన్నాడు. "ఇలాంటి సవతి వస్తే మాలవేసి కౌగిలించుకొని స్వాగతం చెప్తాను. అయినా చెల్లెలితో ఏవిటి వేళాకోళం ?" అని పాలచెంబు అందించింది. ఆమె ఆ చెంబును మటరూకి ఇచ్చింది. మటరూ గడగడ తాగేశాడు.

"వెళతాను. ఇంకా చాలా పనులున్నాయి. లగ్నం దగ్గర పడుతోంది. ఫూజన్‌ని పట్నం పంపిస్తాను." అని గంగమ్మతల్లిని తలచుకొంటూ మటరూ వెళ్ళిపోయాడు.

xx xx xx

గంగా తీరం అంతా ధాన్యం రంగులో మెరవడం చూసి రైతుల ఆనందం పొంగలు వారింది. చేతినిండా కోతలపని. గుడిసెలనిండా ధాన్యం. రబీ పంట వేయలేదన్న అసంతృప్తి యిప్పుడు వాళ్ళల్లోలేదు. అంతకన్న యెక్కువే ధాన్యం దిగుబడి వచ్చింది. గంగమ్మతల్లి లీలలు అపూర్వాలు. ఆమె ఒడిలో యేమేం ఉన్నాయో చెప్పడం, అంచనా వేయడం బహుకష్టం. ఈ భూమికి ఎంతో సేవ చేస్తే అంత ఫలితాన్ని ఈ తల్లి యిస్తుంది. శ్రమ ఎప్పుడైనా వృథాగా పోయిందా ?

పట్నం నుంచి తిరిగివచ్చిన ఫూజన్ తన సామాన్ల సంచిని అక్కగారి ముందుంచాడు. ఆమె మటరూకి ఉపాహారం పెడుతోంది. ఆమె (గోపీ వదిన) ఒక మూల గోధుమలు చెరుగుతోంది.

"సంచి విప్పిచూడు. ఏమేం తెచ్చాడో !" అని మటరూ తన భార్యని పురమాయించాడు. ఆమె ఆ ప్రయత్నంలో ఉండగానే "నువ్వు కూడా రామ్మా ! లేకపోతే మీ వదినే యివన్నీ దాచేసుకొంటుంది" అని ఆమెను పిలిచాడు.

ఆమె కూడా వచ్చి నిలబడే సరికి మటరూ భార్య సంచిలోంచి సామాను బయట పెట్టసాగింది.

వాటిలో మెరిసే వెండి నగలున్నాయి. వాటిని చూడగానే మటరూ భార్య ముఖం వికసించింది. ఒక్కొక్కటీ పైకెత్తి చూడసాగింది. గోపీ వదిన మాత్రం తలవంచుకొని వాటిని చూస్తూ ఆనందమగ్న అయింది.

కడియాలు, పాంజేబులు, వంకీలు - అన్నీ రెండేసి జతలున్నాయి.

"ఇన్ని ఎందుకు తెప్పించారు ?" అని భర్తని మటరూ భార్య అడిగింది.

ఎందుకేమిటి ? ఈ యింట యివి పెట్టుకొనే వాళ్ళు యిద్దరున్నారు." అన్నాడు మటరూ.

"నా కోసం ఎందుకు కొన్నావ్ ?" అంది గోపీ వదిన.

"అన్న యింటి నుంచి చెల్లెలు బోసిగానే అత్తవారింటికి వెళ్తుందా ? ఎవరైనా చూస్తే ఏమంటారు. చూడమ్మా ! నాకు ఆడపిల్లలు లేరు ! ఇప్పుడు నువ్వొచ్చావ్," అని మటరూ భార్య వైపు తిరిగి "ఇంక పిల్లలు పుట్టే అవకాశం లేదు. నాకు ఆడపిల్ల సరదా తీరనేలేదు. పాపం మీ వదిన కిలాంటి కానుకొవ్వాలని ఎంతో ఆశ ఉండేది. నీ మూలాన ఆ సంబరం తీరింది" అన్నాడు.

అదే సమయంలో ఒక రైతువచ్చి "మటరూ ఫూల్‌చంద్‌ని అరెస్టు చేశారట. నీకు కబురు చెప్పమని ఎవరో వచ్చారు" అని ఒక రైతు కేకవేశాడు.

ఆ మాట వింటూనే మటరూ ఒక గెంతున వీథిలోకి వచ్చాడు. బయట చాలమంది రైతులు వున్నారు. అందరి ముఖాలపై విహ్వలత, ఆందోళన కనిపిస్తున్నాయి. చివరికి ఆ వార్త తెచ్చిన ఆసామీ యిలా చెప్పాడు.

"ఇవాళ మధ్యాహ్నం పడవ మీంచి గ్రామంలోకి వచ్చిన ఫూల్‌చంద్‌ని అరెస్టు చేశారని వాడి నాన్న చెప్పాడు. జబ్బుతో ఉన్న తల్లిని చూడాలని వాడు

వచ్చాడు. మధ్యాహ్నం పదిమంది పోలీసులు వచ్చి వాడిని తీసుకువెళ్ళారు. మొత్తం వందమందిపై వారంట్లున్నాయట. వెతుకుతున్నారు. జమీందార్లు లంక భూముల వ్యవసాయంపై యీ మడత పేచీ లేవదీశారట."

ఆ మాట విని అందరూ నిశ్శబ్దం అయిపోయారు. జమీందార్లు ఏదో ఒక ఎత్తువేస్తారని వాళ్ళందరకూ తెలుసు కాని యింత హఠాత్తుగా వారంట్లు తెస్తారని వూహించలేదు. ఆలోచించి మటరూ యిలా అన్నాడు.

"నావలన్నింటిని యిటువైపు తెచ్చేయండి. ఆ గట్టువైపు ఒక నావని కూడా వుంచవద్దు ఇటు నుంచి అటు వెళ్ళే నావలకి హెచ్చరికలు చేయండి. ఎవ్వరూ గ్రామాలలోకి వెళ్ళరాదని చెప్పండి. అందరూ లాఠీలు సిద్ధం చేసుకోండి. ప్రతి ఒక్కరూ జాగ్రత్తగా ఉండాలని హెచ్చరించండి. ఒక్క నావని మాత్రం సిస్‌వన్ ఘాట్ నుంచి కబురు తీసుకు రావడానికి అక్కడ ఉంచండి. ఫూల్‌చంద్ భార్యా పిల్లలు ఎక్కడ ఉన్నారు ?"

"ఇక్కడే గుడిసెలో ఉన్నారు. ఏడుస్తున్నారు."

"వాళ్ళని వూరడిద్దాం పదండి" అని మటరూ ముందంజ వేస్తూ "సిస్‌వన్ ఘాట్ దగ్గరకు తెలివైనవాడు వెళ్ళాలి. గ్రామాలలో వాళ్ళు కూడా అన్ని విధాలా సిద్ధంగా ఉండాలని సమాచారం యివ్వాలి. ఇంక యిప్పుడు జమీందార్లు రక్తపాతానికి వెనుకాడరు. అల్లకల్లోలం సృష్టిస్తారు." అని హెచ్చరిక చేశాడు.

## పదిహేడు

రెండవ రోజున ఆ లంక మీది గుడిసెలన్నింటిని తీసేసి అడవిలో వేసేసు కొన్నారు. తీరాల వెంట యువకుల కాపలా ఏర్పరిచారు. ప్రతిరోజూ పోలీసులు గ్రామాలను తనిఖీ చేసి వెడుతున్నారని వార్తలు అందుతున్నాయి. తామిక్కడ ఉండగా ఎవరికీ ఏ భయం లేదని అందరూ ధీమాగా ఉన్నారు. ఈ కోటలోకి వచ్చిన ఏ శత్రువూ తప్పించుకొని ప్రాణాలతో బయట

పడలేదని వాళ్ళకి తెలుసు. ఎవరూ తమ సమీప గ్రామంలోకి వెళ్ళడం లేదు. నిత్యావసర వస్తువుల్ని ఈ వైపున గల పట్టణం నుంచి తెచ్చుకునే ఏర్పాట్లు చేసుకొన్నారు. పంట చేతికి వచ్చేసింది. అంచేత యిబ్బంది లేకుండా గడుస్తోంది. గంగానది నీటిపాయలు అలాగే ప్రవహిస్తున్నాయి. గాలి అలాగే హాయిగా వీస్తోంది. పంటచేలు అలాగే ఆకుపచ్చటి అందంతో మెరుస్తున్నాయి.

కాని మటరూ మాత్రం విహ్వలుడై ఉన్నాడు. జీవితంలో యెన్నడూ యింత విహ్వలుడుకాని అతను సోదరి పెళ్ళి గురించి కంగారుగా ఉన్నాడు. ఎప్పుడు యెలాంటి విఘ్నం వస్తోందా అని భయం అలాంటిదేం రాకుండా శుభకార్యం జరిగి పోవాలని ఆరాటం. అతను యిప్పుడు అనుక్షణం "గంగమ్మ తల్లీ ! ఈ గండాన్ని గట్టెక్కించు. ఈ పడవని ఒడ్డుకు చేర్చు" అని ప్రార్థించుకొంటూనే ఉన్నాడు.

కూతురు, చెల్లెలు భారం అంటే ఏమిటో అతనికి యిప్పుడు తెలుస్తోంది. అన్నం సరిగా సహించడంలేదు. ఏది త్రాగినా రుచించడం లేదు. భార్యా, ఆమె ఏం అడిగినా మటరూ "ఏమో ! ఏమిటో ఏం బాగా ఉండడంలేదు. చెల్లెమ్మ పెళ్ళై వెళ్ళిపోతే ఈ గుడిసె బోసిపోతుంది కదా." అని వూరుకొంటున్నాడు.

"అయితే ! పెళ్ళి చేయకు, ఆపేయ్". భార్య పరిహాసంగా అన్నది.

"ఏం చెప్పను, రాఘుకులరీతి - సదాచలి ఆయీ" అని గొణుక్కొంటూ మటరూ అక్కణ్ణుంచి బయటకు వెళ్ళి పచార్లు చేస్తూ "గంగమ్మ తల్లీ ! నన్ను ఒడ్డెక్కించు" అని ప్రార్థిస్తున్నాడు.

బిడ్డ ఆర్తిని తల్లి గ్రహించింది. ఆతడి ప్రార్ధనని ఆమె ఆలకించింది. ఏ విఘ్నాలు లేకుండా ఆ రోజు రానే వచ్చింది. సాయంత్రం అయి అవుతుండగానే సిస్వన్ ఘాట్ దగ్గర పెళ్ళివారు దిగారు. బాజా భజంత్రీలు లేరు కాని పురోహితుడు, మంగలి, మరొక ఐదుగురు ఉన్నారు. రేవు దాటడానికి వచ్చిన వారెవలె గోపీ పెళ్ళిబృందం వచ్చారు. అయినా ఆ రాత్రంతా అడివిగాలి షెహనాయిలా ఊస్తూనే ఉంది. రైతులతో గొంతు కలిపి గంగమ్మతల్లి కెరటాలుతో పెళ్ళిపాటలు పాడుతూనే ఉంది. విందు వినోదాలు సాగాయి. అందరికీ కల్లు బాగా పోశారు. అదే వివాహ వేడుక.

చిన్న చిన్న పిట్టలు, పెద్ద పెద్ద పక్షులు ప్రభాత గీతికలు వినిపిస్తున్న వేళ అప్పగింతలు, వీడ్కోలు సంబరం ప్రారంభం అయింది.

ఆమె మటరూ భార్యని కౌగిలించుకొని అలా విలపిస్తూనే ఉంది. కొన్ని సంవత్సరాల క్రితం తన తల్లిని విడిచి వెళ్ళిననాటి స్థితి అది. తర్వాత పిల్లల్ని పరామర్శించింది. ఆపై ఫ్యూజన్ దగ్గర సెలవు తీసుకొంది. తిరుగు ప్రయాణపు ఏర్పాట్లలో మటరూ అటూ ఇటూ ఎక్కడా నిలవకుండా తిరుగుతున్నాడు. ఎందుకో అతను భయపడుతున్నాడు. చెల్లెలు తనకు పాదాభివందనం చేసి నమస్కరించినప్పుడు తానేమి చేయాలో అతనికి అర్థం కావడం లేదు.

పల్లకీ గుమ్మం దగ్గరకు వచ్చింది. వీడ్కోలు ముహూర్తం రానే వచ్చేసింది. అన్నగారికోసం చెల్లెలు నిరీక్షిస్తోంది. ఇక అతను తప్పించుకోలేడుకదా.

అతను గుండెని రాయి చేసుకొని నిలుబడ్డాడు. ఆమె అతనికి నమస్కరించి అలా కళ్ళనీళ్ళతో ఉండిపోయింది. ఆమెను పైకి లేవదీయాలని మటరూ భార్యా ప్రయత్నించింది. మటరూ స్థాణువై ఉండిపోయాడు. విషాద సాధపు ఏ అంతస్థులో అతడు ఉండిపోయాడు ఎవరికి తెలుస్తుంది !

ఆఖరుకు అతనే ఆమెను లేవనెత్తాడు. కళ్ళనీళ్ళు తుడిచాడు. ఆమె అతని భుజంపైవాలి "నువ్వు రావా ?" అని అంది.

"ఏవిటమ్మా ! మీ అన్నయ్య పై వారంటు ఉంది కద" అంది మటరూ భార్య. మటరూ నిస్సహాయంగా చూస్తుండి పోయాడు. పెళ్ళికూతురు తలపైకెత్తి దుఃఖ గాద్గదికతను అదుపు చేసుకొంటూ "నాతో రానక్కరలేదు అన్నయ్యా ! కాని ఈ చెల్లెల్ని మరిచిపోకు. తల్లినీ, తండ్రినీ, సోదరుల్ని అందర్నీ పోగొట్టుకొని నీ శరణుకు వచ్చాను. నువ్వు నన్ను మరిచిపోతే నేనెలా బ్రతకగలను" అంది.

"అంత బెంబేలు పడకమ్మా ! నిన్ను మరిచిపోయి నేను మాత్రం ఎలా ఉండగలను. ధైర్యంగా ఉండాలి" అని యింకేం అనలేక మటరూ నెమ్మదిగా ప్రక్కకు తప్పుకొన్నాడు.

రేవు వరకూ గోపీ వెంట ఉండి మటరూ అతనికి ఎన్నో సంగతులు చెప్పాడు. గోపీ అతనికి భరోసా యిచ్చాడు. కాని మటరూకి సంతోషం కలగడంలేదు. అతని చెవులలో ఆమె అన్నమాటలే గింగురు తిరుగుతున్నాయి.

"నీపై ఉన్నంత విశ్వాసం అతని పై లేదు."

పడవ ప్రయాణం సాగిస్తోంది. పిల్లలు పెద్దలు, రైతులు వారి గృహిణులు తీరం వెంటనుంచి వీడ్కోలు యిచ్చారు. ఉదాసీనంగా చూస్తున్న మటరూ అల్లంత దూరాన తన చెల్లెలికి స్వాగతం యివ్వడానికై సిద్ధం అవుతున్న తుఫాను కనిపిస్తోంది. ఆమెతో తాను ఎందుకు వెళ్ళలేదు ?

xx xx xx

ఇంటికి తిరిగి వచ్చిన మటరూ ఉదాసీనంగా ఉండిపోయాడు. ఇల్లంతా కళావిహీనంగా, ఉత్సాహ విహీనంగా ఉంది. పాలపాత్రలపై, వంటపాత్రలపై ఈగలు ముసురు కొంటున్నాయి. అలిసిపోయిన అతని భార్య కూడా అలా పరుండి పోయింది. చెల్లెలితో బాటు "ఎందుకు వెళ్ళలేకపోయానా ?" అని అతను మధన పడుతూనే ఉన్నాడు.

చాలా సేపటి తర్వాత ఆమె లేచింది. అలా కూర్చుంటే యింటి పనులు, వంట పనులు, పొలం పనులు ఎలా అవుతాయి. ఆమె మటరూ దగ్గరకు వచ్చి "లేవయ్యా ! స్నానం చేసిరా ఇలా ఎంతసేపుపని ఉండిపోతావ్ ?" అని మందలించింది.

"అదిసరే ! చెల్లెలితో ఎందుకు వెళ్ళలేకపోయాను. పాపం ఆమెకి అక్కడ ?" మటరూ ఆగిపోయాడు.

"గోపీ మగాడు కాదేవిటి ?" ఆమె కసిరినట్టు అడిగింది.

"మగాడే ! కాని తల్లినీ దండ్రినీ చూడాల్సిన బాధ్యత ఉందిగా. నాకేదో భయంగా ఉంది. అతడు పిరికి వాడైపోయి నిభాయించుకోలేకపోతే నా చెల్లెలు గతి ఏమిటాఅని. నేను వెళ్ళి ఉండాల్సింది."

"ఏదైనా జరిగితే కబురు వస్తుంది. ఇంక లేచి ముఖం కడుక్కొని రా. ఎంత పొద్దుపోయిందో చూశావా ? ఎక్కడ పని అక్కడే ఉంది." అని అతని దుప్పటి లాగిపారేసి, చేతికి చెంబు అందించింది.

మొత్తంమీద తనను తాను సంభాళించుకొని మటరూ లేచి గంగానది ఒడ్డుకు వచ్చాడు.

ఇవాళ గంగా తీరాన ఆ ఆనందం లేదు. అలాంటి అనుభవం అతనికి జీవితంలో అదే మొదటిసారి. నేడు గంగమ్మతల్లి కూడా ఉదాసీనంగా ఉంది.

ఆ ప్రవాహంలో ఆనంద వేగం లేదు. ఆ తరంగాలలో ఉద్వేగం లేదు. ఏదో వెలితిగా ఉన్నట్లు అంతా ఉదాసీనంగా ఉంది.

"అన్నయ్యా ! నీ దగ్గర ఉంటే ఎలాంటి భయమూలేదు. కాని అక్కడకు తిరిగి వెళితే ఎలాంటి విపత్తు వస్తుందో అని భయం. కొన్నాళ్ళు నువ్వూ నాతో ఉండరాదూ ! నీపై ఉన్న నమ్మకం అతనిపై లేదు." మటరూ మనసులో యీ మాటలే తిరుగుతున్నాయి. అన్నీ తెలిసి ఉండే తాను తన గారాల చెల్లిని కష్టాల బోనులోకి పంపాడా ? మరి తానెందుకు ఆమెతో వెళ్ళలేదు. ఒంటరిగా ఎందుకు పంపించినట్లు ? ఇది విశ్వాస ఘాతకమా ? అని అతని మనస్సు కలవరపడుతూనే ఉంది.

మరి వారంటే ఇక్కడ తనకున్న కర్తవ్యం. ఎక్కడైనా తనకేదైనా అయితే యిక్కడ తన అనుచరుల పరిస్థితి ఏమవుతుంది ? వాళ్ళు యిప్పుడు యిదివరకటి వలె మూర్ఖులుకారు. కాని వాళ్ళకాళ్ళపై నిలబడడం యింకా నేర్వాలి. మటరూ ఎంతకాం వాళ్ళ వెంట ఉండగలడు ! అతనికి యిదివరకు ఒకటే కర్తవ్యం. ఇప్పుడు రెండు బాధ్యతలు. రెండుచోట్ల అతనికి సమాన శత్రువులు ఉన్నారు. ఒకరి కుట్రలో యిరుక్కొని వందలాది మంది రైతులు యిబ్బంది పడుతున్నారు. రెండవ వారి ఈర్ష్యకి చెల్లెలు ఎర అయింది. ఆమెవంటి అభాగినులెందరో యిలాంటి పంజరాలలో బందీలై ఉన్నారు. వీళ్ళందరికి ఒక వెలుగు మార్గం అవతరించాలి.

గట్టుమీద కూర్చుని యిలాంటి రకరకాల ఆలోచనలు చేస్తున్న మటరూ దగ్గరకు ఫూజన్‌వచ్చి "అక్కయ్య పిలుస్తోంది పద. ఎంతసేపిక్కడే కూర్చుంటావ్" అని మటరూ తడిపి పడేసిన ధోతి, చెంబు తీసుకొన్నాడు.

నడుస్తూ నడుస్తూ "ఫూజన్ ! ఓ మాట !" అన్నాడు మటరూ.

"అడుగు" అన్నాడు ఫూజన్.

"నేను లేకపోతే మీరు యివన్నీ నిభాయించుకోలేరా ?" "మరి నువ్వెలా ఉండగలవు ? గంగమ్మతల్లి నిన్ను వదులుకొంటుందా ?"

"నన్ను విడిచి పెట్టదు. కాని నేను లేననుకో ..."

"ఎలా అనుకోగలను ?"

"అబ్బ ! అదికాదు. గంగమ్మతల్లిని నేనే విడిచి పెట్టలేను. కాని పోలీసులు నన్ను పట్టుకొన్నారనుకో అలా ..."

"ఇంక అలా జరగదు. ఇదివరకైతే నువ్వు ఒంటరివి. ఇప్పుడు వందలాది మంది యువకులు నీకోసం ప్రాణాలివ్వడానికి సిద్ధంగా ఉన్నారు. మా ప్రాణాలు పోయినా నీకేం జరగనివ్వరు. నువ్వే భూమికి ప్రాణానివి."

"నిజమే,కానీ..."

"ఇంక అలాంటి స్థితి రానేరాదు."

"నీతో మాట్లాడ్డం కష్టం. నేను చనిపోయాననుకో."

"బావా !" "ఫ్రూజన్ అదిరినట్లు కేక వేశాడు." ఎందుకలాంటి మాటలంటావ్ ?" అన్నాడు.

మటరూ గంభీరంగా యిలా అన్నాడు.

"ఫ్రూజన్ ! గంగమ్మతల్లి ఈ నేల, ఈ పొలాలు, ఈ గాలి, ఈ నీరు, ఈ అడవి, ఈ రైతులు, నా స్నేహితులు అంటే నా భార్యా పిల్లలకన్నా నాకు ఎక్కువ ప్రేమ, వాత్సల్యం. ఇవి లేని నేను లేను. కాని నేను పోతే, లేకుండాపోతే ఏమవుతుందనే ఆలోచన యివాళ వచ్చింది. స్వార్ధపరులైన జమిందార్లు ఈ భూమిపై మళ్ళీ అధికారం స్థాపించుకోరుగా."

"అలా జరగదు. అదే జరిగితే నీ స్నేహితులు, అనుచరులు తమ రక్తపు ఆఖరు చుక్క వరకు అర్పించి దీనిని రక్షించుకొంటారు. గడిచిపోయిన రోజులు తిరిగి రానట్లే మరల ఈ జమిందార్లు యిక్కడ అధికారం చెలాయించే ప్రసక్తి లేనేలేదు. మన శక్తి రోజురోజుకూ పెరుగుతోంది. మన అనుయాయుల సంఖ్య పెరుగుతోంది. కాలం ముందుకు నడుస్తోంది. సమాజం ముందంజ వేస్తోంది. అంచేత నువ్వనుకొన్నట్లు ఏమీ జరగదు. ఇక్కడి ప్రతి రైతూ ఒక మటరూ వలె తయారవుతున్నాడు. నువ్వేం భయపడక్కరలేదు."

"శహభాష్ ! నాకీవేళ యెంతో ఆనందంగా ఉంది. ఎంతెంతో ఆనందంగా ఉంది, బాగుంది." మటరూ భావోన్మాదుడై అన్నాడు. అతని ఉదాసీనత అంతరించింది. ముఖం యిదివరకటి వలె ప్రకాశించింది. కళ్ళల్లోకి కాంతి చిమ్మింది.

కాని యింటికి రాగానే మరల ఉదాసీనత వరించింది. అతని భార్య మంచినీళ్ళ చెంబు అక్కడ పెట్టి "రొట్టె తిందువుగాని రండి" అని పిలిచింది.

మటరూ కంచం ముందు కూర్చుని రొట్టె ముక్క విరిచి "తినాలనిపించడం లేదు" అన్నాడు.

"చెల్లెలి బెంగ పోలేదుగా" అందామె.

"అదికాదు."

"మరి ?"

"ఈపాటికి యిల్లు చేరి ఉంటుంది ?"

"ఆమెకి ఏదో జరుగుతుందని బెంగ ! ఏం జరుగుతుంది. పండితులు, ముల్లాలు, మాళ్విలు ఏం చెప్పినా, ఏం చేసినా గోపీ ఆమె వైపు ఉన్నంతవరకు ఏం భయంలేదు ఏమీ జరగదు" అంది మటరూ భార్యా ధీమాగా.

"నిజమే, కాని యిది దుష్ట సమాజం. ఎందరో గోపీలను యిది నిర్దాక్షిణ్యంగా అదిమి వేసింది. గోపీ కొంచెం బలహీనుడు. అతనే పూర్తి ధైర్యవంతుడై ఉంటే ఈ కథ యింత పాడుగుసాగేదా ? ఎప్పుడో సుఖాంతం అయేది. ఆ రోజున గోపీ ఆ నూతి దగ్గర మెలకువగా ఉండబట్టి కాని లేకపోతే యి కథ ఎలా ఉండేదో ! ఏం ఉండేది ! ఆ రోజున తల్లి నానామాటలు అంటున్నప్పుడు గోపీ ఆమె చేయిపట్టుకొని ఉంటే యీ కథ అక్కడే వివాహంతం అయేది. కాని అతను అలా చేయలేకపోయాడు. పురుషుడుపై ఒకసారి నమ్మకం జారిపోతే స్త్రీకి మరల ఆ ధైర్యం రావడం, నమ్మకం కలగడం చాలా కష్టం. చాలా సమయం పడుతుంది. "అన్నయ్యా ! నీపై ఉన్న నమ్మకం అతడిపై లేదు" అనేది చెల్లి."

"అలా అని నీ మీది నమ్మకంతోనే జీవితం గడపాలనా ?"

"ఎవరు ఎవరి జీవితాన్ని గట్టెక్కిస్తారు అది కాలం తేల్చాల్సిన సంగతి. చెల్లికి యిప్పుడు నా అండకావాలి. రెండు మూడు రోజులలోనే అంతా సర్దుకొంటుంది."

"అంతా బాగుంటుంది. రొట్టి తినండి" అని భార్యా వేడి నెయ్యి రొట్టెపై వేసింది." మనం చేయగలిగింది చేశాము. ఈ మాత్రం ఎవరు చేస్తారు ?" అని కూడా అంది.

"నువ్వు స్త్రీవి. నీకు నా గురించి, పిల్లలు గురించి తప్ప వేరే ఆలోచన ఉండదు. నువ్వింకెవరినీ నీ వాళ్ళుగా చేసుకోలేవు. కాని నేను మనవాళ్ళు అనుకొంటే వాళ్ళని నెత్తిన పెట్టుకొంటాను. కాని నా వలె విశాల హృదయంతో ఆలోచించడం నీకు చేతకాదు. గోపీ వదిన యిక్కడ ఉన్నంత కాలం నా యిష్ట ప్రకారం ఆమెని చక్కగా చూశావ్. కాని నీ మనస్సు ఆమెని

నీ వాళ్ళుగా అంగీకరించలేదు. నీకేదైనా ఆపదవచ్చి నేను రాలేదనుకో అప్పుడు నీకెలా ఉంటుంది ఆలోచించు."

"చాల్లెండి ఇంకేం మాట్లాడవద్దు."

ఇష్టం లేకపోయినా మటరూ రొట్టె తిన్నాడు. భార్య తప్పు ఏంలేదు. ఆమె గృహిణిగా తన బాధ్యతలు నిర్వర్తిస్తుంది. ఆమెకి తెలిసినంత వరకు వ్యవహరిస్తుంది. ఏమీ తినక ఆమె మనస్సుని బాధపెట్టడం దేనికి ?

గుడిసె బయట చెట్టు క్రింద మంచం వేసింది. మటరూ పడుకొని హుక్కా పీల్చసాగాడు. రాత్రంతా మెలకువగా ఉన్నందున ఆ ఎండవేళ కునుకు వస్తోంది. హుక్కాని జారవిడిచి, అలా గాఢనిద్రలోకి జారిపోయాడు.

xx xx xx

సాయంత్రం అయింది.

ఎక్కడినుంచో ఆపదని సూచిస్తూ ఒక పక్షి బిగ్గరగా అరుస్తూ మటరూ తలవైపు నుంచి ఎగరడంతో అతనికి మెలకువ వచ్చింది. ఎన్ని స్వప్నాలలోంచి అతను మెలకువ తెచ్చుకొన్నాడో, లేస్తూనే "ఫూజన్ !" అని కేక వేశాడు.

పరుగున వస్తూ ఫూజన్ "ఉత్తరాకాశం నలుపెక్కింది. తుఫాను రాబోతోంది" అన్నాడు.

అప్పటికీ యింకా పక్షి కూత వినిపిస్తూనే ఉంది. మటరూ మంచంపై నుంచి లేచాడు. అటూ యిటూ చూశాడు.

"ఫూజన్ ! చెల్లికి ఏదో ఆపద వచ్చింది. ఆమె నన్ను పిలుస్తోంది." అని మటరూ సిస్వన్ ఘాట్ వైపు వేగంగా అడుగులు వేసేశాడు.

"ఎక్కడికి వెళ్తున్నారు ?" భార్య కేకవేసి అడిగింది.

"ఈ తుఫానులో ఎక్కడికి ?" ఫూజన్ అరిచాడు. వెనక్కి తిరిగి "ఇప్పుడే వచ్చేస్తాను" అని మటరూ అన్నాడు.

తుఫాను వచ్చింది. గంగమ్మతల్లి కెరటాలు విరుచుకొని పడుతున్నాయి. గాలి హోరున ఏడుస్తోంది. అడవి శివమెత్తినట్లు వూగిపోతుంది. గుడిసెలు నేల కూలుతున్నాయి.

ఒడ్డు మీద పడవ వాడిని పిలిచి మటరూ ఈ లంగరు విప్పు త్వరగా" అని తొందర చేశాడు.

"ఈ తుఫానులోనా! ఏమిటిది" అని పడవ నడిపే యువకుడు ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏం భయంలేదు. ఇవి గంగమ్మతల్లి కెరటాలు. తెరచాప ఎత్తు. నాకు తొందర పని ఉంది. నువ్వలా కూర్చో తెడ్డు నాకియ్యి" అని మటరూ అతడి సమాధానానికి ఎదురు చూడకుండానే పడవ నడపసాగాడు. చూస్తుండగానే ఆకల్లోలిత కెరటాల మీదుగా పడవ అదృశ్యం అయింది.

×× ×× ××

గోపీ యింటి దగ్గర మటరూ తలుపు కొట్టేసరికి తుఫాను మాయం అయింది. అక్కడంతా నిశ్శబ్దంగా ఉంది. ఎప్పటి వలెనే ముసలాయన గొడవ ఏంలేదు. మటరూ ముందుకు వచ్చి "నమస్కారం !" అన్నాడు. ముసలాయన ఏం మాట్లాడలేదు.

"కోపమా ? ఎందుకు! కొత్త కోడలు నచ్చలేదా ? ఆ పిల్ల మీ పెద్ద కోడలు వలె లేదూ!" మటరూ అంటున్నాడు.

"ఇక్కణ్ణుంచిపో !" ముసలావిడ అరిచింది. "ఎలా పోతాను వియ్యాల బంధం."

"నా పరువు వీధికెక్కింది ఇంకేం మిగిలింది నాకు. ముందే నన్ను చంపేసి ఈ పెళ్ళి చేయాల్సింది చండాలుడా!" అని అరిచాడు ముసలాయన.

"అంత మాటనకండి ! నా ఆయుస్సు పోసుకొని మీరు బ్రతాకలి. నేను అవాళే చెప్పాను. మా అమ్మాయి అచ్చం మీ పెద్దకోడలు వలె ఉంటుందని. అయినా యీ కబుర్లు చెప్పే వాళ్ళు, నిందలు వేసేవాళ్ళు మనకు అన్నం పెడతారా ? కష్ట సుఖాలు చూస్తారా ? మీరనవసరంగా కోపగిస్తున్నారు" అన్నాడు మటరూ.

"నోర్ముయ్! మీరంతా యింత మూర్ఖులు..." మటరూ పగలబడి నవ్వాడు.

"మీరు, మీ యీ సమాజమూ మూర్ఖులు ! కాకపోతే యీ అంధకారంలోంచి, ఈ దుష్టత్వంలోంచి, ఈ మౌఢ్యంలోంచి ఆవువంటి ఒక అమ్మాయిని రక్షించిన వారిని మూర్ఖులంటారా ?" అన్నాడు మటరూ.

"సరేలే ! నువ్వేం చెప్తావో వాళ్ళకి చెప్పు. ఇక్కణ్ణుంచి వెళ్ళిపో !" అని గద్దించాడు ముసలాయన.

"వాళ్ళెక్కడ ఉన్నారు ?"

"పశువుల శాలలో !"

"ఆ ! పాకలోనా ? ఇంట్లోకాదా ?"

"నా కంఠంలో ప్రాణం ఉండగా వాళ్ళని ఈ యింట్లో అడుగు పెట్టనివ్వను."

"పాకేం ఖర్మ ! వాళ్ళకి యింకో యిల్లుంది. నేనిప్పుడే..."

"మా తండ్రీ కొడుకుల మధ్య తగాదా పెడతావా ? నువ్వు వెళ్ళవేం ?"

"ఇది తండ్రీ కొడుకుల తగాదాకాదు. ఈ సమాజానికి ఇది సృష్టించిన వందలాది వితంతువుల మధ్య వివాదం. ఇది నా చెల్లెలి జీవిత సమస్య."

"వాడు నా కొడుకు."

"కాదు ఇంటినుంచి మీరు తరిమేసిన వాడు."

"ఇదో గొడవా ?" ముసలామె ఛీత్కరించింది.

"ఈ గుండెలపై కుంపటి పెట్టాలనే వీడు వచ్చాడు." ముసలాయన గద్దింపుగా అన్నాడు.

"మీరంతా మా ముఖాన ఉమ్మివేశారు. ఇంకా ఏం చేద్దామని" ముసలామె చేయి విదిలిస్తూ అరిచింది.

"వాళ్ళని సమాధాన పరచాలని" మటరూ అన్నాడు.

"నువ్వెవరివి ? మేం బ్రతికి ఉన్నాం" అందామె.

"కాని మీరు మరణించారని యివాళే తెలిసింది. లేకపోతే కొత్త కాపురం పెట్టుకొంటున్న వాళ్ళని పశువులపాకలో పారేస్తారా ?"

"నీకెవరు చెప్పారు ?" ములామె శాంతంగా అంది.

"బాబాయ్‌గారు ..."

"మా సంగతి నీకేం తెలుసు, నాతోరా!" అని ముసలామె అతని చేయి పట్టుకొని యింటిలోకి తీసుకు వెళ్ళింది. మటరూతో గుసగుసగా యిలా అంది.

"చూడు బాబూ ! లోకం చాలా బలమైనది. ఇరుగు పొరుగువారు అయిన వాళ్ళు, కానివాళ్ళు, చిన్నలు పెద్దలు అందరూ బురద జల్లుతుంటే భరించలేక వాళ్ళని అక్కడకి పంపించాం. ఎంతో ఓరిమి వహించాను. అయినా

తప్పులేదు మటరూ ! ఈ గ్రామంలోనే నేను పెద్ద దాన్నయాను. ఈ యింటి సంగతులేవీ దాచలేము. ఇంటి బయట ముగ్గు వేయడానికి వెళ్తే జనం ముఖాన వుమ్మి వేశారు. ఏ దురదృష్టమో ఆమె జీవితంలో యిలా అయింది. ఆ గాయాన్ని మాన్పుకొని ఆమె పెళ్ళి చేసుకొంది. ఆమె ధైర్యంగా యీ పని చేసింది. కానిపని చేసి మచ్చ ఏంతేలేదు. కాని ఆమె తప్పు చేసిందని లోకం భావించింది. గోపీ కూడా చెడ్డపని ఏం చేయలేదు. కానిపని వాళ్ళు ఏమీ చేయలేదు అనుకొని మేం వాళ్ళని యింటిలోకి ఆహ్వానించాం. దేవుడి మెడలో వేసిన పూలమాలవంటి కోడల్ని తిరస్కరించలేకపోయాము. ఆమెను యిక్కణ్ణుంచి ఎలాగెంటి వేయగలను. మేం ముసలవాళ్ళం అయాం. ఇవాళ ఉంటాం రేపు ఉండం. వాళ్ళకి యింకా ఎంతో జీవితం ఉంది. అందుకనే వాళ్ళని ఆశీర్వదించాం."

మటరూ ఒంగి ఆమె పాదాలకి నమస్కరించాడు.

"మీరెంత మంచివారమ్మా ! బాబాయ్‌గారు !" అని మటరూ గద్గద కంఠుడయాడు.

"ప్రథమ కోపం. అంతా సర్దుకొంటుంది. తండ్రీ కొడుకుపై ఎంత కాలం పట్టుదలగా ఉంటారు. బాబూ ! కాళ్ళు చేతులూ కడుక్కో ఏమైనా తిందువుగాని" అందామె.

"వాళ్ళెక్కడ ఉన్నారు?" మటరూ రహస్యంగా అడిగాడు. ఆమె నవ్వి అతని చెవిలో చెప్పింది మటరూ నవ్వాడు.

"రా ! కొంచెం తిందువుగాని" అంది ముసలామె.

"ఎలా తినగలను ? ఆమె నా చెల్లెలుకద. నేను వెళతాను. గంగమ్మతల్లి పిలుస్తోంది. అక్కడంతా కంగారు పడతారు."

అదే సమయంలో ప్రక్క గది తలుపు తెరుచుకొంది. ఆనందం మూర్తీభవించిన ఇద్దరూ వేగంగా వచ్చి మటరూ పాదాలకు నమస్కరించారు.

"గంగమ్మతల్లి నీకు సౌభాగ్యాన్ని ప్రసాదించుగాక ! దీర్ఘ సుమంగళీ భవ !" మటరూ చెల్లెలిని ఆశీర్వదిస్తూ గద్గదకంఠంతో అన్నాడు. ఆమె లేచి మేలి ముసుగులో ముఖం దాచుకొని "గంగమ్మతల్లికి నా మొక్కు ఉండిపోయింది. వదినకు చెప్పి పూర్తి చేయించు" అందామె.



Printed at Paramount Graphics Pvt. Ltd. New Delhi